వెల్లడి చేసుకోవడము బాగు. మనయిండ్లలో పెద్దలయినవారికిది క
విడ్డూరంగా కనిపించవొచ్చు కాని, పాశ్చాత్య పద్ధతిలో అది తప్పు
కాదు -"

"మోహన్, నీ అభిప్రాయము నా కర్థమైంది సుమా. ఒకమారు ఏకాంతంగా మా చెల్లాయితోనే యీ విషయమై నీవు మాట్లాడగోరుతున్నావు కదూ?"

"అవును. మీకు అభ్యంతరము లేకుంటే - నాది కేవలం పవిత్రమైన అభిప్రాయము."

"దాన్ని ఎవరు కాదన్నారోయ్? నా కేలాంటి అభ్యంతరములే ఈ దినమే అమ్మతో మాట్లాడి, ఒప్పించి, రేపే నీకా అవకాశమి ఏమంటావు?"

"అనుటేమి, థ్యాంక్సు అంటానంతే, మూర్తీ! ఇంకో ట. ఇందులో నేనేదో మీ పైన అసభ్యమైన ఒత్తిడి కలిగి ష్టు మీరు భావించకండి. మీ కిష్టమైతేనే మీరాపని చెయ్యండి. సంటేవలను. అందువల్ల నష్టమేమిలేదు. నా సంకల్పం మారదు డ."

"నీ కోర్కెలో అ సభ్యత యేమీలేదు. ఒకవిధంగా చూస్తే ప్నట్టు వివాహమునకు ముందు కాబొయ్యే ఆలుమగలిద్దఱు ఏకాంతంగా రాభి ప్రాయములను గురించి ముచ్చటించుకొని, ఒకరినొకరు బాగా సు కోవడమే మంచిది. నీ అభిప్రాయముతో నేను సంపూర్తిగా స్తున్నాను."

"అవును. కాని, మనవిద్యా సంస్కారాలకు, మనపూర్వీకుల యాలకు కొంత తేడా ఉంది. నా పద్ధతిని ఒకవేళ మీ తల్లిగారు లేకపోయినా అందువల్ల నష్టమేమియు లేదు."

కన్నీటి కాపురం

ఇంతలో "కాఫీ, టిఫెన్ రెడీ సార్ - కమాన్ సార్" అంటూ ఆనందు అక్కడికి వచ్చాడు ఇద్దరిని పిలుచుకొని వెళ్ళడానికి. "అప్పుడే టిఫిన్ ఏమిట్రా" అని కృష్ణమూర్తి వాచీ చూచుకొంటె నాలుగైంది. భోజనానంతరం పండ్రెడుగంటల కచ్చటికి వచ్చినవారు, కాలంమీద గమనమే లేకుండ వారిద్దఱు మాటలలో నాల్గుగంటలసేపు నిమగ్నులై పోయారన్నమాట.

ఎటైతేనేమి యిరువురు మనసిచ్చి మాట్లాడుకొన్నారు. తన చెల్లెలి వివాహసమస్య తా ననుకొన్నట్లు అంత తేలిగ్గా పరిష్కృత ...తుందని కృష్ణమూర్తి ఒకవంక లోలోన మురిసిపోతూ వుంటే. ఏదో ...దా కొరకు స్నేహితునివెంట షేమంగావచ్చి కన్యా లాభంతో తిరిగి ...న్నాను కదాయని రామమోహన్ అంతకంటె అధికంగానే ఆనంద ...కున్నాడు.

టిఫిన్‌లు ముగిశాయి. రెండు దినములకంటె యీ మ... యశోద కొంత సాహసించి తానే అన్నకు, రామమోహన్‌కు టిఫిన్ య... కాఫీలు తెచ్చిపెడుతూ, ఇందాకటివలె తుర్రున పారిపోకుండ కా... ఎదురుగా నిలబడి చూస్తూంది, రామమోహన్‌కు కూడ అప్పుడే ముపా... కకు పైబడి క్రొత్తదనము, బిడియము అనేవి అంతరించిపోయాయి. ఇ... వరకు యశోదను ఓరగంట చూస్తూ వచ్చాడు యింటి వారేమనుకొం... అని. ఆమెనొకమారు తాకి కౌగిలించుకొన్నప్పటికే సిగ్గు, ... వదలి పొయ్యింది. ఇందాక తనకు, కృష్ణమూర్తికి జరిగిన సం... సారాంశమువల్ల, యశోద యిక తనదేయను ధీమాతో ఉన్నకాస్త స... అంతరించిపోయి, అప్పుడే అల్లుని హోదాలోకి దిగాడు. ఇదంత... సునంద, కృష్ణమూర్తి లోలోన చాలా సంతోషించారే కాని మరేటి... ప్రాయము పడలేదు. పైగా తామింత సుళువుగా యశోదకింత ఉ... మైన సంబంధం స్థిరపరచగలిగితే. తానూ యింటఉంది తమ...

ఆహ

సంతోషపడలేక పోయాడుకదా వేంకట్రామయ్య అని అనుకొ
విచారించారు.

సాయంకాలము మోహన్ గదిలో ఏదో చదువుకొంటూ ఉ...
కృష్ణమూర్తి అమ్మను, చెల్లెలిని పెరట్లోకి తోడ్కొనిపోయి, మధ్యాహ్నం
తనకు తనమిత్రునికి జరిగిన సంభాషణనంతటిని పూసగ్రుచ్చినట్లు విని
పించి "ఇప్పుడు చెప్పండి మీ అభిప్రాయాలు" అని ఇద్దరిని ప్రత్యేకించి
అడిగాడు. సునంద యిట్లుచెప్పింది, "నా కన్నివిధముల నచ్చిందీ
సంబంధము. డబ్బున్నవాడు, చదువుకొన్నవాడు. పైగా మట్టుమర్యాద
లెఱిగినవాడు. కట్నాలు కోరేవాడు కాదు. అమ్మాయి కన్నివిధాల
తగినవాడు. మీ తండ్రి యిందుకేలాటి అభ్యంతరం చెప్పడు. ధైర్యంగా
మనము అబ్బాయికి మాట యిత్తుము. అతడొక మారేదో అమ్మాయితో
ఒంటరిగా మాట్లాడదలచినట్టు చెబుతున్నావు. ఏదో యీ కాలం పిల్ల
...దులో ఇంగ్లీషు చదువుచదివారు. కొన్ని కోరికలు విడ్డూరంగానే
...టాయి. ఏమే, యశోదా? నీ అభిప్రాయం?" అని బిడ్డవైపు
...చింది.

యశోద సిగ్గుతో, ముసిముసి నవ్వుతో అమ్మఒడిలో తలదాచు
కొని యేమి బదులు చెప్పలేదు. "నీ మౌనం అర్ధమంగీకారమా,
అంగీకారమా? యశో?" అని కృష్ణమూర్తి బుజ్జగించి రెండు
సార్లు అడిగాక మెల్లిగా "పూర్తి" అనేసింది యశోద.

"సరేనమ్మా శుభస్య శీఘ్రం. ఇంటఉండేది మనమేగా, ఇదరు
మాట్లాడుకొంటారో మట్లాడనీ. రామమోహనుని యిక్కడికి
మనమిద్దరం వెళ్ళిపోదాం రా" అని తల్లిని పిలిస్తే, యశోద
...ర పట్టుకొని. "నే నేమి ప్రత్యేకంగా మాట్లాడేది లేదు.
వెంటవస్తా"ననింది.

2[redacted]

# కన్నీటి కాపురం

ఎ కాదు, యశూ! చదువుకొన్నదానవు, నీకామాత్రం అర్థ
దా? మోహన్ చాల గొప్పబుద్ధి కలవాడు. ఆలుమగలంటే
న్మాంతం ఒకటిగా యేకైక మనస్కులతో జీవించవలసిన వాళ్ళు.
- సంగతులే అతడేదో చెప్పదలచాడంతే, మరేం భయంలేదు. నీ
విక్కడే ఉండు. అమ్మా, నేను హాల్లోనే ఉంటాము." అని కృష్ణమూర్తి
తల్లిని యీవలికి పిలుచుకొని వచ్చాడు.

యశోద బిక్కుబిక్కుమని వారివైపు చూస్తూ నిలబడిపొయ్యింది.
కృష్ణమూర్తి మిత్రుడున్నగదిలోకి వెళ్ళి అతనితో మాట్లాడి పెరట్లోకి
పంపి, తాను తల్లితో మరొకగదిలోకి వెళ్ళిపోయాడు. అక్కడుంటినా
వారికి పెరట్లో యేమిజరిగేది కిటికీగుండ బాగా కనబడుతుంది.

వివాహానికి ముందు వధువుతో కొంత ఏకాంతంగా మాట్లాడవలెనని
రామమోహన్ కోరడము కృష్ణమూర్తికి కూడ అంత సభ్యతగా కాన్పి
లేదు కాని, బయటికి తను అసమాధానాన్ని చెప్పకుండ, ఎలాగైతే
చెల్లెలి నాతడు పెండ్లి చేసుకొంటానంటే చాలుననే తలంపుతో త
యేర్పాటుచేశాడు. ఇంతకు మిత్రుని సద్భావ విషయమై మూర్తి కేల
అనుమానము లేదు, అందుకే ధైర్యంగా అమ్మను, చెల్లాయిని ఒప్పి
గలిగాడు. అయితే అందరు యీ పద్ధతి ననుసరించేందుకు
హిందూసంఘములో. ఈ లాంటి సంఘటన సామాన్య నిబ
కొక అపవాదములాంటిది. వధూవరుల పవిత్ర మనస్తత్వములన
ఉంటుంది యిందలి యుక్తాయుక్త వివేచన.

ఎంత చదువుకొన్నదైనా యింకా పెండ్లికానిపిల్ల, ఎంత
చూపులవేళ అయితేనేమి, యశోద అప్పటి తన ఒంటరిపాటు
తలచి కొంత భయపడడం సహజమే, ఆమెకు రామమోహ
ప్రేమ కుదిరింది. అన్నివిధాల తనకు తగిన జీవితస్వామి ఆ

కొ

యించుకొంది, అతన్ని వివా
కొరకే క్రిందటిదినం గదిలో
పొయ్యింది. అప్పుడే ఆ రెండు ప
కాని, యిప్పుడు మరల అతడు తన్ను
యేకాంతముగా పలుకరింపవస్తున్నాడంటె
ద్యోతకమయ్యాయి యశోద హృదయములో. న
మైన మోముతో ఆమె ఒకమారు మోహనునివైపు
నిలబడింది.

అతడామె కల్లంతదూరములో నిలబడి అడిగిన
"నిన్ను నా కిచ్చి పెండ్లిచేయాలని మీ తల్లి, అన్న సంకల్ప
అది నీకు సమ్మతమేనా?"

…… …… …… …… …… ……

"చదువుకొన్నదానవు. ఇందులో విడ్డూరమేమిలేదు. వివాహ
టె ముఖ్యంగా మనసులుకలవాలి. నిర్మలమగు ప్రేమకది మొదట
ము. పెద్దల యిష్టానికి లొంగికాని, అనివార్యమైన సందర్భములకు
యొగ్గి కాని నన్ను చేబట్టదలచావా అని నా ప్రశ్న."

"అలాంటిదేమి లేదు………"

"అంటే?"

"ఇందులో బలవంతమేమి లేదు. అంతా నా యిష్టంమీదే
గింది."

కుడికాలి బొటనవ్రేలితో నేల రాస్తూ తలవాల్చి యశోద నుడివిన
నృతవాక్కులు రామమోహనికి కర్ణానందమయ్యాయి.

"ఒకవేళ నేను మంచివాణ్ణి కాకపోతే?"

అయినా, నా కాలాంటి అను

ండే గులాబీకి సువాసనకూడ ఉంటుంది."

యిండ్లున్నవన్న మాట మరచావా?"

త బాధా కరమైనవి కావు. గుణ ప్రాధాన్యతచేత

ుందే."

రు చెప్పించారు నీకీ పాఠము."

నా విద్య – సంస్కారము – పెద్దలసేవ."

"నిన్ను చేపట్టి నేను ధన్యుడు కాగలనని నా ఆశ."

"నా ఆశకూడ అంతే."

ముందేమడగాలో తోచక మోహనుడు క్షణమాగాడు.

"మీరునన్ను త్రికరణశుద్ధిగా పెండ్లాడ నిశ్చయించారా?"

"అందుకు సందేహమా?"

"అదికాదు. తరువాత మీ పెద్దలెవరైన – "

"మా అన్నఒక్కడే నాకు పెద్ద. అతడు నా మాట కెదురాడ నే నాతనిమాట కెదురాడను."

"అక్కడే ఉంది చిక్కంతా? ఆతడొకవేళ మనసంబంధా కిష్టపడకపోతే?"

ఆ అనుమానము నీ కెందుకు? మా తలిదండ్రుల తరువాత అ నాకు తల్లి తండ్రి. నాకు నచ్చినపిల్లనే యేనాటికైన చేసుకోమంట కానీ ఇందులో అతని బలవంతమేమి ఉండదు."

లము. అభిప్రాయభేదము

"తరువాత నా నుండి మీ

"విభేదాలకు నీవుకాదు కారణ

"వివాహమెప్పుడు నిశ్చయించారు?"

"వీలైనంతత్వరలో, మా అన్నభార్య గ
ఈ నెలలో ఆతనికి రెండవపెండ్లి జరిపి, వెంట
యత్నము చేయిస్తా."

........................................

"అయితే ఇప్పుడు మీ తండ్రిగారు ఊళ్ళో లేరుకదా. మనము
చేసుకొన్న యేర్పాటువారికి సరిపడుతుందంటావా?"

"నిస్సందేహంగా. మాకా యనుమానమేవద్దు."

"అయితే నిన్ను నా హృదయేశ్వరిగా స్వీకరించి వెళ్ళవచ్చును
దా?"

"నిరభ్యంతరంగా. నేను ధన్యురాలను."

ఇరువురి మొగాలు ఒకేమారు చిరునవ్వు వెన్నెలతో వెలసినాయి.
మమోహనుడు వెనుదిరిగి వచ్చాడు.

తల్లికొడుకు లిద్దరుమరుగుననుండి జరిగినదంతా చూచారు కాని,
రిమధ్య నడచిన సంభాషణను మాత్రము పూర్తిగ వినలేకపోయారు.
ఎంతమట్టుకు జరిగిన దూహించుకొని సంతృప్తి పడ్డారు. ఇంకా

మా?" అని అన్నావు

అని మోహన్ అబ్బాయి బుగ్గలు

ంట."

. మీ అన్న వస్తాడేమో కనుక్కో."

మనకంటేముందే ఉంటాడులే కొత్తపిచ్చరొస్తే."

కృష్ణమూర్తి, మోహన్ నవ్వుకొన్నారామాటకు. "అమ్మను అక్కను తయారుకమ్మను అందరం వెడదాం." అని కృష్ణమూర్తి సినిమా ప్రోగ్రాం నిర్ణయించినాడు. ఆనందు గంతులేసుకుంటూ వె అమ్మకు, అక్కకు చెప్పాడా సంతోషవార్త.

బస్తీలో పెద్దపెద్ద పిచ్చర్ ప్యాలెస్‌లకు సినిమాలు చూచే పల్లెటూరిలోని టూరింగ్‌టాకీస్ చూడగోరుతారా? అయినా, ఆనం సరదాకాదనలేక పోయారు మూర్తి, మోహన్ యిద్దరు. పైగా అ జరిగిన సంతోష కార్యక్రమానికది సంతోషవిషయం కావలెనని తలంపు.

# 3

ఇక తెల్లవారితే బుధవారం. ఉదయం బస్సుకు రామమోహనుడు మరల గుంటూరుకి వెళ్ళి, కొన్నాళ్ళక్కడుండి, తమ ఊరికి వెళతానని చెప్పాడు.

వేంకట్రామయ్య ఇంకా యింటికి రాలేదు. నేడొస్తాడు, రేపొస్తాడని చెప్పి మూనాళ్ళ క్రిందటనే ప్రయాణమైన మిత్రుని నిలిపారు సునంద, కృష్ణమూర్తి కాని, ఇంటి యజమాని ఎంతకు రాలేదు. "సరే అత డొచ్చిన వెంటనే సింహాద్రిపురానికి మేమిద్దరం వచ్చి, మీ అన్నగారితో అన్ని సంగతులు మాట్లాడి ముహూర్తం నిశ్చయం చేస్తా" మన్నాడు మూర్తి. సునందకూడా అదే మాటన్నది. మోహనుడు "అలాగే చెయ్యండి చేసుకొంటే యీ జన్మలో మీ అమ్మాయిని చేసుకొంటా. లేకుంటే జన్మాంతరం బ్రహ్మచారినై ఉంటా, అంతేకాని ఈ హృద యములో ఇంకో ఆడువానికి చోటులే" దని ప్రమాణ పూర్వకంగా చెప్పాడు.

అందరు మహదానందముతో ఏవేవో ముచ్చట్లాడు కొంటూ కలువల పల్లికి రాత్రి కడసారి వచ్చే బస్సు వరకు వేచి ఉండి, వేంకట్రామయ్య రాకపోయేసరికి భోజనాలకు లేచారు.

ఆ రాత్రి ఆనందు బావ ప్రక్కనుండి కదలలేదు. అతని పరక మీదనే పడుకొన్నాడు. యశోద ఒకవైపు, మోహనుడొక వంక యేవేవో మధుర స్వప్నాలతో రాత్రిని గడపి వేశారు.

బస్సు ఉదయం ఎనిమిదింటికి బయలుదేరుతుంది. సునంద పెందల కడనే లేచి వేడినీళ్ళు కాచింది. అందరు స్నానాలుచేసి టిఫిన్ ముగించారు. కృష్ణమూర్తి ఒక నౌకరుతో మోహన్ పెట్టే పరుపు బస్సు వద్దకు పంపి

ందునుకూడ పొమ్మన్నాడు. కాని, అబ్బాయి కొంత నసిగాడుతూ బావ వెంట పోతా"నన్నాడు.

"ముగ్గురింటి నుండి బయలుదేరరాదు, బాబూ. నీవు ముందుగా వెళ్ళి బావకు ఫ్రంటుసీటు రిజర్వు చెయ్యి" అని సునంద పురమాయించే సరికి "అలాగే, నేనేపోయి ఫ్రంటు సీటులో కూర్చుంటా" నంటు ఆనందు నౌకరు వెంట పరుగెత్తాడు.

వాని సరదాలకు అందరు నవ్వుకొన్నారు. మోహన్ కృష్ణమూర్తిని కౌగలించుకొని, వియోగము తలచి కాబోలు కళ్ళు చెమ్మగించుకొన్నాడు. ఆ యిరువురి మైత్రిని చూచి సునంద, యశోదకూడ ఆనంద బాష్పాలు రాల్చారు. మోహన్ సునందకు నమస్కరించి సెలవు గైకొని, చూపులతోనే యశోదకు చెప్పి బయలు దేరాడు మూర్తితో.

మిత్రుని సాగనంపి అన్నదమ్ము లిద్దరు ఇంటికి వచ్చేసరికి తొమ్మిదైంది.

విధివిలాస మంటే యిలాటిదే కాబోలు. ఆ దినం మధ్యాహ్నం బస్సుకే దిగాడు వేంకట్రామయ్య. అతని రాకచే యింటివారి సంతోషం కూకటి ముట్టింది. అందరు హర్షప్రఫుల్ల వదనాలతో స్వాగత మిచ్చారు యింటి యజమానికి. అతని ముఖం కూడ ఆనంద వికాసితంగా ఉంది. కృష్ణమూర్తిని చూచి అతడు "ఏమిట్రా, మూర్తీ, ఎప్పుడొచ్చావు?" అని కుశల ప్రశ్నలడిగి, బిడ్డ తెచ్చియిచ్చిన చెంబెడు నీటితో పాదప్రక్షాళన చేసుకొని, చెంబును వాపసు యిస్తూ, ఆమె బుగ్గమీద చిటికె వేసి హసన్ముఖుడై "నా చిట్టితల్లి అదృష్టవంతురాలు." అని చాపమీద వచ్చి కూర్చున్నాడు.

అతడన్న మాట ఎవరికి అర్థము కాలేదు. పైగా సామాన్యంగా అన్నమాట కాదు. అందులో ఏదో విశేష ముందని సునంద, కృష్ణమూర్తి యశోద ముగ్గురు యేక కాలములో ఊహించారు.

## కన్నీటి కాపురం

వేంకట్రామయ్య కొడుకు నడిగాడు కాలేజీ పరీక్షలు, ఫలి. గురించి.

"అప్పుడే ఫలితాలా? ఇంక రెన్నెల్లకు గాని తెలియదు. అయినా భయము లేదులే, నాన్నా!" అన్నాడు మూర్తి.

తరువాత వేంకట్రామయ్య చిన్న కొడుకును దగ్గిరికి తీసికొని "బాబూ, నీ సంగతేమిటి?" అని అడిగాడు.

"బావ" సంగతి చెప్పాలని ఉర్వట్లూగుచున్న ఆనందు కిప్పుడవకాశం దొరికింది.

"నాన్నా, బావ ఈవేళే ఉదయం బస్సుకు వెళ్ళిపోయాడు. నీవు నిన్నయినా వచ్చి ఉంటే చూచి ఉందువు."

అనే సరికా మాటలర్థము కాక వేంకట్రామయ్య

"బావ ఎవరే?" అని భార్య వైపు చూచాడు.

"బలేవారు లెండు. ఒకటి రెండు దినాల్లో వస్తానని చెప్పిపోయిన వారు యిన్నాళ్ళా పోయేది?"

"సరే, ఏదోపని ఉంది నిలిచాను. మీతో చెప్పలేదు కాని, ఈసారి అమ్మాయికి తగిన సంబంధం దొరికే వరకు ఇంటికి రాకూడదనే వెళ్ళాను."

ఆ మాట కెందుకో ఆనందునికి తప్ప తక్కిన ముగ్వురి గుండెలు గతుక్కు మన్నాయి. సునంద కన్నులింత చేసికొని "అయితే, సంబంధం దొరికిందన్న మాట?" అనింది.

"దొరకడ మేమిటి. కుదుర్చుకొనే వచ్చాను. నిక్షేపంలాంటి అల్లుడు" అని వేంకట్రామయ్య నలుమూలల నేతితో తడిసిన కుంకుమ మరకలుండే ఒక పావుతావు కాయితాన్ని తీసి కృష్ణమూర్తి చేతిలో పెట్టి



34

# కన్నీటి కాపురం

•, మూర్తీ, మీ అమ్మ వింటుంది." అని ఉత్సాహభరితంగా తురు తెచ్చియిచ్చిన కాఫీ గ్లాసు ఖాళీ చేయసాగాడు.

అది లగ్నపత్రిక. మూర్తి దాన్ని చదువుతూ చదువుతూ "నాన్నా" అని అఱచి క్రింద పడిపోయాడు.

త్రాగుతున్న కాఫీగ్లాసు నవతల పారేసి వేంకట్రామయ్య గాభరాతో లేచి కొడుకునెత్తి కూర్చోబెట్టి "మూర్తీ! మూర్తీ! ఏమైందిరా నాయనా?" అని అడిగేడు. సునంద ఒక వంక గ్రుడ్ల నీరు గ్రుక్కుకొనుచు పరుగెత్తి వచ్చి కొడుకు నదిమి పట్టుకొని "మూర్తీ! ఏమిట్రా, అబ్బాయి?" అని బాధపడ సాగింది, దిక్కుతోచక యశోద ఒక వంక నిర్ఘాంతపడి చూస్తూంది.

మూర్తి ఒక క్షణమయ్యాక అందరినీ చేత్తో వారించి, "ఏమిలేదు" అని అంటూ వెలుపలికి లేచిపోయాడు. "ఎక్కడికిరా?" అంటే మాట్లాడ లేదు. వేంకట్రామయ్య కిదేమి అర్థంకాలేదు.

"ఎందుకే కాయితం చదువుతూ అలా పడిపోయాడు మూర్తి?" అని భార్య నడిగేడు.

"అసలా కాయిత మేమిటండి? ఏదో లగ్నపత్రిక లాగుందే."

"అవును, లగ్నపత్రికే. శుభోదయమని మన అమ్మాయికి వరుణ్ణి కుదుర్చుకొని, ముహూర్తం నిశ్చయించుకొని, లగ్నపత్రిక వ్రాయించుకొని వచ్చాను."

"ఎవరండీ ఆ వరుడు?"

"సింహాద్రిపురం దివాకరరావు, మంచి ధనికుడు. రెండవ పెండ్లనుకో – అయితేనేం? వయసింకా ఇరవై ఐదేండ్లు. చాలా బాగుంటాడు. ప్రస్తుతం తాలూకా కచేరీలో గుమాస్తాగా ఉన్నాడు" అని వివరాలు వివ

రించే సరికి సునంద తలవాచుకొంటూ అందుకే కష్టపట్లా అయిపోయాడు" అని తాను విచారిస్తూ ఏడ్చుంది.

"ఏమిటే మీఘోరణంతా? నాకేమీ అర్థం కావటం లేదు."

ప్రక్కన చూస్తే యశోదకూడ లేదు. గదిలో పడుకొని వెక్కి వెక్కి యేడుస్తున్న ధ్వని వినబడింది. వేంకట్రామయ్య నెత్తిన పిడుగు పడ్డట్లయింది. ఎవరు ఏమి మాట్లాడకపోయేసరికి కతడు ఆనందుని చూచి "బాబూ, ఏమిటిదంతా?" అని అడిగేడు కాని, వాడేమి సమాధానం చెప్పగలడు?

కృష్ణమూర్తి మళ్ళీ తిన్నగా లోపలికి వచ్చాడు కన్నులు తుడుచుకొంటూ తల వాల్చుకొని. తండ్రిమళ్ళీ ప్రశ్నించేసరికాతడిట్లన్నాడు.

"ఈ దివాకరరావు కొక తమ్ముడున్నాడని నీకు తెలుసునా?"

"ఉన్నాడట. గుంటూరులో బి. యస్. సి. చదువుతున్నాడని దివాకరరావే చెప్పాడు. అతని పేరు రామమోహన్"

"రామమోహన్ నేను క్లాస్‌మేట్లం, నాన్నా!"

"మరీ సంతోషం. ఇందుకు విచారమెందుకు?"

ఇప్పుడానందునకేమి యర్థమైందో కాని తండ్రిని చూచి "నాన్నా! అతడే బావ. అన్నయ్య వెంట వచ్చాడు. ఈ ప్రొద్దున్నే బస్సుకెళ్ళిపోయాడు." అన్నాడు.

"ఔనా, మూర్తీ?"

"అవును. నేనే అతన్ని పిలుచుకొని వచ్చాను. మీరు యశోదకు తగిన వరుడు దొరకలేదని పడే బాధ చూడలేక, రామమోహనుని యింటికి పిలుచుకొని వచ్చి, అమ్మాయిని చూపించినాను."

"తరువాత?"

"తరువాత యేమిటి? రత్నంలాటి అబ్బాయిని ఎవరొప్పుకోరు? అమ్మాయిని చేసుకొనేందుకతడొప్పుకున్నాడు. అబ్బాయిని చేసుకొనేందు కమ్మాయి ఒప్పుకొనింది. ఇప్పుడేమి చేయమంటారో చెప్పండి" అని సునంద ప్రశ్నించింది.

వేంకట్రామయ్య కేమి చెప్పడానికి పాలుపోలేదు. విషణ్ణుడై అట్లే గ్రుడ్లప్పగించి చూస్తూ కూచున్నాడు.

ఇంతలో ఆనందు గదిలోకి పారిపోయి, టేబిల్ డ్రాయర్‌లో అన్న ఉంచిన రామమోహన్ ఫోటోను తెచ్చి తండ్రికి చూపి "ఇతడే, నాన్నా. బావ" అన్నాడు.

ముందుపోయిన నుయ్యి – వెనుకకు పోయిన గొయ్యి – ఇప్పుడింకేమి చేయడమా అని వేంకట్రామయ్య విచార సాగరములో పడ్డాడు. క్షణ మాత్రం ఎవ్వరు మాట్లాడలేదు. గదిలోనుండి యశోద దుఃఖము మాత్రం వినబడుతూంది. సునంద బిడ్డ నూరడించేందుకు లోపలికి వెళ్ళి పోయింది.

ఆనందుతెచ్చి చేతిలో పెట్టిన ఫోటోను వేంకట్రామయ్య బాగా పరిశీలించి చూచాడు – అన్నదమ్ము లిద్దరు ఒకే పోలిక. పోతే, దివాకరరావు కొంత స్థూలంగా ఉంటాడంతే.

"మూర్తీ! ఇప్పుడేమి చేయమంటార్రా, బాబూ?"

"అదే నాకూ తోచకుంది, నానా! ఇప్పుడెవరిని కాదంటాము?"

"ఎవరిని కాదనేది. ఇంతకు మీది పొరబాటందామా – అదీ కాదు. నా ప్రయత్నం మీకేమి తెలుసు."

"ఇంక మీదిమాత్రం పొరబాటెట్లవుతుంది. మీరు ఎప్పటి ట్లే మీపని మీరు చేశారు."

"ఇంతకు అమ్మాయిని చూడకుండ అతడెట్లు ఒప్పుకొని, లగ్న పత్రిక వ్రాయించాడండి?" అని అంటూ సునంద బయటికి వచ్చింది.

"నే నీలోగా ఎటుంది ఎటు వచ్చునో యని అమ్మాయి ఫోటోను వెంట తీసుకొని పోతూవున్నానుగా? నీకా సంగతి తెలీదూ?"

"అవును. మరిచాను."

ఇప్పుడు ఏమి చేయవలెనో తోచకున్నది." అని వేంకట్రామయ్య. క్షణ మూరకుండి "దివాకరరావుకే వ్రాసేస్తే?"

"ఏమని?"

"ఆ అమ్మాయి మీ తమ్ముణ్ని ప్రేమించిందని ఇక్కడ జరిగిన సంగతంతా తెలుపుతూ?"

"ఏమి నాన్నా! ఇంత అమాయకంగా అడుగుతున్నావు? దివాకరానికి మీరుపిల్లనిస్తామని లగ్నపత్రిక వ్రాసియిచ్చివచ్చి, ఇప్పుడు నీకియ్యడము లేదు, నీ తమ్మునికిస్తామంటే ఆ మాటకు అన్న హర్షిస్తాడా? తమ్ముడు హర్షిస్తాడా? ఇద్దరిని పోగొట్టుకొంటా మంతే."

"అవును, బాబూ, నీవన్నమాట నిజమే."

"అయితే అమ్మాయి దివాకరరావునే చేసుకోవలసిందేనా? అది దాని మనసును తమ్మునికప్పగిచ్చింది కదా? దాని గతేమి?"

"సునందా! ఇది తనంతకు తాను తెగే సమస్య కాదు. ఏలాగో మనమే తెగించాలి. మూర్తి అన్నట్టు యీ సంగతి విన్నాక రామమోహన్ మనసు మార్చుకుంటాడు. అన్నను ఎదిరించే వాడు కాదతడని విన్నాను. ఎగదీసిన గోహత్య — దిగదీసిన బ్రహ్మహత్య. ఏదో ఒక దానికి తల ఒగ్గి నిలవాల్సిందే కదూ."

లోపలినుండి యశోద "అమ్మా! నేను చచ్చిపోతే మీకే యిబ్బంది లేదే," అని యేడుస్తూ అనింది.

"ఛా - ఏమిటమ్మా నీ అఘాయిత్యము? శుభమా అని పెండ్లి ముహూర్తం నిర్ణయించుకొని వస్తే యీలా మాట్లాడొచ్చా?" "అవును, నాన్నా! నేనట్లు మాట్లాడకూడదు కాని, యీ హాలాహలాన్ని మ్రింగ వలసింది నేనేగా? ఎట్లు మ్రింగగలనో చెప్పండి. మనసిచ్చి మాట యిచ్చిన వాణ్ణి కాదందునా? కన్న తలిదండ్రులను కాదందునా? ఇంతకంటే మరణమే నాకు సుఖదాయకం కాదా?"

మరల అందరు "అలా అనరాదమ్మా" అన్నారు కాని, అనక మరేమి చేస్తుందని విచారించదొడగారు.

"నాన్నా ఈ లగ్న పత్రిక ఎప్పుడు వ్రాయించారు? మొన్న సోమ వారం. ఎందుకు?"

"రామమోహన్ ఈ దినమే గుంటూరికి వెళ్ళాడు. అతనికింకా ఈ సంగతి తెలిసి ఉండదనుకొంటూ. నేనతన్ని వెంటనే కలుసుకొని మాట్లాడిన తరువాత కాని ఏమి చెప్పడానికి వీల్లేదు,

తల్లిదండ్రు లిద్దరు అదే మంచిదన్నారు. కృష్ణమూర్తి చెల్లెలి గదిలోకి వెళ్ళి "యశోదా! విచారించకు, తల్లీ, నేనిప్పుడే గుంటూరికి వెళ్ళి రామమోహన్‌తో మాట్లాడీవస్తా. జరిగిన పొరబాటేదో జరిగి పోయింది. ఇప్పుడెవరినని ఏమి లాభం? ఎవరో ఒకరు త్యాగహృదయులు కాకున్న ఈ సమస్య తెమలదు," అని ఊరడించినాడు.

అతడనిన కడపటి వాక్యము యశోద మనసులో గాఢంగా నాటు కొనింది.

ఇంతకు వచ్చాక కేవలం భాతృప్రేమ కల మోహన్ తన అన్నకై నిర్దేశింపబడిన తనపై ప్రేమ వదలుకోవచ్చా - లేదా, తన రెండవ పెండ్లి కంటే తమ్ముని ముచ్చటనే ఎక్కువగా తలచి దివాకరరావే తన్ను వదలి వేయవచ్చు - ఈ అన్నదమ్ములలో ఏలాటి పోరు పొచ్చెం లేకుండా ఉండా

లంటే తానే మనసు మార్చుకొని తండ్రిచేసి వచ్చిన నిర్ణయాలకి లోబడ వలసి వస్తుందేమో – యశోద దీర్ఘంగా ఆలోచించసాగింది.

కృష్ణమూర్తి గబగబ భోజనంచేసి గుంటూరు బస్సుకు బయలుదేరి వెళ్ళిపోయాడు.

# 4

రామమోహన్ బస్సు దిగి రిక్షాలో తన గది చేరుకొన్నాడు. అప్పటికింకా పదిన్నర గంటలైంది. గదితలుపులు తీసేసరికి ప్రక్కన కిటికీలో నుండి పోస్టుమన్ పడేసిన మూడు ఉత్తరాలు కంటబడినాయి. అందులో రెండు కార్డులు – ఒకటి యేదో పుస్తకాల కంపెనీ నుండి వచ్చింది, రెండవది ఎవడో స్నేహితుడు వ్రాసింది. మూడవది కవరు దస్తూరీని బట్టి అది అన్ననుండి వచ్చిందని మోహన్ గ్రహించడమే.క, దాని మూలలకు మంగళకరంగా పసుపు రాచబడింది చూచి, అది శుభలేఖ యని భావించి సంతోషముతో నవ్వుకొని చించిచూచాడు.

అది దివాకరరావు వ్రాసిన ఉత్తరం. దానికి కూడా నాలుమూలల పసుపు రాచబడింది. అందులో ఇట్లుంది.

చి॥ రామమోహనునికి. మీ అన్న చేయు ఆశీర్వాదములు ఉభయ కుశలానంతరం,

మీ వదిన పోయాక మరల వివాహమే చేసుకోరాదని ఉంటిని. కాని నీవు మూన్నెల్ల క్రిందట వ్రాసిన ఆఘాయిత్యానికి లోబడి మరల పెండ్లి చేసుకొంటానని మాట యిస్తిని. ఏ ముహూర్తాన ఆ మాట నంటినో అప్పుడే పిల్ల కుదిరి ముహూర్తం కూడ నిర్ణయమైంది.

ఈ వైశాఖ బహుళ పంచమి గురువారం లగ్నం జరిగేలాగు కన్యాదాత, నేను మొన్ననే లగ్నపత్రికలు వ్రాయించాము. ఇదంతా నీకు సంతోషమే కదా ?. నీకు మరల ఒక వదిన వస్తుంది. విచారించకు.

ఎవరా వదిన అంటావేమో ? కలువలపల్లి వెంకట్రామయ్యా కూతురు చి॥ యశోద అనే కన్య -

ఆ మాట చదువుతూనే కొరడాదెబ్బ తిన్నవానివలె మోహన్ "హా" అని. చేతిలోని జాబును జారవిడిచి పోయి యీజీ ఛైర్‌లో కూలబడినాడు, కన్నులకు బైర్లుకమ్మినట్టయింది. మనసంతా కళవళపాటుచెంది, శరీర మాద్యంతము ముచ్చెమటలు పోశాయి. ఒకటి. రెండు నిమిషాల పాటతనికి ఒడలమీద ప్రజ్ఞలేదు.

కన్నులు తెఱచి మోహన్ మరల జాబునందుకొని "ఎవరా వదిన అంటావేమో ! కలువలపల్లి వెంకట్రామయ్యా కూతురు చి॥ యశోద అనే కన్య - " అనే వాక్యాన్ని పదిమార్లు చదువుకొన్నాడు సంశయ నివృత్తి కొరకు.

"కలువలపల్లి మరొకటుందా ? - లేదు ఉందేదొక్కటే, అదే కృష్ణమూర్తి ఉండేవూరు. అతని తండ్రియే వెంకట్రామయ్యా - ఆ వెంకట్రామయ్యా కూతురే యశోద - అనగా, తాను ప్రేమించి వివాహమాడు తానని వాగ్దానంచేసి వచ్చిన సుందరి –

ఇందులో భ్రమలేదు - అసత్యములేదు - అసంభవములేదు, నిజముగ అది తన సోదరుడు వ్రాసిన జాబే, ఎవరో కల్పించినారనేందు కాస్కారమే లేదు.

జాబు నిర్జీరమైనదైనా సజీవమై తన్ను వెక్కిరిస్తూ ఉన్నట్లుంది రామమోహనునికి.

నిజమే - ఇన్నాళ్ళుగ పత్నివియోగమొంది ఒంటివాడై పోయిన

అన్న తన క్రొత్త సంసారాన్ని మరల తయారు చేసుకోబోతున్నాడు. ఇరువురు ఒకటైపోగలరు. కాని, –

తన పాలిటికి ఒకటైపోయిన యిద్దరు వేరైపోతున్నారు. ఒకరి నొకరు వదలిపోతున్నారు.

యశోద కంటిఎదుట కాన్పించిది. తనముఖములోను, ఆమె ముఖములోను వియోగ విచారము గూడుకట్టుకొని కాన్పిస్తూ ఉంది. ఇరువురి స్థితులు దైన్యపూరితములు – అసహాయకములు – ఎవరితో చెప్పుకొన గలరు ?

నిజమే అన్న జీవితము స్వర్గమౌతుంది – తనదో, నరకం !

నాలుగైదు దినములనుండి తాను సృష్టించుకొన్న స్వర్గమినాడు మహా నరకమైపొయ్యింది తన పాలిటికి –

ఆక్షణంవరకు యశోద తనదనుకొన్నాడు – ఇప్పుడో –

అమె, తాను పరస్పరంగా వ్యక్తపరచుకొన్న ప్రేమ, విశ్వాసము – స్నేహము – నేడు కాలపురుషుని కాలిక్రింద నుసినుసి యైపోయాయి. ఇంతవరకు ప్రేమామృతముతో తరుగని హృద్భాండమిప్పుడు శూన్యమై ఎండిపోసాగింది – అదే హృదయములో ఎవరినైతే చిత్రించుకొని పూత ప్రేమామృతముతో చిలికించి, ముద్దాడి హత్తుకొని ఉండెనో ఆ వ్యక్తినే యికమీద పూజనీయురాలగు "వదినె"గా భావించి, గౌరవించవలసి వచ్చింది –

ఈ హృదయ మింతవరకు పరిపూర్ణమగు పవిత్రమైన భ్రాతృ ప్రేమతో నిండి తొణికిసలాడింది. ఆ ప్రేమామృతాన్ని దొర్లించి, విషముతో నింపనగునా ? –

"ఎవరా వదిన అంటారేమో ! కలువపల్లి వెంకట్రామయ్య పుతురు చి॥ యశోద యను కన్య – "

అవును – యశోద దివాకరరావు పత్ని కాగలదు – అతని సంసార శకటానికి పూన్చిన రెండవ ఎద్దు కాగలదు. ఆమె అతని హృదంత రాళాన్ని ప్రేమకళికతో వెలిగించి, సంసారాన్ని స్వర్గధామంగా చేయ గలదు –

కాని, తనముందుగతి ? – వెనుకటిరాత్రియేకదా కృష్ణమూర్తి, సునంద, వింటూ ఉండే తాను. "చేసుకొంటే యీ జన్మలో మీ అమ్మా యిని చేసుకొంటా. లేకుంటే, జన్మాంతం బ్రహ్మచారినై ఉంటా – అంతేకాని, యీ హృదయములో ఇంకో ఆడుదానికి చోటులేదని ప్రమా ణము చేసి వచ్చినాడు.

విధితల విపరీతమైనది. కానున్నది కాదు. కారానిది ఔతుంది. అమృత భాండము విషకుంభమౌ తుంది – విషకుంభమమృత మౌతుంది.

ఇందులో తప్పేమికలదు ? మూడేండ్లనుండి ప్రాణప్రియవగు పత్నిని కోల్పోయి, ఒంటరిగా జీవిస్తున్న తన అన్నను తానేకదా పునర్వి వాహమునకై ప్రోత్సహించింది ? అతనికి తెలుసునా తాను యశోదను – యశోదతన్ను – ప్రేమించినసంగతి ? ఎట్లు తెలియగలదు ? ఇందులో అతని తప్పేముంది – అంతా తన దురదృష్టము కాకపోతే –

తానింతవరకు సంసారి కాదు. సంసారసుఖమే తనకు తెలియదు. అన్నసంగతి వేరు – స్వర్గధామమునుండి నరకములో పడిపోయాడు – ఈ మూడేండ్లనుండి ఇంటిలో ఒంటరిజీవితం, హోటల్ తిండి, ఇంటిలో "నీవా" అని అడిగేవారు లేరు –

ఇకముందు – మరల వివాహమైతే – యశోద సాంగత్యముతో మరల అతని సంసారం కుదుట పడుతుంది అతడు సుఖపడగలడు. యశోద అతన్ని సుఖింపజేస్తుంది. ఎడారివంటి అతని జీవిత మామె మరల పచ్చిక మైదానమౌంతుంది. కాని, –

యశోదకు మాత్రము సుఖములేదు. తన కల్పించిన నిండుహృదయాన్ని మరియొకరి కర్పించగలదా ? ఆమె అట్టిదికాదా? ఆమెకింక రెండే గతులు శరణ్యం . బతుకగోరితే హృదయ మొకనికి - దేహమొకనికి అర్పించి తన జీవితాన్ని అంధకార మయంగా ఉంచుకోవలసిందే. లేదా, ఆత్మహత్య -

అబ్బా ! విధివిలాస మెంత విపరీతమైనది !

ఈ వివాహ పరిణామము నిజముగ విపరీతమైనది, పెండ్లి తరువాత అన్న జీవితము సుఖమయమౌతుంది. కాని, యశోద జీవితమంతా అగ్నిపరీక్ష అవుతుంది. ఆమె భవిష్యత్తు కన్నీటి కడలి - తన జీవిత మొక సహారా ఎడారి.

జీవితమంతా సుఖదుఃఖమయము కదా ! సామాన్యుల బ్రతుకెప్పుడు బాధ, విరక్తి, కష్టము, కార్పణ్యము, కన్నీరు మొదలగువానితో నిండినది. ఇందు సుఖమున కంటె దుఃఖమే హెచ్చు. అయినను, సుఖదుఃఖములలో సమబుద్ధి కలిగి. సామరస్య జీవితమును జరుపగలిగిన వారే వివేకులు. సముద్రములో అలలు లేకుంటే ఎంతబాగుండును ! జీవితములో కష్టములు లేకుంటే ఎంతబాగుండును !!

"మోహన్ నిన్ను వలచి, వలపించిన స్త్రీ యికమీద నీకు వదినె కాబోతుంది" - రామమోహనుని హృదంత రాళములో యీ ఘోష బయలు దేరింది,

- లగ్న పత్రిక మోహనుని వెక్కిరిస్తూ ఉంది.

"అయ్యో - సర్వనాశనమైనది. నేను చెడిపోతిని - అన్ని విధముల చెడిపోతిని" - మోహనుడు అరచేతితో నొసలు బాదుకొన్నాడీరీతిగా మనసులో ఆక్రోసిస్తూ -

"మోహన్ ! ఇదిగో నేనికమీద నీకు వదినెను కావలెను సుమా ?"

అని యశోద వీపుపై తట్టి పకపక నవ్వినట్లయినది. రామమోహన్ అదరిపడి వెనుదిరిగి చూచాడు. అంత తన మనో భ్రాంతి అని అర్థమైంది — పునః విచారములో పడ్డాడు. హృదయమాక్రోశిస్తూంది" మోహన్ ! చెడిపోతివి. సర్వవిధముః చెడిపోతివి. నీ బ్రతుకిక సహారా ఎడారి"

తానభిలషించిన ప్రీతికరమైన వస్తువు వేరొకరి వశమైనప్పుడు మానవుడు వివేక శూన్యుడై లోకమునే తెగనాడును, అందరు వాని దృష్టికి పాపులు — వంచకులు - దుష్టులు. ఉదారభావముతో "తన పాలికి వచ్చినదే పంచామృతము" అని సంతృప్తి పడువారే యీ లోకములో సుఖవంతులు.

"యశోదా! నన్ను వంచించితివా? నిన్ను నమ్మిన నాకు ద్రోహమెంచితివా? నీవు నా భార్య కాదగినదానవయ్యు, నన్ను విడిచి మా అన్నను చేపట్టెదవా! నాకిక మాతృమూర్తియగు వదినె యగుదువా?" - అని రామమోహనుడు లోలోన పలవరించాడు.

"అవును నేను తల్లిలేనివాడను, నాకు నీవు మాతృదేవతగా ఉండుటే లెస్స. నడుమనచ్చిన పత్నికంటె కని పెంచి చల్లని ప్రేమతో జూచు తల్లి శతాధికురాలు. యశోదా! నీవీ నూతనపాత్రవహించి నన్ను ధన్యునిజేయుము" - మరల అతడు కలవరించాడు.

"అబ్బా! ఆ సాయంకాలమెన్ని వేదాంతాలు చెప్పావు, యశోదా! చూడముచ్చటగానున్న గులాబీకి ముండ్లున్నాయి. ఔనుకదా? నా నుండి మీ రన్నదమ్ములు - అని ఏమో అంటివే, ఇదే నా నీజోస్యము? 'నన్ను నిరభ్యంతరంగా మీ హృదయేశ్వరిగా స్వీకరించండి' అంటివే - ఇప్పుడు పాపవిధి నిన్ను నా హృతీ స్థానమునుండి గెంటివైచి అవతలకు నూకివేసింది — నా హృదయము శూన్యమైనది. ఇక నా గతి యేమి? నీగతి

యేమి?" రామమోహనుని మనోభాండము వేడివేడి ఆలోచనలతో కుత కుతమంటూ ఉంది.

అతడిపుడొక అజ్ఞాతలోకములో విహరిస్తూ ఉన్నాడు. మనో నేత్రము ఎదుట వారము దినములనుండి కలువలపల్లిలో జరిగిన ప్రతి చిన్నవిషయము దృక్పథముమీద సినిమావలె తరలిపోతూఉంది.

—ఆ ముగ్ధమోహన దృగంచలములతో తన హృదయమును భేదించివేసినది యశోద. అమృతమయమైన చిరునవ్వు చిందించి హృదయములో మాయని గాయమేర్పరచింది - సర్వ భోగము నధఃకరిం ఉపగూహ నానందముతో మైమరపించింది - హాసలీలా భావము పెరడులో నిలిచి తన అమృత లతలాంటి దేహదృశ్యముతో తన్మయత చేకూర్చింది.

రామమోహనుని కల లంతరించేస్థితిలో లేవు. - హృదయములో సింహగర్జనలు వినబడుతున్నాయి. ఏదో అజ్ఞాత ప్రబోధము చెవిసోకి ప్రతిధ్వనిస్తూ ఉంది - "యశోద నీకు వదినెగా నుండ గలదు. నీవు ప్రేమించిన సుందరి నీకు మాతృసమానురాలగును. నీ వామె నాదరించవలెను — గౌరవించవలెను - పూజించవలెను."

హృదయములో ఒకవైపునుండి ప్రతిఘటన బయలుదేరింది - "లేదు, నేను యశోదను గౌరవించలేను, పూజించలేను, ఆమె నాకు మాతృసమానురాలు కాదు, నాకు వదినెకాదు. నేను ప్రేమించిన యువతి - నా ప్రేయసి యశోద - "

"నీవు తప్పుత్రోవలో పోతున్నావు. నీది ధర్మదృష్టి కాదు. క[illegible]వ్యమాలోచించిన ఆమె నీకు వదినె, నీ వామెకు పుత్రసమానుడవు. [illegible]కారములోపడి తన్ను కౌగుదుచ్చు నీకు వెలుగుచూపగల మహాతల్లి [illegible]శోద."

# కన్నీటి కాపురం

"అయ్యో. అదెట్లు సాధ్యపడును? ఇదంతా మోసము. మా అన్న
డ నన్నిట్లు వంచించునని తెలియనైతిని. నేను ప్రేమించిన యశో
దను పెండ్లాడుట కతడెట్లు సమ్మతించెను?"

"నీకు పితృసమానుడై యున్న అన్ననే నిందింతువా? చక్కబడ
నున్న అతని సంసారమును పాడుచేతువా?"

"మా అన్న స్వార్థపరుడు - ద్రోహి -"

"కాదు. కాదు. అతడు మరల నిర్మించకొనబోవు సంసార
ము భగ్నము చేయనెంచు నీవు స్వార్థపరుడవు - ద్రోహివి."

"నేను ప్రేమించిన స్త్రీని - నన్ను వలచివచ్చిన వయ్యారిని
వివాహమాడబోవు మా అన్న నీచుడు. తోడబుట్టిన నన్ను వంచించిన
చండాలుడు. వాడు నాకు సోదరుడే కాదు."

"నీవు పాపివి. నీవు చండాలుడవు. నిండుసంసారమునకు
కీడెంచు నీ యట్టి నీచుడీ భూమిమీద లేడు."

"నా యశోదను పెండ్లాడబోవు అన్న పాపి. మా అన్నను
చేబట్టబోవు యశోద ద్రోహి. ఈ సంబంధమును కుదుర్చిన సంఘము
ద్రోహి, యశోద నా ప్రేయసి. ఆమె నాది. అందరు చేరి నన్ను
మోసగిస్తున్నారు. అయ్యో? ఈ వివాహమును నిలుపు పుణ్యాత్ములు
లేరా."

"లేరు. ఈ వివాహబంధము దైవికమైనది. దానిని కాదనువాడవు
నీ వొక్కడవే. నీవు చండాలుడవు - ద్రోహివి."

రామమోహనుని హృదయరంగములో యిష్టా యిష్టములకు -
ధర్మాధర్మములకు - ఘర్షణ కలిగింది. ఘోరమైన పోరాటమై[illegible]
అతడు కూర్చున్న కుర్చీ, నేల, గదిగోడలు, మిద్దె - అన్నీ తలక్రిందై

నట్లున్నవి. గిర్రున తిరుగిపోవుచున్నవి. అతని కన్నులవెంట నీరు కారసాగింది. హృదయము నూరారు శూలములతో గ్రుచ్చినట్లుండెను. అతడు నిశ్చేష్టితుడై అట్లే కుర్చీలోపడి యుండెను.

సాయంకాలము నాల్గుగంటలు దాటిపోయినది. ఉదయము పదిన్నరకు రూమునకు వచ్చిన రామమోహనుకు, అన్న వ్రాసిన జాబును చూచినది మొదలు యీ స్థితిలోనే ఉన్నాడు. భోజనములేదు, బాహ్యా లోకజ్ఞానము లేదు.

ఇంచుమించు ఐదుగంటలప్పుడు బస్సుదిగి కృష్ణమూర్తి హుటాహుటి మిత్రుని గదికివచ్చి చూస్తే అతడీస్థితిలో పడివున్నాడు. కన్నులు మూసికొని యీజీ ఛైరులో పడియున్న అతడు అలసి పడుకొన్నాడో, లేక నిద్రపోతున్నాడో మూర్తి కర్థముకాలేదు.

మెల్లగ అడుగులు వైచుకొంటూ వచ్చి కృష్ణమూర్తి క్రిందపడి యున్న జాబునెత్తి మనసులో చదువుకొన్నాడు. అనుకొన్నట్టు దివాకర రావు తమ్మునికి తన వివాహవిషయమంతా వ్రాసినాడు. ఆ సమయములో మిత్రుని ఎట్లు లేపవలెనో, ఎట్లు మాట్లాడించవలెనో, ఎట్లూరడించవలెనో తోచక మూర్తి తికమక పడుతూవుంటే, ఉన్నదున్నట్టు రామమోహనుడు కన్ను తెరచి చూచినాడు – .

మోహనుని మనసంతా ఒక్కమారు అగ్నిగుండమువలె భగ్గున మండిపోయినది. కృష్ణమూర్తి దర్శనముతో మనసులో చెలరేగిన గాలి దుమారము మరింత ఉద్ధృతమై పొయ్యింది. యశోదను తనకిత్తుమని చెప్పి వారేమరల యేదో పన్నాగము పన్ని తనఅన్న కామె నియ్య బోతున్నారని తలంచినాడు మోహనుడు. అతని వివేకము పూర్తిగా అంతరించి పొయ్యింది. కండ్లెఱ్ఱచేసి, హుంకరించి లేచి "ఓరీ, విశ్వాస ఘాతకుడా! ఏ మొగముపెట్టుకొని మరల నా వద్దకు వచ్చావురా మూర్తీ?" అని మిత్రునిమీద పడి మనసార తన్నబోయినాడు

కృష్ణమూర్తి యిట్టి పరిస్థితి నెదుర్కోవలసి వస్తుందని తలంచ లేదు. జరిగిన పొరబాటు యింకా రామమోహనునికి తెలిసిఉండదనే ఊహ. అందువల్ల ఉపాయముగా విషయాన్ని వినిపించి, కర్తవ్య మేమిటో నిర్ణయిద్దామని వచ్చాడతడు.

రామమోహనుని వైఖరి చూడబోతే తామే అతన్ని మోసగించి నట్లు తలంచినాడనుట స్పష్టమైనది.

కృష్ణమూర్తిని పట్టుకొని, కసితీర తన్నవలెనని మోహనుడు గది నాల్గుమూలల త్రిప్పాడు. కాని, మూర్తి ఉపాయంగా తప్పించుకొంటూ "మోహన్! ఏమిటి నీ పిచ్చి? నేనెవరనుకొంటివి? కృష్ణమూర్తిని కాదా? నేనేమి చేసినానని నన్ను కొట్టవస్తున్నావు?" అని ప్రాధేయపడినట్లడుగు తుంటే, "ద్రోహీ! ఏమి తెలియనట్లు మాట్లాడుతావా? సిగ్గులేదా యింకా మాట్లాడేందుకు. ఇంటికి పిలిచి, పిల్లనిస్తామని నన్నిట్లా మోసగించేవు? చండాలుడా!" అని అతనిని గదిచుట్టూ త్రిప్పుచున్నాడు.

అంతలో దైవికంగా వారిద్దరికి మిత్రుడైన చలపతి అక్కడికి రావడం తటస్థించింది. "చలపతీ! చూడవోయ్, మోహన్ చర్య. నన్ను తన్నడానికి వస్తున్నాడు." అని మూర్తి చలపతి వెనుక దాక్కొన్నాడు. మోహనుడు గ్రుడ్లురుముతూ "విడవరా, చలపతీ వీణ్ని హతమారుస్తా" నంటూ చలపతిని ప్రక్కకు త్రోయబోతే బలిష్ఠుడైన చలపతి మోహనుని పట్టి నిలిపి "ఏమిట్రా సంగతి? ఎందు కిట్లు పోట్లాడు కొంటున్నారు?" అని గద్దించి అడిగాడు.

మోహనుడంత వెనుకకు తగ్గి, మళ్ళీ యీజీఛైర్‌లో పోయి కూర్చొంటూ "ఓరే, మూర్తీ, ఈ చండాలు డడ్డుపడి రక్షించాడు నిన్నీవేళ. లేకుంటే నీ అంతు కనుక్కొనే వాణ్ని." అని కండ్లలో నిప్పులు గ్రక్కుతూ చూచాడు మూర్తి వైపు.

# 5

చలపతిది రాజమండ్రి. అతడుకూడ బి. యస్.సి, చదువుతున్నాడు. కాని, వారికంటే ఒకయేడు వెనుక. అయినా, ముగ్గురు ప్రాణమిత్రులు. ఒకరినొకరు ప్రేమ విశ్వాసాలతో చూచుకోవడమే కాక. ఒకరికొకరు ప్రాణమైన యిచ్చేందుకు సిద్ధంగా ఉండేవాళ్ళు.

ఈ వారం రోజులనుండి రామమోహనుడు, కృష్ణమూర్తి కనబడక పోయేసరికి "హరి, వీళ్ళదుంప తెగ. నాకు చెప్పకుండానే వాళ్ళ ఊళ్ళకు వెళ్ళిపోయారే!" అనుకొని, మళ్ళీ "ఎక్కడికో వెళ్ళారు. నేడో రేపో వస్తారులె"మ్మని దినానికి నాలు మార్లు వారి రూముచుట్టు తిరిగిపోతున్నాడు.

ఈ దినం కూడ అదే పనిగ వచ్చేసరికి గదిలో సందడి వినబడి లోపలికి వస్తే లోపల ఈ దృశ్యము మిత్రుల పోట్లాట.

ఇంతకు కృష్ణమూర్తి పోట్లాడలేదు కదా! తన్ను కొట్టవచ్చిన మోహనుని బారినుండి తప్పించుకో యత్నించాడంతే. నిజంగా తానావేళ రాకపోయి వుంటే యేమి ప్రమాదం జరిగేదో యని చలపతి కూడ కొంత బాధ పడ్డాడు.

మూర్తీ! ఏమిటీ సంగతంతా? నాకేమి అర్థమౌటలేదు. ఇన్నాళ్ళు మీరిద్దరు ఎక్కడికెళ్ళారు? ఎప్పుడొచ్చారు?

"చలపతీ! సంగతంతా వివరిస్తా. నీ ముందు దాపరికం లేదు. నీవు మాలోని వాడవే. సమయానికి దైవంలాగ వచ్చావు. నే చెప్పేదంతా ముగిసేవరకు మోహనుని కదలకుండ, నోరెత్తకుండ కూచోబెట్టు."

"ఏరా, మోహన్! ఇంత మూర్ఖుడై పోయావు? సంగతేమిటో మూర్తిని చెప్పనీ. నేను వింటాను. వాడిది తప్పైతే మనమిద్దరం వాడ్ని

చితుకపొడుద్దాం. అంతేకాని, వాడు చెప్పి ముగించేలోగా లేచావంటే నేనోర్వనుసుమా."

అని చలపతి యిద్దరిని హెచ్చరించి "చెప్పరా, మూర్తీ, సంగతేమిటో" అని పురమాయించాడు.

కృష్ణమూర్తి ప్రారంభించారు. పదిహేనవ తేదీ తాను రామమోహనుని తన గ్రామానికి తోడ్కొని వెళ్ళినది, అక్కడ జరిగిన వివరములు, ఆ దినం ఉదయం రామమోహనుడు గుంటూరికి వచ్చాక తమ తండ్రి యింటికి రావడం, అతడు మూన్నాళ్ళ క్రిందట తమకెవ్వరికి తెలియకుండ తన చెల్లెలిని, మోహనుని అన్న దివాకరరావు కిచ్చి పెండ్లిచేయ నిశ్చయించుకొని లగ్నపత్రిక కూడ వ్రాయించుకొని రావడము, అందుమీద తమ యింట్లో జరిగిన సంగతులు, తానప్పుడు మరల గుంటూరికి వచ్చుటకు కారణము మొదలైన సంగతులన్నీ పూసగ్రుచ్చినట్లు వివరించాడు.

అన్ని వివరములు విని చలపతి కూడ నిర్ఘాంతపడి "అరెరె, ఎంత పని జరిగిందోయ్!" అని ఆశ్చర్య విషాదాలను వెల్లడించాడు.

"ఇప్పుడు చెప్పు, చలపతీ! ఇందులో మేము చేసిన ద్రోహమేముంది?

"ఇందులో ఎవరి తప్పు లేదు. ఇదంతా విధిలీల, మూర్తీ! ఇంటికి తోడ్కొని పోయిన మిత్రుని ఎంతో ప్రేమతో ఆదరించారు. దైవికంగా మీ చెల్లెలు మోహన్ ప్రేమించుకొన్నారు. ఒకరినొకరు పెండ్లి చేసుకొనేందుకు సమ్మతించారు. ఇరువురి మధ్య విడదీయరాని సంబంధమే యేర్పడింది. అంతవరకు సంతోషకరమైన సంగతే. కాని మీ తండ్రికేమి తెలుసు నీ సమాచారము? అతడు ఎప్పటియట్ల బిడ్డ వివాహం ఇంకా కాలేదు కదా అనే తాపత్రయంతో తన మామూలు ప్రయత్నమే చేశాడు. అతని సంగతి మీకు తెలియదు, ఇంతకు మోహన్ మీ యింటికి వచ్చి

నప్పుడు వేంకట్రామయ్యగారింటిలో లేకపోవడమే ఒకరీతి దైవనిర్ణయంగా ఉంది."

అని చలపతి కృష్ణమూర్తిని సమాధాన పరచి మోహనునితో యిట్లన్నాడు.

"మోహన్! నీ స్థితిలో ఉన్న ఎవరైన పొరబడటం సహజం. నీవు కృష్ణమూర్తిని తప్పు తలవడంలో పొరబాటేమి లేదు. అయినా వానిది కాని, వారి తల్లిది కాని, అమ్మాయిది కాని తప్పులేదు. వారికి తెలుసునంటావా వేంకట్రామయ్యగారు మీ అన్నతో సంబంధం కుదుర్చు కొని వచ్చే సంగతి?"

రామమోహన్ ఏమి మాట్లాడకుండ మౌనభావముతో తల వాల్చి ఆలోచిస్తూ కూచున్నాడు.

"చెప్పవోయ్, మోహన్! ఇదేమి అల్ప విషయం కాదు. ఇందులో ఎంతమంది జీవిత సమస్యలు, కష్టసుఖాలు యిమిడి ఉండేవి బాగా అర్థ మౌతూనే ఉంది. నీవేమి బుద్ధిహీనుడవు కావు. సవిమర్శగా విషయాన్ని గురించి ఆలోచించి వెంటనే నీ కర్తవ్యాన్ని నిర్ణయించు. ఇందులో నా చేతనైన సహాయం చేస్తా. పాపం కృష్ణమూర్తి మరల వచ్చింది కూడ అందుకే, వాణ్ని తప్పు తలంచి, లేని ద్రోహ బుద్ధి నంటగట్టి దుడుకు తనం చూపబోయావు."

చలపతి మాట చెవిని పడుతున్నా, కృష్ణమూర్తి చెప్పిన సంగతిని అందులో ముఖ్యంగా ఇంటిలో ఎవరికి తెలియకుండ వేంకట్రామయ్య చేసి కొని వచ్చిన సంగతిని – విన్నాక రామమోహనుని మనసులో మరొక విధమైన ఉప్పెన బయలుదేరి అతని నోటినుండి మాట రాకుండా అరికట్టి వేసింది.

మోహన్ బొమ్మవలె కూచున్నాడు. హృదయములో న్యాయా

న్యాయాలకు - పుణ్య పాపాలకు - సత్యాసత్యాలకు - కష్టసుఖాలకు - ఘోరమైన పోరు జరుగుతూంది.

పోరులో జయాపజయాలు బలాబలాల మీద ఆధారపడి ఉంటాయి

బలాబలాలు హృదయనైర్మల్యం మీద, చిత్త సంస్కారం మీద ఆధారపడి ఉంటాయి.

పవిత్ర గంగాజలములో పడిన రోగబీజాలు నశించిపోతాయి - మురికి గుంటల్లో కోట్లకు కోట్లు పెరిగిపోతాయి. అట్లే, కుసంస్కారి హృదయములో అన్యాయము, పాపము, నిర్దయ అసూయా ద్వేషాలు పాదుకొంటాయి. సత్సంస్కారిలో అవి ప్రవేశించినా నెగడ లేవు. తద్వ్యతిరిక్త బలం వాటిని అణచి వేస్తుంది.

రామమోహనుడు సహజంగా సత్సంస్కారి. మనసులో జరిగే పోరాటాన్ని బుద్ధి నిష్పాక్షికంగా సాక్షీభూతమై చూస్తూ ఉంది,

చలపతి మళ్ళీ ప్రారంభించాడు "మోహన్! మీ అన్న మరల. వివాహం చేసుకోవాలని అతనిని బలవంత పరుస్తూ వచ్చావని, అట్లు చేసుకోక పోతే నీవతని యింటికి పోకూడదని, నీ ఆశ నాతడు వదలుకోవాలని తెలిపినావని తనతో నీవు చెప్పినట్టు యిప్పుడే నీ యెదుటనే కృష్ణమూర్తి అన్నాడు, విన్నావు కదా? ఆ మాట కాదంటావా?"

మోహన్ పలుకలేదు కాని, బసవణ్ణ తల ఊపినట్టు 'ఔ' నన్నట్టు తల ఊపాడంతే.

"మరి యిందులో మీ అన్న తప్పేముంది? నీ కాతనియెడ ఉండే ప్రేమ బహు నిర్మలమైనది, అతడు కూడ నిన్నెంతో గారాబంగా చూస్తున్నాడని నీవే అనేక మార్లు నా యెదుట కూడ చెప్పుతూ వచ్చావు. ఇక వేంకట్రామయ్య నీవు, కృష్ణమూర్తి కలువలపల్లికి వెళ్ళే దానికి ముందే గ్రామాంతరం వెళ్ళిపోయాడు. పోయేటప్పుడు బిడ్డకీసారి ఎక్కడ

నయినా తగిన సంబంధం చూచుకొని రావరెననే సంకల్ప మతనిలో ఉండినది కాని, తప్పకుండ మీ అన్ననే యేర్పాటు చేసికొని వస్తానని ఇంటి వారితో చెప్పి పోయాడా?"

మోహన్ అడ్డంగా తల త్రిప్పాడు.

"పోనీ, కృష్ణమూర్తి నిన్ను తోడ్కొని పోయే ముందు నేనొక వరుణ్ణి తెస్తున్నాను, నాన్నా, చెల్లాయికి నీవెక్కడ ప్రయత్నం చేయవద్దని ముందుగా తండ్రికి తెలిపాడా?"

"లేదు. నేనాలాంటిదేమి వ్రాయలేదు" అని మూర్తి అంటే చలపతి "ఉండవోయ్, నీ వాజ్మూలమంతా ముగిసింది కదా? నీవు మాట్లాడకు, ఇప్పుడు నేను మోహనుని క్రాస్ చేస్తున్నాను. చెప్పవోయ్, మోహన్, నా ప్రశ్నకు జవాబు."

మోహన్ 'లే'దన్నట్టు మరల తల నడ్డంగా త్రిప్పాడు.

"అయితే, నిన్ను ప్రేమించానని చెప్పి, నీపై మనసు కలిగిన అమ్మాయి దీందులో ఏదైన తప్పుందంటావా?"

మళ్ళీ అదేవని — మోహన్ తల త్రిప్పడం.

"అయితే, ఇందులో నిన్నెవరు మోసగించారని నీ అభిప్రాయం?"

ఈసారి రామమోహన్‌లోని మూకీ భావమంతరెంచి వాగ్ఝరి ప్రవహించింది - "చలం! నన్ను నేనే మోసగించుకొంటున్నాను. నా బుద్ధి పురువు మేసింది. అకస్మాత్తుగా తెలిసిన ఈ తాపమూరు వార్త నన్ను పిచ్చివాణ్ని చేసింది. మా అన్నను కాని, వేంకట్రామయ్యను కాని, అతని యింటి వారిని కాని అనుమానించేందుకు వీలు లేదు. నీవన్నట్టు విధి నాకు ఎదురైంది. ఇందరి హృదయాలను భగ్నం చేసింది. నాచేత, యశోద చేత చేదుమేప యత్నించింది."

అని మోహన్ తటాలున లేచి "మూర్తీ" అని అనుస్తూ వెళ్ళి

కృష్ణమూర్తిని కౌగలించుకొని, బాలకుని వలె ఏడ్వ సాగాడు. తక్కిన యిద్దరి కండ్లు కూడా చెమ్మగిల్లాయి ఆ సమయములో.

రెండు మూడు నిమిషాల పాటు ఎవ్వరు మాట్లాడలేదు. ముగ్గురి మనసులు మూడు విధాలుగా యాతనావస్థలో పడిపోయాయి.

కొంతసేపటికి చలపతి తక్కిన యిద్దరిని కూర్చోబెట్టి, వారికి నడుమ తాను కూర్చొని "ఒరే, స్నేహితులూ, నీటిలో మునిగిన వానికి నీటి లోతు బాగా తెలియదు. గట్టునుంచీ చూచే వాడికే ఆ సంగతి అర్థమౌతుంది. మీరిద్దరు చెరియొక విధమైన విచార సాగరములో పడి ఏమి చేయాలో తోచకుండ చస్తున్నారు...."

"అయితే నీకేమైన తోచిందా?" అని రామమోహన్ తల ఎత్తి ప్రశ్నించాడు మిత్రుని,

"అవును నాకు తోచిన మార్గాన్ని వివరిస్తా, వినండి. ఇప్పుడు యశోదకు, మీ అన్న వివాహం జరిగేలాగు నిశ్చయింప బడింది. ఇది దైవ సంఘటన. అందుకే విధి ఒక వంక మీ అన్నను, ఇంకొక వంక వెంకట్రామయ్యను, మరియొక వంక నిన్ను యశోదను, వేరొకవంక కృష్ణమూర్తిని, అతని తల్లిని వంచించి, తుదకీ లగ్న పత్రికను తయారు చేయించింది. ఇందుకు, అనగా యీ విధి నిర్ణయానికి, మోహన్, నీవు బద్ధుడ వగుటే నీ ధర్మము...."

"ఏమిట్రా చలం, నీవనేది? భార్య కాబోతుందని ఆశించిన స్త్రీని వదినెగా ఎట్లు చూడమంటావురా?" అని ఆక్రోశించాడు నడుమ రామమోహన్.

"మోహన్! నీవు తెలివి కలవాడవు. చక్కగా ఆలోచించి చూడు.

ఈ జీవితమంతా సుఖదుఃఖముల పోరాటమే. ఇందులో ఒక్కొక్కటి ఒక్కొక్కమారు పైచేయి వేసుకొంటుంది. దీనికి స్థిరమైన జయాప

జియాలు లేవు. ఇంతకు దుఃఖమే నెంతటి వెర్రివాడు కూడ ఆశించడు కాని, విధివశంతో వచ్చినప్పుడు దానిని అనుభవించేందు కంటే వేరే మార్గము లేదు. అట్లు అనుభవించే దాంట్లో — వివేచనా బుద్ధితో అనుభవించినప్పుడది అంత తీవ్రమై కనబడదు. వివేకహీనుని పాతాళము వరకు క్రుంగదీయడమేకాక, మహారాక్షసుని చేసి, వాని జీవితమును నరక ప్రాయము చేసివేస్తుంది."

"బాబూ! ఈ వేదాంతమంతా నాలో ఉంది. కాని, తాత్కాలికంగా దాన్ని మోహమనే పిశాచ మణచివేసింది. నీ విప్పట్లో శ్రీకృష్ణుడవు. నేనర్జునుడను. నాకు యుక్తమని తోచిందేదో చెప్పు" మంటూ రామ మోహనుడు చలపతి మెడకు తన రెండు చేతులు చుట్టి 'అన్యథాశరణం నాస్తి, త్వమేవశరణంమమ' అనే స్థితిలో ఎదపై తల నానించాడు.

"పాండవ మధ్యమా! రెమ్మ్క. క్షుద్రహృదయ దౌర్బల్యాం త్యక్త్వో త్తిష్ఠ పరంతప...."

"హరీ, నీ దుంపతెగ. అప్పుడే శ్రీకృష్ణుడైపోయావట్రా?" అని మోహన్ చలపతి వీపుమీద చరిచి నవ్వాడు. కృష్ణమూర్తి కూడ నవ్వి "ఒరే, చలం నీ కష్టానికి తగిన ప్రతిఫలం పుట్టించాడురా మోహన్" అన్నాడు.

తరువాత ముగ్గురు కొంత నవ్వుకొని వికాస ముఖాలతో కూచు న్నారు.

"చెప్పరా, చలం నన్నిప్పుడేమి చేయమంటావో?"

"చెప్పానుగా, యీ వివాహం విధినిర్ణయం. దీనికి నీవు తల వాల్చాల్సిందే...."

"తరువాత?"

"తరువాతేమిటి? తిన్నగ యింటికెళ్ళి "అన్నా! నీవు వ్రాసిన కథ

లేఖ అందింది. చాల సంతోషించాను. అని పెండ్లి పెద్దవై యశోదా దివాకరుల వివాహన్ని వైభవంగా జరిపి, మాకు లడ్డూలు పకోడీలు పెట్టాల్సిందే."

మరల మిత్రులిద్దరు నవ్వారు చలపతి మాటకు.

# 6

"నేను మాత్రమీ పెండ్లికి రాను. మోహన్, నన్ను క్షమించు అన్నాడు కృష్ణమూర్తి మిత్రుని రెండు చేతులు పట్టుకొని దీనంగా అతని వైపు చూస్తూ.

మోహన్ మాట్లాడలేదు. తల వాల్చి ఆలోచిస్తున్నాడు.

"అరే, అలాగంటె ఎట్లరా? నీ చెల్లెలు బాధపడదూ?" అని చలపతి ప్రశ్న.

"ఇప్పుడు మాత్రమామెకు బాధ లేదనుకొన్నావా? చలం? ఒకవంక తండ్రిని కాదంటుందా, నన్ను మా అమ్మను కాదంటుందా? మనసార వలచిన వాణ్ని కాదంటుందా?".

"ఇప్పుడు మా అన్నను కాదంటేమాత్రం నేను గ్రహిస్తాననా? అంతటి భ్రాతృద్రోహని కొడిగట్టు కొందునా?

"అదీమాట. అయ్యిపోయ్యింది - ఆమెయింక మీ అన్నసొత్తే. నీ వామెను వదినగా గౌరవించాల్సిందే" అని చలం తీర్మానించాడు.

"అబ్బా!" అని హృదయంపై చేయినుంచుకొని వెనుకకు వాలిలాడు.

ముగ్గురు ... ములోనే గడిపారు. చలం తన తం
నాన్నే సమర్థించి మరియెన్నో సంగతులు చెప్పాడు, రామమోహనున
కంతకంటె గత్యంతరం గోచరించలేదు. కాబట్టి తాను అదేవిధంగా నిశ్చ
యించుకొని, కృష్ణమూర్తితో "మూర్తీ! మీ చెల్లెలి నెట్లోదారుస్తావో,
ఆమె నాపైనున్న మమకారాన్ని మార్చుకొని, తన హృదయములో నాకు
'మరది' కివ్వవలసిన స్థానాన్ని యివ్వమని చెప్పు. నాపై ఏమాత్రం
ప్రేమఉండిన యిది నా ప్రార్థన అని చెప్పు. ఆమెనింక వదిన స్థానములో
చూడ్డానికి నేను సంసిద్ధుడనని చెప్పు" అని తన ఆవేదన కంతటికి వేదాం
తాన్ని అవకుంఠన చేసి, మూర్తి ని కలువల పల్లకి సాగనంపి, తానా
మరుసటిదినం సింహాద్రి పురానికి బయలుదేరాడు.

ఇటు బిడ్డ దుఃఖమును చూడలేక, అటు దివాకరరావుతో చేసికొని
వచ్చిన యేర్పాటును కాదనలేక వేంకట్రామయ్య అడకత్తెరలోని పోక
చెక్కవలె ఉభయసంకటానికి లోనై అపరిమితమైన మనోవేధన ననుభ
వించ సాగాడు. సునంద గతికూడ అలాగే ఉంది.

ఇక యశోదగతి వర్ణనాతీతము. తన జీవితములో తన మనస్సు
నొక్క పురుషునికి మాత్రమర్పించి, ఆతని నపరదైవముగా అర్చించుట
భారతస్త్రీ లక్షణము, అందుకు వ్యతిరిక్తముగ వర్తించుట పతివ్రత
లక్షణముకాదు. ఈ సనాతన ధర్మ సాంప్రదాయమునకు భారత భూమియే
జన్మస్థానము. ఈ ధర్మవృక్ష మీ దేశాల కాలములోనే జనించి, ప్రపంచము
నలుమూలల తన పరిమళమును వ్యాపించజేసింది, ఆధునిక నాగరి
కతా సంస్పర్శతో నిట్టి సనాత భారతజాతి విశిష్ట ధర్మ మచ్చటచ్చట కళం
కితమైనను, అది యిచ్చట సమూలముగ నశించిపోలేదు. అచ్చటచ్చట
మహాతల్లులే ధర్మాని కాటపట్టైయున్నారు.

ఇక నిర్మలమగు ప్రేమ అవిభాజ్యమైంది, దాని నిద్దఱికి పంచి
పెట్టేందుకు వీల్లేదు. అది ఉన్నచోట విభేదబుద్ధి కాని, అసంతృప్తి

న, అసహ్య ద్వేషములు కాని లేవు. తేనెకొఱకు పువ్వునుండి పువ్వునకెగిరే తుమ్మెదలాంటి చంచలమైనది కాదు పవిత్ర ప్రేమహృదయము. దానికున్నంత సహనశక్తి, త్యాగము, దైవశక్తి మరి దేనికిని యీ లోకములో నుండజాలదు. అది మృత్యువు నెదిరించి జయించగలదు. అది లోకములను చీకాకు పరచగలదు, అది సూర్య చంద్రుల గతులు కల్పించగలదు, దాని కసాధ్యమేదియు లేదు.

ఈ విషయమున పురుషునికంటె స్త్రీయే అధికురాలు. యశోద తన తనుమన ప్రాణములను మానసికంగా రామమోహను కర్పించి, అతడే తనకిక జీవితాంతమువరకు పతియగునని ఎన్నో కలలుగన్నది. ఇప్పు డున్నదున్నట్టామెకు ప్రాణాధిక్యమైన వస్తువును పరులపహరించినట్లైంది. అంతకంటె మరణమే మేలని తలంచిన దా సుకుమారహృదయం.

ఒకవేళ రామమోహనుడు తమ యింటికిరాక ఉండి, తన కాతనిని చూచు అవకాశము లభించకుండిన యెడల, తండ్రి చేసికొనివచ్చిన యేర్పా టున కెదురాడి యుండదు యశోద.

తాను తనజీవిత భాగస్వామిని నిర్ణయించుకొన్నది. ప్రపంచములో ఒకటేని మించినవస్తువు ఇంకొకటి ఉండుట సహజమే. వస్తువులను మార్చుకొనుటలో కాని, వలసినన్ని మంచి వస్తువులను తెచ్చుకొనుటలో కాని అసహజమేమి లేదు - దానిని తప్పుగా ఎవరు తలంచరు.

స్త్రీల విషయములో భర్తల నియామకము కాని, పురుషుల నియా మకములో స్త్రీల విషయము కాని అట్టిదికాదు. ఒకవేళ సంఘము పాక్షిత బుద్ధితో పురుషునకట్టి స్వాతంత్ర్యమిచ్చినా స్త్రీకి మాత్రమట్టి స్వాతంత్ర్యము నిచ్చుట కంగీకరించదు, ఒకవేళ అంగీకరించినా, సనాతన ధర్మస్థానమగు భారత భూమిలో జనించి మహిళామణులందు కంగీకరింపరు.

యశోద తన హృదయాఘ్ఘాతానికి తాళలేక పరిపరివిధముల తల్లడిల్లి

పోవుచుండెను. హృదయఫలకమునుండి రామమోహనుని తుడిచివేయు టామె కసాధ్యమైయుండెను.

ఇందులో తనకెవ్వరు ద్రోహముచేయలేదు. అంతా విధికృతంగా జరిగిపోయ్యింది. ఇప్పుడు తండ్రి నిర్ణయాన్ని కాదంటే, తనగతి రెంటికి చెడిన రేవణునిగతి యౌతుంది.

భర్తయగునని ఆశించిన వాని కధీనయైన తానిప్పుడు తన మనసు వెనుకకు లాగుకొని, ప్రేమనన్యాయత్త మొనర్చుట మహాదోషము - అట్టి పనిని చేయగలిగిన శక్తి యశోదకు లేదు.

బిడ్డయొక్క దురవస్థ తలిదండ్రుల కర్థమైంది. కాని, ఏమి చేయగలరు?

ఇంతలో కృష్ణమూర్తి గుంటూరునుండి తిరిగివచ్చి, అచ్చట జరిగిన యావద్వృత్తాంతమును ఇంటివారికి వినిపించాడు.

అన్న తిరిగివచ్చి యేదైన ఆశాజనకమైన వార్తను వినిపించగల దేమోయని ఆసించిన యశోద మరింత క్రుంగి పోయ్యింది. ఆమె హృదయాకాశము కారుమేఘాలతో, ఫెళఫెళార్భటులతో నిండి భయంకరమై పోయ్యింది.

బిడ్డ యవస్థను చూచి ఆ దినమంతా సునంద, వేంకట్రామయ్యా ఏమి చెప్పలేక తామూ ఒకవంక తల్లడిల్లి పోయారు కాని, తుదకు వారు కొంత కుదుటుపరచుకొని, కర్తవ్యాన్ని నిర్ణయించుకొని యశోదకు కూడ కర్తవ్యాన్ని బోధింప మొదలెట్టిరి.

"అమ్మా! యశోదా! నీదుఃఖము మా కర్థము కాకపోలేదు. అయినా, ఇప్పుడింక విచారించి ప్రయోజనమేమి? మీ తండ్రి నిర్ణయానికి బద్ధురాలవు కాకతప్పదు."

యశోద "అమ్మా" యని బావురమంటూ తల్లీఒడిలో తలవాల్చు కొని వెక్కివెక్కి యేడ్వసాగెను.

"యశోదా! విధినిర్ణయాన్ని కాదనలేము తల్లి. ఇన్నాళ్ళుగ నీకు తగిన సంబంధమును తేలేక నేను పడిన మనోవేదన నీ కర్థమవుట లేదా? నీవు రామమోహనుని కోరిన సంగతి నాకు తెలిసిఉంటే, అతని అన్నకు, నిన్ను అంటగట్టయత్నించి ఉందునా? లేక, నేనీ యేర్పాటును చేసికొని వస్తానని మీకు తెలిసిఉంటే ఇంటిలో మీరీ పొరబాటు చేసి ఉందురా! అందుకే యిదంతా దైవనిర్ణయమంటున్నాను, తల్లీ? ఇక ఊరక విచారించి ప్రయోజనము లేదు. నీ వింక ఎంతదుఃఖించినా నీకు రామమోహన్ మరది కాదగిన వాడేకాని భర్త కాజాలడు. నీవు మనసును మార్చుకొని ఆ యన్నదమ్ములలో ఎవరినెట్లు చూడవలెనో ఆ రీతిగా చూచి ఆదరిస్తూ, పుట్టిన ఇంటికి, మెట్టినయంటికి కీర్తిని తెమ్ము. లోకమీవిషయములో ఆరంభమున నిన్ను సానుభూతితో చూచినా, నీవీ నిర్ణయాన్ని వ్యతిరేకించి నట్లైతే హర్షించదు, నిన్ను కళంకితంగా చేస్తుంది. ఒకవేళ నీ మనసును మార్చుకోలేకపోతివా, తదనంతరము సాధించగలిగిన దేది? –"

వేంకట్రామయ్య యింకా ఏమో చెప్పబోతూ ఉండగానే యశోద కన్నులు తుడుచుకొని. "నాన్నా! నన్నుకని మీరనుభవించే సుఖమింతే, నేను జీవించి ఉండడానికంటె మరణించితేనే మేలు. నాకు, మీకు యీ మనోవేదన తీరుతుంది."

"ఛా – ఏటిమాటలమ్మా యివి? శుభమని, కష్టపడి అనువైన సంబంధం చూచుకొని వచ్చి, పెండ్లిచేయాలని తహతహ పడుతూవుంటే నీ విట్లైనా నీ తండ్రి ఋణం తీర్చుకొనేది? నీ బాధ నాకర్థమౌతుంది కాని, కొంత వివేకముతో ఆలోచించినట్టయితే నీ మనసు మార్చుకోవడమే మంతకష్టమైన పనికాదు. నీకు, రామమోహనునికి పెండ్లి జరిగిందా, నీ వాతనితో కాపురం చేశావా, లేక యింకేదైన నష్టకష్టాలున్నాయా? అవిలంఘ్యమైన విధికి లొంగాల్సివచ్చినప్పుడే ప్రతియొక్కరి మనోధార్ఢ్యం బయలుపడుతుంది. పోనీ, నీ దుఃఖానికి నేనే కారకుడంటావా? సరి,

రేపే నే నీ యిల్లువిడిచి దేశద్రిమ్మరినై పోతాననుకో. అందువల్ల నీ మనోభీష్టం తీరుతుందనా నీ భ్రాంతి. తన అన్నకోరకుప్లేశించి, తీరా లగ్నపత్రికలను కూడ వ్రాయించిన పిదప, తమ్ముడు నిన్నాసిస్తాడా? ఏటి మాటలమ్మా యివి? చదువుకొన్నదానవు, కాస్త తెలివితో ఆలోచించి ముందు జరుగయుండే శుభకార్యానికి సిద్ధపడు. "అని వేంకట్రామయ్య భార్యనుచూచి" సునందా! నీవు, నీ కొడుకుకలసి చేసిన సంబంధమే స్థిరపరచుకొనే ధైర్యం మీ కుంటె, నే నందుకు యే రీతిగానైన ప్రతిబంధకమైతే, మీ అందరి మనశ్శాంతి కొఱకు ఇప్పుడే యీ యిల్లువదలి ఎక్కడికైనా వెళ్ళిపోతాను, చెప్పు, నీ మనోగతాభిప్రాయ మేమిటో" అని నిలదీసి అడిగినట్లు ప్రశ్నించాడు.

"మీ అఘాయిత్యం మరీ బాగుందండీ. ఇప్పుడు మీది తప్పని ఎవరన్నారు?, మీరు వెళ్ళిపోతేమాత్రం పిల్లకుకలిగే సుఖమేముంది? వృథా మీ రెందుకీలాగు అశుభం పలుకుతారు? ఇదంతా దైవనిర్ణయమన్నారు కదా? సరి, దానికితిరుగలేనప్పుడాలోచన ఎందుకు. పెండ్లిముహూర్తంకూడ నిర్ణయించుకొని వచ్చారు. ముందు జరుగవలసిన పనులను జరుపండి." అని మగనిని, కొడుకును ప్రోత్సహించి, సునంద యశోదను జూచి యిట్లనింది. "యశోదా! నీవేమి పసిపిల్లవు కావు. యుక్తాయుక్త జ్ఞానముకలదానవు. కానున్నదేమో కాకతప్పదు. మనసులోని బాధను మఱచిపో. జరిగినదంతా మరచిపో. మీ తండ్రిగారు చేసిన యేర్పాటే ఖాయమైనది." అని బిడ్డకు హితోపదేశము చేసింది.

కృష్ణమూర్తికూడ చెల్లెలికి, చెప్పవలసినదంతా చెప్పి "సరే" అని యశోద నోటినుండి అనిపించ గలిగాడు.

♦ ♦ ♦

రామమోహనుడు గుంటూరునుండి బయలుదేరి ఇల్లు చేరేలోగా తన్నెదిరించి నిలచిన సమస్య నన్నికోణములనుండి తిలకించిచూచి, తుదకు యశోదతో అన్నకీ వివాహము జరుగవలసినదే అని నిర్ణయించుకొన్నాడు కాని, మనసులో వీచే ఝంఝూమారుతాన్నిమాత్ర మరికట్ట లేక పోయాడు.

ఇల్లు చేరినవెంటనే అన్న ఎదురై "మోహన్, ఇన్నాళ్లెందు కాలస్యం చేశావు? ఒంటిలో కులాసాగా ఉందా?" అని తమ్ముని భుజములు రెండు పట్టుకొని, ప్రేమ వీక్షణములతో ప్రశ్నించాడు.

రామమోహనునికి అన్నను తలఎత్తి చూచేందుకు ధైర్యము చాలలేదు. మ్లానవదనుడై తలవాల్చుకొనే "కులాసాగా ఉన్నా" నని ముక్తసరిగ జవాబు చెప్పాడు.

"ఎందు కాలాగున్నావు. నవ్వవేం, మోహన్? ఏదీ, నావైపొక సారి చూడు. నీ విచారమేమి? పరీక్షల్లో బాగా వ్రాశావుకదూ."

మోహన్ "ఔ" నన్నట్లు తలఊపాడంతే.

"రిజల్ట్సును గురించి అనుమానమే లేదు. నీవు ఫస్టుక్లాసులో వస్తావులే. అసలు నాజాబుచేరిందా నీకు?" "చేరింది, అన్నా! చాల సంతోషమైంది." అని అప్పుడు రామమోహనుడు తలఎత్తి చిఱు నవ్వుతో అన్న మొగంచూచాడు, మనసులోని కల్లోలాన్ని గెలిచి తలఎత్తేందు కాతని కంతసేపు పట్టింది.

"మరి, నీ అభిప్రాయమేమి?"

"నా అభిప్రాయమేముంది? శుభస్యశీఘ్రం. ఈ పెండ్లి సరిగ మార్తానికి జరుగవలసిందే."

"అయితే! యీ కార్యభారమంతా నీదేరా, తమ్ముడూ: నాకేది తోచదు. పెండ్లికొడుకై పీటలమీద కూర్చోవడ మొక్కటే నా వంతు".

అని దివాకరరావు ఏదోపని ఉందని, ఇప్పుడే వస్తానని ఎక్కడికో వెళ్ళిపోయాడు.

# 7

అప్పటికే సంజవేళైంది, రామమోహనుడు దీపాలు వెలిగించి ఒంటరిగా భవిష్యత్కార్య క్రమాన్ని గురించి తలపోస్తూ కూచున్నాడు.

వివాహముహూర్త మింక ఒకవారము రోజులుమాత్రం మిగిలింది. ఇంటిలో ఏమున్నది, ఏమిలేనివి, ఏమి తేవలసినది చెప్పేవారు లేరు. ఆడ దక్షత లేని యిల్లెంత బావురుమనాలో అంత దావురుమంటూంది ఎటు చూచినా.

ఆలాంటి శూన్యగృహాన్ని ప్రకాశవంతము చేయడానికి గృహలక్ష్మియై వస్తూవుంది యశోద. ఆమెవల్ల నిరాశ, నిస్పృహలచే నిరస్తమైన దివాకరరావు హృదయము ప్రేమపూరితమై అనురాగ ప్రజ్వలితము కాబోవు చున్నది.

తన భవిష్యత్తంతా అంధకార బంధురమై పోయింది. దాన్ని వెలిగించే వ్యక్తిలేదు. తన జీవితానందాన్ని సంపూర్ణముగ త్యజించి అన్న కప్పగించి, ఆతని సుఖమునే తన సుఖముగనే భావించి తృప్తిపడవలసి ఉన్నది.

# కన్నీటి కాపురం

హాలులో అటునిటు మెల్లగ అడుగులు వేస్తూ, పచారుచేస్తూ, ఆలోచనామగ్నుడై ఉన్న మోహనుడు బాహ్యజ్ఞానాన్నే కోల్పోయి నట్టుంది.

"ఎప్పుడొచ్చావోయ్, మోహన్" అని పిలుస్తూ, పొరుగింటి శంకరభట్టు ప్రవేశించాడు.

ఉలిక్కిపడి మోహనుడు తలెత్తిచూచి, చెదరిన మనసును కాస్త ...ద బెట్టుకొని, "నమస్కారమండీ, భట్టుగారూ! ఇప్పుడే కొంత ...పయ్యిందండీ వచ్చి. అంతా కులాసాగా ఉన్నారుకదూ?" అని కుశల ప్రశ్న వేశాడు.

శంకరభట్టు గ్రామ పౌరోహితుడు. రామమోహన్ తండ్రి కాలమునుండి వారియింటి కత్యంతహితకారి. అతనియెడ దివాకరరావు, రామమోహనుడు ఇంచుమించు పితృభావమునే కనబరుస్తూ ఉంటారు. తమ తలిదండ్రులు, మాణిక్యాంబ పోయిన నాటినుండి శంకరభట్టు, అతని భార్య అన్నపూర్ణమ్మ ఆ యువకుల నిద్దఱిని చాల ఆదరాభిమానాలతో చూస్తూ వచ్చారు. ప్రక్కఇంటి వారేకాబట్టి యిప్పటికి ఒక సంవత్సరం లగాయితు, దివాకరాన్ని హోటలుకు పోనియ్యకుండ అతడు తమయింటనే భోజనం చేసేట్టు యేర్పాటు చేశాడు.

"దివాకరం వివాహం నిశ్చయమైంది కదూ? నీ కా సంగతి తెలుసునా!"

"ఆ, అన్న జాబువ్రాశాడు."

"కలువలపల్లి వేంకట్రామయ్యగారు మీ తండ్రిగారికి చాల...ష్టులు. గొప్పగుణం కలవాడు. మంచిసంబంధమే కుదిరింది."

రామమోహనుని చిరునవ్వులో ఒకవంక విషాదము. మఱియొక

వంక సంతోషం కాన్పించాయి. శంకరభట్టు కర్థమైందల్లా మోహనుకు సంతృప్తి పడ్డాడనే.

"అమ్మాయిని చూడకనె మా అన్న యెలా సమ్మతించాడండీ?"

"వేంకట్రామయ్య కూతురు ఫోటోను తెచ్చాడు. బిడ్డకు ఎంత కాలానికి పెండ్లి కాలేదనే తహతహతో అతడీలోగా ఎక్కడికెళ్ళినా ఎందుకైనా మంచిదని, అమ్మాయి జాతకాన్నీ, ఫోటోను వెంటతీసికొని వెళ్ళేవాడట. ఆ వేళ నా దగ్గరికే మొదటవచ్చి 'ఏమండీ. భట్టుగారూ! దివాకరరావుకు మా అమ్మాయి నిప్పించండి' అని అడిగాడు. సరేనంటూ ఆవేళ మా యింట్లోనే భోజనంచేశాక ఇద్దరం మీ అన్న దగ్గరికెళ్ళి ప్రస్తావించాము. ముఖ్యంగా దైవానుకూలముంది కాబట్టి దివాకరం ఒప్పుకొన్నాడు. శుభస్య శీఘ్రం అని నేనే ముహూర్తం నిర్ణయించి లగ్నపత్రిక వ్రాశాను."

అని భట్టు జరిగిన సంగతంతా విపులంగా వినిపించాడు. గుంటూరులో కృష్ణమూర్తి కూడ యిలాగా చెప్పింది మోహన్‌కు జ్ఞాపకానికి వచ్చింది.

"చాల సహాయం చేశారండీ. అన్న మరల ఒక యింటి వాడౌతున్నాడంటే నాకెంతో ఆనందంగా ఉంది.

"మీ అన్నదమ్ముల ప్రేమ ఆదర్శప్రాయ మయిందోయ్, మోహన్. ఊళ్ళో అందరూ మీ సంగతే చెప్పుకొంటూ ఉంటారు అలాంటి సోదర భావ మీ కాలంలో చాల అపురూపమని."

"ఏదో అంతా పెద్దల దయలెండి. సరేకాని, వివాహమా యింక ఎనిమిది రోజులుంది. ముందు చేయవలసిన పనుల నన్ని ఎట్లు చేయాలో అంతా మీరే యీ కార్యభారం వహించి మాకు తోడుపడాలి."

"సరే, దానికేం? ఇంతకంటే సంతోషమా? డబ్బు చేతిలో ఉంటే ఒక వారం రోజుల్లో యీలాంటి పెండ్లిండ్లు పది చెయ్యొచ్చు.

"డబ్బుకు చింత యేముంది? అన్నగారు రాగానే రేపే తేవలసిన వన్నీ తెప్పించి, జరుగవలసిన పనుల నన్నిటిని హుటాహుటిగా జరిపించాలి. ఈ పెండ్లికి పెద్దలు మీరు. పీటలమీద నాందీకి కూచో వలసిన వారు మీరాలు మగలే."

ఆ రాత్రి అన్నదమ్ము లిద్దరు భట్టుగారి యింట్లో భోజనం చేస్తూ అతడు అతని భార్య, మరదలు మీనాక్షి చెప్పినదంతా విని, తేవలసిన వస్తు సంబార్థాలను, వస్త్రభూషలను, వ్రాసి ఉంచుకొన్నారు. మరునాటి సాయంకాలానికి తేవలసిన దినుసులన్నీ తేబడినాయి. అన్నపూర్ణమ్మ, కామాక్షి పెండ్లి పనులకు పూనుకొన్నారు. కామాక్షి భట్టు తమ్ముని భార్య. తల చెడిన మనిషి. వయసు ముప్ఫై అయిదుకంటే ఎక్కువ ఉండదు. ఇక అన్నపూర్ణమ్మ పాకశాస్త్రములో మంచి అనుభవజ్ఞురాలు. కామాక్షి సహాయముతో ఆమె నానారకములయిన పిండి వంటలు తయారు చేసింది. వంటకు కావలసిన సాంబారపు దినుసులన్నీ తయారయ్యాయి.

భట్టు, దివాకరం, మోహన్ – ముగ్గురు చేరి పై పనులన్ని చూడసాగారు. ఇల్లు వెల్ల వేయించారు. వారుండేది రెండంతస్తుల మేడ. పదేండ్ల క్రిందట ఆధునిక పద్ధతిలో బాగా కట్టించారు. పెండ్లివాండ్ల విడిది కొక యింటిని, వచ్చే బంధు వర్గానికి మరియొక యింటిని దగ్గరలోనే యేర్పాటు చేయించారు. పెండ్లి పందిళ్ళు, వంటసాల, మొదలైనవన్ని తయారయ్యాయి. విజయవాడ నుండి పేరుపొందిన భజంత్రీ సెట్టు ఆహ్వానింప బడింది. తేవలసిన నూతన వస్త్రాభరణాలన్ని తెచ్చారు. ఇన్నిటిలో రామమోహన్, భట్టే ప్రధాన పాత్ర వహించారు.

తన మనసులో ఒక వంక నిరాశా నిస్పృహలు తాండవిస్తూ ఉన్నా రామమోహన్ పైకి ఉత్సాహ సంతోషాలను ప్రదర్శిస్తూ, అన్న ఆనందం కొరకు తన సర్వస్వం ధారపోయడానికి సిద్ధ పడినాడు.

బంధుమిత్రుల కాహ్వానాలు పంపబడినాయి.

నేడప్పుడే బహుళ విదియ. కలువలపల్లిలో వేంకట్రామయ్య, సునంద కృష్ణమూర్తి చెప్పవలసిన సంగతుల నన్నిటిని సహేతుకంగా చెప్పి యశోదను ఒప్పించి, పెండ్లికూతురును చేశారు. సింహాద్రిపురము నుండి అచ్చువేయబడిన లగ్నపత్రిక వచ్చింది. తమ సంసిద్ధతను గూడ తెలి పేందుకని కృష్ణమూర్తి తాము అచ్చు వేయించిన లగ్నపత్రిక నొకదాన్ని దివాకరరావుకు పంపాడు.

చవితి బుధవారం ఉభయ వర్గాలవారు దేవతా సమారాధనలు ముగించారు. వేంకట్రామయ్య రావలసిన బంధుమిత్ర వర్గముతో సింహాద్రి పురానికి బయలు దేరాడు. ఇందుకు ఒక బస్సు పూర్తిగ యేర్పాటు చేయ బడింది. పెండ్లికి వచ్చిన వారంతా కలిసినా ఒక వందకు మించలేదు. ఆదినం సాయంకాలము ఎదుర్కోళ్ళు మొదలైన వేడుకలు, జరుగవలసిన శాస్త్రపద్ధతులు జరిగి పోయాయి. రాత్రి వియ్యాలవారి భోజనాదులన్ని సక్రమంగా, సంతృప్తిగా జరుపబడ్డాయి.

తెల్లవారి పెండ్లి దినము. ఉదయం పది గంటలకు కర్కాట లగ్న పుష్కరాంశలో ముహూర్తం నిశ్చయింపబడింది. పెండ్లి పందిరి విశాలంగా, ముచ్చటగా తయారుచేయబడింది. వివాహ మంటపము గూడ ఎంతో ఆకర్షణీయంగా ఉంది. బంధుమిత్రులతో, వచ్చిపోవు వారితో, భజంత్రీలతో, పిల్లల అల్లరితో ఎటు చూచినా సందడిగా, వేడుకగా ఉంది.

భట్టు యాజ్ఞీకం వహించేందుకు వేరొక శాస్త్రిని నియమించి, తాను తన భార్య దివాకరరావు, రామమోహనుల కోరిక మీద కన్యాగృహీతలుగా నిలబడ్డారు ప్రధాన హోమాదులయ్యాయి. ముహూర్తానికి సరిగ యశో మెడలో పుస్తె కట్టి దివాకరరావు ఆమెను తనదాన్ని చేసుకొన్నాడు

ఇంతకు ముందే నిరాశాహతమైపోయిన యశోదా రాగ

హృదయాలు ఆకాస్త కర్మకాండ ముగియడంతో మరింత నిస్పృహత లోలోన అలమటించి పోయాయి. వారి బాధ నర్థము చేసుకో కలిగింది కన్యాదాత. అతని భార్య, కొడుకు మాత్రమే.

రామమోహనుని కంటి నుండి. యశోద కంటి నుంచి యేక కాలములో. స్రవించిన కన్నీటి బిందువులను ఆనంద బాష్పములని అందరు తలంచారు కాని, అవి దుఃఖాశ్రువులని అర్థమైంది పై ముగ్గురికి మాత్రమే. అప్పటికేమో అంతా సక్రమంగా జరిగిపోయింది కానీ, మున్ముందీ బడబాగ్ని హృద్గతమై నిలిచి ఎట్టి విషాద పరిణామాలకు దారి తీస్తుందో అనే భయం కూడా సంతోషానికి చుక్కెదురై వేంకట్రామయ్య మనసులో పొడసూపింది.

ఎంత మనోధైర్యముతో తన్ను తాను సంబాళించుకొని, అధర్మ చింతల కాస్కారమియ్యరాదను నిశ్చయముతో నున్నవాడైన, రామమోహను డా క్షణములో కొంత మనోవికారమును పొందలేకుండ ఉండలేక పోయాడు. అన్న కూర్చున్న పెండ్లిపీట మీద యశోద ప్రక్కలో తన భావ చిత్రాన్ని ఊహించుకొని తల్లడిల్లి పోయాడు.

అన్న పెండ్లివిషయములో తానే ప్రధాన కార్యభారాన్నంతా వహించి తనకు సమీపములోనే కూర్చొని ఉన్న రామమోహనుని కన్నెత్తి చూచే సాహసం లేకపోయినా, యశోద విధికృతానికి తల వాల్చినదానివలె, అవనత శిరస్కయై శరీరాన్ని మాత్రము పెండ్లి పీటమీద ఉంచి, మనసును రామమోహనుని పాదాక్రాంతం చేసి ఆక్రోశిస్తూ ఉంది.

యశోద, రామమోహనుల మనోగతమెట్లు పనిచేస్తూఉండేది ౯ామయ్య, సునంద గమనిస్తూనే ఉన్నారు. కృష్ణమూర్తి యేదో ౧ పెండ్లికి రాలేదు. అతడు రాకపోవడం దివాకరానికి కొంత

వెలితిగా కాన్పించినా, చిన్నబావమరది ఆనందు ప్రక్కన ఉండబట్టి ఆ కొఱతనంతగా మనసు కంటించుకోలేదు.

ఆనందు వయసులో చిన్నవాడైనా చాలా హుషారైనవాడు. కాబట్టి రామమోహనుడు తమ ఊరికివచ్చినది, అచ్చట జరిగిన సంగతులు అవి కూడ దివాకరానికి చెప్పునేమో అని తండ్రి, అన్న యింటివద్దనే చెప్ప వద్దని కట్టడి చేశారు. ఎందుకో వానికి రామమోహనుని వద్దనుండిన చొరవ దివాకరరావు దగ్గర లభించలేదు. అందువల్ల వాడుకూడ ఏమి మాట్లాడలేదు.

పెండ్లి మూన్నాళ్ళ ముచ్చటగానే జరిగిపొయ్యింది. మోహనుడు యాంత్రికంగా తన కర్తవ్యాన్ని తృప్తికరంగానే నెరవేర్చగలిగాడు.

తన జీవితమింక దివాకరరావుతో అనుబంధమైపోయాక గతాన్ని నెమరవేసుకొనేది వివేకంగాదని తలచి యశోద న వాతావరణానికి అలవాటు పడడానికి నిశ్చయించుకొంది. అయినా, రా మోహనుని మొగమును చూచినప్పుడంతా అనిర్వాచ్యమైన యేదోబాధ తల ఎత్తి ఆమె నశాంతిపాలు చేస్తూఉంది.

గతించిన మాణిక్యాంబకంటె యశోద సౌందర్యవతి - లావణ్యవతి. అట్టిభార్య లభించినందుకు దివాకరరావు పరమానంద భరితుడై, వచ్చిన బంధుమిత్రులతో సరస సల్లాపాలాడుతున్నాడు. తాను రూపవతి యగు యశోదపతియైనందుకు ఒకరీతి అహంకారమతని దృష్టియందు తొంగి చూచుండెను.

రామమోహనునికి 'వదినె' లభించింది. ఆమెఅన్న జీవితాన్ని స్వర్గతుల్యం చేయగలదు, గృహలక్ష్మియై సంచరించగలదు. తానామె నిక 'వదినా' యని పిలువకతప్పదు, కాని అందులో సంతోషము కాని, ..ంతృప్తికాని లేదు. తాను ప్రేమించి తనకుపత్ని కాగలదని ఆశించిన

వనిత యిప్పుడు వదినఅయితే, ఆమె నారీతిగా పిలుచుటకు తగినధైర్యాన్ని కూడ గట్టుకొన యత్నిస్తున్నాడతడు.

పిలుచుటకేమో 'వదిన' అనేశబ్దము చాల మృదువుగ, ఆప్యాయంగా వుంది కాని, ఆ పిలుపువెనుక దాగిన దావాగ్నివేదిమి తనకు, 'వదిన'కు మాత్రము తెలియును, దివాకరాని కేమితెలుసు?

ఒకవేళ దివాకరానికి తెలిస్తే? ఇంకేమైన ఉందా? సమకూర్చిన సంసారము సాగరమై పోవలసిందే. అందుకే రామమోహను డొకవంక, యశోద మరియొకవంక భావగోప్యమొనర్చుకొని వివాహం మూడుదినాలు నవ్వుముఖాలతో నటించారు.

అయినా, ఆ యిరువురి ముఖాల్లో కాన్పించే విరహాగ్ని వేంకటపయ్యకు, ఆతని సతీమణికి మాత్రము స్పష్టమై కనబడుతూనే ఉంది. ఏంచేయగలరు? విధివిలాసానికి ప్రతియొక్కరు తలవాల్చవలసిందే,

వివాహానంతరం వచ్చిన బంధుమిత్రులంతా ఎక్కడివారక్కడికి వెళ్ళిపోయారు.

గుంటూరునుండి చలపతి వచ్చాడని ప్రత్యేకంగా చెప్పబనిలేదు. రామమోహనుడు మిత్రుని ఆహ్వానించాడు. కృష్ణమూర్తి రాకపోవడ మొకరీతిగా లోటుగా నేకాన్పించింది-కాని,రామమోహనుడందు కాతనినితప్పు తలచేస్థితిలో లేడు. వచ్చి తనబాధను కన్నార చూడడమాతని కిష్టము లేదని మోహన్ గ్రహించాడు. తనమాట జరక్కపోయినప్పుడు తానక్కడ ఉండడంకూడ సమంజసం కాదని కృష్ణమూర్తి తలంచినట్లు చలపతి చెప్పాడు, అసలు దివాకరరావే తన పెద్దబావమరది రానందు కెంతో నొచ్చుకొన్నాడు. కాని, వేంకట్రామయ్య దంపతులు తెలిపిన యేదో కల్పిత కారణంతో అతడు కొంత సమాధానపడ్డాడు.

పెండ్లి నాల్గురోజులు చలపతి ఒక్కక్షణమైన మోహనుని ప్రక్క

వదల్లేదు. అప్పుడప్పుడాతనిలో కలిగే విచారాన్ని, ఉద్విన్నతను గమనించి, సమయోచితమగు మాటలతో ఉపశమింపజేస్తూ వచ్చాడు. వాస్తవ స్థితిలో చలపతి దగ్గర లేకపోయివుంటే పెండ్లి రోజుల్లో మోహన్ అంత ప్రశాంతంగా కాలం గడిపేవాడుకాదు.

దివాకరరావు తనకు మరల లభ్యమైన సంసార లాభాన్ని తలచుకొంటూ ఆనంతృప్తిలో మునిగిపోయినాడు. అందమైన భార్య సాహచర్య చింతలో గతాన్ని మరచిపొయ్యాడతను. అయినా, ఒక్కొక్కమారు స్పష్టంగా కాన్పించే తమ్ముని అవస్థను గమనించి, కారణాన్ని ఊహించలేక, కొంత మధనపడుతూ వచ్చాడు. ఇదంతా వివాహేచ్ఛ కాబోలునని ఊహించుకొని, వీలైనంతత్వరలో ఒక చక్కని అమ్మాయిని తెచ్చి తమ్మునికికూడ పెండ్లి చేయాలని మనసులోనే నిశ్చయించుకొన్నాడు అన్న.

వేంకట్రామయ్య దంపతులు కొన్నాళ్ళుండి, బిడ్డను, అల్లునికి, మోహన్‌కు చెప్పవలసిన మాటలు చెప్పి, వారికర్తవ్యం నిర్వర్తించి స్వగ్రామానికి వెళ్ళిపోయిరి,

కథ కింట్లో మిగిలింది యశోద, దివాకరరావు, రామమోహన్ మాత్రమే. వారి వాస్తవిక జీవితాలకది ప్రాతిపదికము.

♦ ♦ ♦

ఆ క్రొత్త సంసారాన్ని సరిదిద్దుకొనే విషయములో ఎవరిసలహాలు లేకుండ సహజంగా వివేకవతియై వర్తిస్తూ వచ్చిన యశోద చాకచక్యానికి పొరుగుంటి అన్నపూర్ణ, కామాక్షి విస్తుపోయారు, బట్టి తన్నావిషయమై అభినందిస్తే దివాకరరావు లోలోన మురిసిపోయాడు.

అదేమి లేనిసంసారమా? ఆ విషయములో తన అదృష్టాన్ని

లచుకొని, యశోద సంతృప్తిపడింది. కాని, కంటిఎదుట తన కెవరైతే భర్త కావాలని పెండ్లికిముందు తనహృదయాన్నర్పించి వేసిందో, ఎవని స్పర్శసుఖాన్ని ప్రప్రధముగా అనుభవించిందో, ఎవడు తన జీవిత భాగస్వామినిగా తన్ను గ్రహించి ధన్యుడు కాదలచి ఉండెనో, ఎవనితో తన జీవితమునంతటిని మధురమయంగా గడపాలని తాను నిశ్చయించుకొని ఉండెనో — అతడిప్పుడు 'మఱది' స్థానములో నిలచిపోయాడు. తా నతన్ని పుత్రప్రేమతో చూడాలి. అతడు తన్ను మాతృప్రేమతో చూడాలి. ఈ అసిధారావ్రతచర్య నలవరచు కోవడంఒకవైపు యశోదకు — మరియొకవైపు మోహనునికి అసాధ్యమై కాన్పించింది. కాని —,

కాని, వారాచేదుమాత్రలను మ్రింగక తప్పలేదు. దానివలన అవివేకులు కారాదు. అట్లయినచో తమకంటే ద్రోహులు, నీచులు, పాపులు యీ లోకములో ఉండరని ఉభయులకు తెలుసు. తనపై ఎంతో విశ్వాస ప్రేమలుంచుకొని, తండ్రి తరువాత తండ్రియై ఆదరించే అన్నకు ద్రోహమెంచరాదని రామమోహను డొకవంక తనమనసును నిష్కళంకము చేసికొన యత్నిస్తూ ఉంటే, చేబట్టిన వానికి ద్రోహమెంచకుండ, సతీ ధర్మాన్ని రక్షిస్తూ, తన మూలకంగా అది సుందోపసుందుల కాపురం కాకుండా చూడాలని యశోద మరియొకవైపు నిశ్చయించు కొనింది.

అయినా, మనసులలోని గాయాలు మానడానికి కాలం గడవాలి. ఈ లోగా —.

ఈ లోగా ఒకనాడు దివాకరరావు ఆఫీసుకు పోయిన వేళలో రామమోహనుడు ఒకచిన్న కవరులో ఏదోవుంచి, భోజనానంతరం తన గదిలో కూచొని పుస్తకం తిరుగవేస్తూ ఉంటే యశోదతో యేదో మాట్లాడబోయాడు. కానీ —,

తటాలున లోపలికి వెళ్ళడానికి కాళ్ళు తటపటాయించాయి. సామా

న్యంగా సాహసించి "వదినా!" అని పిలువడానికి గొంతులో యేదో అడ్డు పడింది. యశోద అతని రాకను గమనించలేదు. తుదకు మోహన్ తలుపువద్దకు వచ్చి నిలబడినాడు. యశోద చూచింది. ఆమె మనస్సు ఉద్విగ్నమైంది. పెండ్లితరువాత యింట తామిద్దరే ఉండడం అదే మొదటి సారి. తానెంత మనో విజయాన్ని సాధింప యత్నిస్తూ ఉన్నదైన, ఎదుటి వాని నిశ్చయమామె కెట్లు తెలియగలదు? అందులో పురుష హృదయ మీ విషయాల్లో స్త్రీ హృదయాని కంటే బలహీనమైంది. స్త్రీ తన మనో వైకల్యాన్ని ఎంతకాలమైనా, తన కిష్టమువచ్చిన రీతిగా, సందర్భోచితంగా అణచిపెట్టుకోగలదు. కాని, పురుషులలో చాలమంది కలాటి నిబ్బర ముండదు!

యశోద యింతవరకు మరదిని పేరుపెట్టి పిలిచిందికాదు. పిలువ డానికి కూడ ఇప్పుడే ప్రధమావకాశం లభించింది. అంతేకాదు, తన హృదయ పరివర్తనాన్ని, మనోనైర్మల్యాన్ని వ్యక్తపరచాలంటే తానొక మారు నిష్కల్మషమైన చిరునవ్వుతో, బిడ్డయెడ తల్లికి గల ప్రేమ నావ హింపజేసికొని, సోదరి సోదరప్రేమ నాకళింపుచేసుకొని, అతన్ని మనసార ఒకమారు "రామమోహన్!" అని పిలవాలి. అందుకనుగుణంగా అతడు తన్ను "వదినా!" అని సంబోధించాలి. అంతవరకు ఉభయుల హృద యాలు తేలికపడేట్టు లేదు – అంతవరకు హృదయాల్లో గూడుకట్టుకొన్న పూర్వస్మృతులు నశించి పోయేట్టు లేదు.

యశోదదే మొదటి విజయము! ఆమె బయట తారాడుతూ ఉన్న మోహనుని గాంచి "మోహన్, ఏమిటి సంగతి?" అని ప్రశ్నించింది. ఆ క్షణములో ఆరిపోవుటకు ముందు దీపమొక్కమారు ప్రజ్వలిత మైనట్టు, ఆమె హృదయములో నిండి ఉండిన పూర్వభావాలన్నీ ఒకమారు ఉద్రేకించి, శరీరాన్ని స్వేదార్ద్రము చేసివేశాయి. ఆ మరుక్షణమే యశోద మనసు చాల తేలికపడిపొయ్యింది.

ఆమె చిరునవ్వుతో "మోహన్! నాతో మాట్లాడవలెనా?" అని వచ్చింది బయటికి.

ఆ సుందరముఖారవిందము మందస్మితముతోవిప్పారి అమృతం చిందిస్తూ ఉంటే, ఆ దృశ్యాన్ని చూచి భరించలేక, మాట్లాడే సాహసం లేక, మోహనుడు తలవాల్చి నిలబడ్డాడు.

ఉన్న దున్నట్టు మఱది చెక్కిళ్ళమీద రెండు కన్నీటి చుక్కలను చూచింది యశోద. ఆమె హృదయం చివుక్కుమనింది. అప్రయత్నంగా ఆమె కళ్ళల్లో కూడ నీరు తిరిగాయి.

చెంగుతో కన్నులొత్తుకొంటూ ఆమె "ఇంకా గతాన్ని తలచుకొని విచారిస్తున్నావా, మోహన్?" అని ప్రశ్నించింది.

"లేదు, వదినా!" – మోహనుడు తలయెత్తకుండానే సాహసించి అన్నాడామాట.

ఇంట మూడవ ప్రాణిలేదు. ఇరువురి మనసులు వైకల్యాన్ని చెంది, తాము మొదటిసారి కలువలపల్లిలో ఒకరు మరియొకరి కౌగలిలో కరిగిపోయినట్టు యే సాహసానికైనా దిగడానికి ప్రకృతి ఆటకంమేమియు లేదు. అయినా –

అయినా, ఇరువురి మధ్య వినిర్మలమైన ధర్మము అడ్డమై నిలిచింది. ఇరువురు యేదో అజ్ఞాత శక్తివల్ల ఎడముగ నుంచబడినారు. తుదికొకరినొకరు సాహసించి కన్నెత్తి చూడ్డానికి కూడ వారి నశక్తులను చేసివేసింది ఆ మహత్తర శక్తి. అది బయటనుండి వచ్చిందికాదు. వారి హృదయాల్లోనే జనించిన వివేచనా శక్తి అది.

పరస్పర వినిర్మల ప్రబోధముతో, కన్నీటి తుషుపుతో మనసులను యిద్దరు జయించగలిగారు. అవి తేలికై పోయినాయి.

రామమోహనుడు చేతిలోని కాయితం పొట్లాన్ని యశోద కందిస్తూ

"ఇది మీ మరిది మీకు శాశ్వతంగా అర్పించుకొనే ప్రేమకానుక."
ప్రక్కకు తిరిగి మరల కన్నులు తుడుచుకొన్నాడు.

యశోద కాయితపు మడుపును విప్పిచూచింది-అందులో ఏముంది? కొంత బూడిద!

ఆమె విస్తుపోయి "ఇదేమిటి, రామమోహన్?" అని అడిగింది.

# 8

"అదినాకు మీ యెడ నున్న పూర్వప్రేమ"

"అంటే?"

"అంటే, దాన్ని సమూలంగా కాల్చి బూడిద చేశాను."

యశోద యేదో సంతృప్తితో నవ్వుతూ రామమోహనునివైపు జాలిగా చూచింది.

"నీ మనసు చాల గొప్పది, మోహన్"

"అంతకంటే గొప్పది మీ మనసు."

"ఈ బహువచన ప్రయోగమెందుకు? నీవు నా కంటే పెద్దవాడవు."

"వయసులో కావచ్చు. కాని మీరిప్పుడు మా అన్నను చేపట్టి నాకు మాతృస్థానములో ఉన్నారు. నాకు మీ యెడగల గౌరవానికది చిహ్నం."

"ప్రేమ విస్తారమైనప్పుడు ఏకవచన ప్రయోగమే సమంజసము కాదా?"

# కన్నీటి కాపురం

ఎంత విస్తృతమైన ప్రేమ కలిగినా వ్యక్తిగత గౌరవాన్ని మరచి,
ృతో వర్తించడం సమంజసము కాదు."

నాటినుండి రామమోహనుడు మునుపటి ముభావాన్ని కొద్దికొద్దిగా సడలిస్తూ వచ్చాడు. అతని విషయమై యశోదకు పూర్వముకంటే ఉదార భావమేర్పడింది. దివాకరం ఎదుటనే అవకాశం దొరికినప్పుడంతా "వదిన" అని ఒకరు, "రామమోహన్ అని ఒకరు సంబోధించుకొంటూ, తమ హృదయాల నంతకంతకు తేలికపరచుకొంటూ, దివాకరానికి సంతృప్తి కలిగేట్టు వర్తింపసాగారు. అయినా –

అయిన, మానవులలోని పశుత్వం అంత సులువుగా శీఘ్రంగా అణగి పోవడ మసహజము. వీలైనప్పుడంతా అది తలఎత్తి, విజృంభించి, వివేచనా శక్తినపహరించేందుకు యత్నిస్తుంది. మనో విజయమంత సులువై యుండే యీ లోకములో క్షణక్షణాని కెంతమంది మహానుభావులుద్భవించేవారో ! తమ్మెదిరించి నిలచిన దుష్టశక్తి నెదిరింపయత్నించే విశాల హృదయు లెందరైన కలుగవచ్చును కాని, ఆ పోరాటములో విజయులయ్యేవారి సంఖ్య మాత్రము వ్రేళ్ళమీద లెక్కింపవలసిందే. అనుకొన్న మాత్ర మాత్రాన ఎవ్వరు మహానుభావులు కాజాలరు. "ఇనుపకట్టడాల్లటిన" మహా మునులే కామవివశులైపోతూవుంటే, ధర్మాన్ని ఒక్క పాదంమీద నడి పిస్తూ, అనుక్షణం పశుధర్మాన్ని రెచ్చగొట్టే ఆధునిక నాగరితకు లొంగిన నేటి కాలపు యువతీ యువకులేమి – మనో విజయమంటే ఏమి – అంతా గగన కుసుమమే. కాని –

కాని, మానవులలో ఏ కొలదిమాత్రమైన విజ్ఞానకళిక వెలుగుతూ వుంటే చాలు, అది అజ్ఞానాంధకారాన్ని దరిచేరనివ్వదు. అయినను,

అయినను, మానవుడు ఆశాజీవి. ఆశయే వానిజీవితాని కాధారము. శూన్యుని బ్రతుకు దీపకళికలేని గాఢాంధకార బంధురదేహము. ఈ

"మోహన్! నీకిప్పుడిక్కడ కలిగినలోటేమి? ఇంటిపట్టున యిన్నాళ్లు నిన్నాదరించేందుకు వదినలేదని విచారిస్తూ ఉంటివికదా? ఇప్పుడీవదిన వచ్చింది. ఈమె వండిపెట్టే రుచిగల పదార్థాలుతిని సుఖంగా యింటిపట్టున ఉండకుండ మరెక్కడకు పోతావు, తమ్ముడూ? ఇంతకాలమునుండి లేని యీ దుష్టచింత యిప్పుడెందుకు కలిగింది? నీవు ఇంటిని వదలిపోవడం న్యాయంకాదు. చూచినవారేమందురు? "అదో యిన్నాళ్లు అన్నదమ్ములెంతో ప్రేమ విశ్వాసాలతో ఉంది, ఇప్పుడు పెండ్లికాగానే అన్నతమ్మున్ని యింటి నుండి తరిమివేశాడు" అని లోకులు నన్నుగురించి యేమనుకొంటారో ఆలోచించావా, మోహన్? ఇది నాకు, మీవదినకుకూడ అపకీర్తి కారణ మౌతుంది. నీకు సమ్మతమా?"

"ఛీ-ఛీ- నేను వెళ్ళిపోతేమాత్రము యీ పాపిష్టిసమాజము మమ్మెం దుకు దూషించాలి? మావదినె హృదయము నాకు తెలియదా."

"నీకు తెలియును. కాని, లోకానికేమి తెలుసు? నీవు యిల్లువిడిచి పోవద్దు."

యశోద కన్నీరు తుడుచుకొని "రామమోహన్! నీవెక్కడికి వెళ్ళ వద్దు. నీకు కలిగిన కొఱతయేమి? నీవింట్లో ఉండటం నాకిష్టములేదనా?" అని భారంగా ప్రశ్నించింది.

రామ మోహనుడు మౌనముగా నిలబడ్డాడు- రెండు నిమిషములు దాటిపోయాయి.

"అన్నా! మీరు నూతనదంపతులు. నాఉనికి మీసుఖానికంతరాయము కావచ్చు...."

"ఛీ-ఛీ- ఏమిమాటలురా, మోహన్? నీవు మాసుఖాని కంతరాయ మౌతావా? ఈలాటి పనికిమాలిన ఆలోచనలతో నీబుద్ధిని పాడుచేసికోవద్దు నీబలవంతముమీదనేకదా నేను మరల పెండ్లిచేసికొనింది." అని దివాకర

రావు బిరబిర తనగదిలోకివెళ్ళి ఒకవుత్తరం పట్టుకొనివచ్చి "చూడరా, మోహన్, ఇది నీవు వ్రాసిన ఉత్తరమేకదా? "నీవింక మూడు నాల్గునెలల్లో నీకు నచ్చిన అమ్మాయినిచూచి, మరల పెండ్లిచేసికొని, మనశ్శాంతితో ఉంటేకాని నేనింటికిరాను. నాయాశ నీవింకవిడిచిపెట్టు" మని నీవేకదా వ్రాశావు? నీకోరికప్రకారమే దైవికంగా యశోద నీకు వదినయై యింటికి వచ్చింది. ఇప్పుడెక్కడికో వెళ్ళిపోతానంటావా"

అవును.... రామమోహనుడానాడు అన్నకువ్రాసిన ఆవాక్యమే యీనాడతనికి కుత్తుకకు కాలసర్పమై చుట్టుకొంది. తాను ప్రేమించిన యశోదయే తనకు వదిన అవుతుందని అతనికేమితెలుసు.... అంతా విధివిలాసము-ఇల్లాలు లేని బ్రతుకు లేబరమనో. లేక, తమ్ముడింటికిరాడనో- దివాకరరావు మరల పెండ్లిచేసికొన్నాడు- ఎవరిని? తమ్ముడు ప్రేమించిన సుందరిని!.... అయితే, ఆసంగతి అతనికేమి తెలుసు?

"అవును, నేనువ్రాసినది నిజమే. ఈమె నాకు వదినెయై వచ్చింది."

"మరి అంతమాత్రానికే యిల్లువిడిచిపోవచ్చునా నీవు?"

"మీసుఖానికి నేను...."

"ఎంతమాత్రము అడ్డుకాజాలవు. అయితే, నిన్నొకక్కమాట అడుగుదునా?"

"అడుగు ఏమది?"

"మీవదినమీద నీకసహ్యముండవచ్చు."

రామమోహనుడు తటాలున చెవులు మూసుకొన్నాడు, కన్నుల వెంట నీరుకారింది.

"లేదన్నా, లేదు. నీకు నామాటలర్థముకాలేదు. వదినమీద నాకసహ్యమా? ఎంతమాట! ఇప్పుడామె నాకు మాతృస్థానములోనుంది నన్ను

కొడుకువలె ప్రేమిస్తుంది. ఆమె మనయిరువురి అన్యోన్యప్రేమను వృద్ధి చేస్తుంది. ఆమెయెడ నాకు ప్రీతి, గౌరవము కలవు. ఆమె మనస్సునకెప్పుడు కష్టము కలిగించలేదు.

రామమోహనుని మాటలన్ని నర్మగర్భంగాతోచి యశోద తేలు కుట్టినదానివలె లోలోన బాధపడసాగెను.

భార్యాభర్త లిరువురు రామమోహనుని సంకల్పాన్ని వ్యతిరేకించి రి ఎన్నడులేనట్టు మగనియెదుట మరదిని యశోద యిట్లని హెచ్చరించింది.

"రామమోహన్। మీఅన్నగారన్నట్టు నీవు యింటిని వదలిపోవుట వలన ఉట్టిలేకనే ఊగేసంఘానికి నోరిచ్చినట్టవుతుంది. నన్ను నలువురు నిందించవచ్చును, నన్ను దుఃఖము, అపనిందపాల్జేసి నీవు నెమ్మదిగా ఎక్కడికో వెళ్ళిపోదలచితివా? నీవు మీ అన్నను వదలిపోతివా యింతటితో నీకు, మాకు సంబంధము వదలిపోయిందనే భావించాలి, నీకు నాపై ద్వేష ముండవచ్చు. కాని, నేను నీద్వేషానికి తగినదాన్నికాను. నిరపరాధిని. ఒక వేళ నేనేది చేయరానితప్పిదము చేసిఉంటే నన్ను క్షమించు. మీయింటికి గృహలక్ష్మినై వచ్చిన నన్ను ఆదరించి, గౌరవించడము నీకర్తవ్యము- అది నీధర్మము. నీకు విధివశమున నేను వదిననైనమాత్రాన నన్ను తృణీకరించ డం న్యాయముకాదు. నీవు విజ్ఞానివి నీవీ యింటిని వదలిపోతివా నేనొక్క-క్షణముకూడ యిందుండను. నీకు కాబట్టనియిల్లు నాకెందుకు? ఇంటికివచ్చి చేరినవెంటనే మరదిని యింటినుండి వెళ్ళగొట్టెననే అపనిందకు నన్ను గురుచేసి, నేను దుఃఖభాగినినై కన్నీటితో కాలముగడిపేదిచూచి ఆనందిం చవలెననియా నీ కుతూహలము? మోహన్.... నేను నీ.... నీ.... వదినె కానా? నన్ను లోకము నిందిస్తే ఆబాధ నీదికాదంటావా? నేనీయింటికి రావ. డమే నాదౌర్భాగ్యమంటావా?"

యశోద మాటలు నిరర్గళమై సాగినవి. ఆవాక్ప్రవాహ వేగమునకు

రామమోహనుడు నిర్మించుకొన్న సంకల్పకుడ్యము తునియలై కూలి పోయింది. ఆమె కన్నీటినిచూచి ఆతని హృదయము ద్రవించిపోయింది! ఆతనుకూడ కన్నీరుకార్చాడు.

"లేదు-లేదు- మీమనసును నేనెప్పుడు నొప్పించలేను. వదినా. మీరు కన్నీరుకార్చుటము భావ్యముకాదు. నేనుచూసి సహించలేను. నాహృదయము తునియలై పోతుంది, తల్లిదండ్రులులేని నాకు మీరే తల్లిదండ్రులు అంధకారమయమైన మా అన్న జీవితహృదయాగారాన్ని వెలుగుతో నింపారు. మీ నిత్యసంతోషమునే నేనుకోరేది. మీఆనందమే నాఆనందము. మీదుఃఖమే నాదుఃఖము."

అని రామమోహనుడింక అక్కడ నిలబడలేక మేడపైకి చకచక మెట్లెక్కిపోయాడు.

తమ్ముని మనసు మారినందుకు - అతడిల్లువిడిచి పోనని చెప్పినందుకు దివాకరరావు సంతోషముతో ఉబ్బిపోయాడు. తనసంసారమునకు తమ్ముడు మూలస్తంభమై ఉండాలని వానికోరిక. అంధకారమయమైన తన జీవితము మరల తమ్మునివలననే వెలుగులోనికి వచ్చిందని అన్నతలంపు, మరల తనకథ ప్రారంభమైనది. ఇకముగిసిందా.... మరల ప్రారంభముకాదు.

# 9

దివాకరరావు పది గంటలకు భోజనం చేసి ఆఫీసుకు వెళ్ళి పోయాడు.

మగడు, మఱిది భోజనాలు ముగించుకొని వెళ్ళినాక యశోద తాను భోజనం చేసి, వంటింటి పనులన్నీ ముగించుకొని వచ్చి, హాలులో కూర్చుంది.

రామమోహనుడు తన గదిలో కూర్చొని ఆలోచిస్తున్నాడు. అతడు తన బాహ్యాలోకజ్ఞానాన్నే కోల్పోయినట్టుంది. బి. యస్‌సి. ప్యాసైన తరువాత ముందింకా ఎంతో చదవాలని ఆసించిన అతని మనసు నిరుత్సాహ వాతావరణములో పడి తిన్నని దారి కోల్పోయింది.

లోకములో ఎంత చదివిన, ఎంత ఐశ్వర్యముండిన, వేంత ఘనత వుండిన, తగిన జీవిత స్వామిని లేనివాని బ్రతుకంతా అడవి కాచిన వెన్నెల కాక మరేమౌతుంది?

యశోద చేయి తప్పిపోయిన తన జీవితమంతా శూన్యమైనట్టు రామమోహనుని విచారము. కంటికిప్పుడామె వదినెయై కాన్పించినా, ఒకప్పుడామె తన మనోరాజ్యము నేలిన ప్రియురాలు. గతమును గూర్చి అతడు చింతామగ్నుడై పోయాడు.

ఒకటి రెండు మార్లు యశోద రామమోహనుని పిలిచింది కాని, అన్యచింతాయత్తుడైన వాని కది వినబడలేదు. ఏమి చేస్తున్నాడా అనే కుతూహలముతో ఆమె గదివద్దకు వెళ్ళి లోపలికి తొంగి చూచింది. మోహనుడు ఈజీఛేర్‌లో కూర్చొని మిద్దెకేసి చూస్తూ ఆలోచనలో మునిగి పోయాడు.

"మోహన్" – యశోద మృదువుగా పిలిచింది.

ఆ పిలుపు ఆతని చెవిలో పడలేదు.

"రామమోహన్!"

ఈమారు మోహనుడు ఉలిక్కిపడి లేచి "ఎవరు?" అని ప్రశ్నించాడు.

"నేను – యశోద"

"పిలిచారా?"

"ఔను."

"ఏమి సమాచారము?" – అని రామమోహనుడు కుర్చీనుంచి లేచి వచ్చి ఆమె ఎదుట కొంత దూరాన నిలబడ్డాడు. కన్నులలో అప్పుడే పుట్టి అంతరించిన కన్నీటి మరకలు కాన్పిస్తున్నాయి.

"మరల ఎందుకా కన్నీరు?" అనిఅడిగింది యశోద విస్మయముతో.

అందుకు కారణమామెకు తెలియనిది కాదు. అతనిని సుఖసంతోషాలలో తేల్చివేయగల శక్తి తన కిదివరలో ఉండినను, తండ్రి చేసిన నిర్ణయానికి బద్ధురాలై, విధివిధానానికి తల యొగ్గింది. మోహనుకు తన కొరకే దుఃఖపడుతున్నాడనే సంగతి తనకు తెలిసియున్నను, వాని జీవిత మంతా కన్నీటిమయ మౌతూందని గ్రహించినప్పుడేస్త్రీ దానిని చూచి సహించ గలదు?"

"ఏమి లేదు, వదినా, నాకెందుకు కన్నీరు? నన్ను తల్లివలె చూడ గలిగిన వదిన లభించినప్పుడు నాకు కన్నీరెందుకు?"

ఆ మాటలలో వ్యంగ్య మేమియు లేదు. అయిన, యశోద కవి ఘూలాఘాతమైనాయి.

"అయ్యో మోహన్! నీ చిత్రహింసకు నేను కారణమైతినా? నీ కన్నీటి నిట్లు మాటిమాటికి నాపాడు కండ్లతో చూడవలసిన దౌర్భాగ్య దశ నాకు కలిగింది. నేను పాపిని - మహాపాపిని."

కుముద కన్నుల వెంట బాష్పబిందువులు జలజల రాలి ఆమె మృదు కపోలాలను తడిపి వేశాయి.

"వదినా - వదినా - నన్ను క్షమించమ్మా. నీ మనసును బాధించే యీ కన్నీటిని మరల కార్చను."

"మోహన్! క్షమించవలసినది నీవు కాని నేను కాదు. నన్ను నమ్మి, నాతో వాగ్దానము తీసుకొని వెళ్ళిపోయిన నిన్ను వంచించిన మహా పాపిని నేను, నీ మనసును మసన మొనర్చిన చండాలి నేను."

"అది అబద్ధము. ఒంటిగాండ్రై హోటలు తిండితో అన్న కష్టాలు పడుతూవుండిన మాపాలిటికి భాగ్యదేవతగా వచ్చిన పుణ్యాత్మురాలవు."

రామమోహను దొక్కమారు మనసార నవ్వాడు. ఆ మాటలకు యశోద దుఃఖపడుతూ తానూ నవ్వింది.

అతడన్నట్టామె వారికి హోటల్ తిండి తినే దౌర్భాగ్యాన్ని తప్పించింది కాని, కర్మఫలాన్ని తప్పించ లేకపోయింది.

"మోహన్ నన్ను క్షమించగలవా?"

మీరే యపరాధ మొనర్చినారని మిమ్ము క్షమించాలి? మిమ్ము తప్పు పట్టగల యోగ్యత నాకున్నదా?"

"మోహన్! నా దొక్క ప్రార్థన....

"అబ్బా! అంతమాట వద్దు. ఆజ్ఞ అనండి.

"సరే, ఆలాగే కాని. విన్న తరువాత కాదంటే?"

"ఈ రామమోహనుడంత నీచుడు కాదు, వదినా!"

"సరే, ఇకమీద నీవు నన్ను 'మీరు' అని సంబోధించకూడదు. ఏకవచన ప్రయోగమే చాలు మనో నైర్మల్యాన్ని ప్రదర్శించేందుకు.

మోహన్ నవ్వి "అలాగే." అన్నాడు.

"నీవు క్షమించినాననేంతవరకు నాకు మనశ్శాంతి లేదు మోహన్"

"సరి. క్ష - మిం - చి - నా - ను."

రామమోహనుని వాక్కు అస్పష్టంగానే ముగిసింది. వెంటనే అతడక్కడి నుండి అపరాధివలె తప్పించుకొని వెలుపలికి వెళ్ళిపోయాడు.

సాయంకాలము యశోద వసారాలో ఒక బల్లమీద కూర్చొని లేసు అల్లుతూంది.

ఎవరో గేటువద్ద "రామమోహన్" అని పిలిచినట్టయింది.

"ఎవరు వారు?" అని యశోద సహజంగానే ప్రశ్నించింది.

"రామమోహన్ ఇంటిలో ఉన్నాడాండీ?"

"ఉన్నాడు మేడమీదికి వెళ్ళండి" అని యశోద లోపలికి వెళ్ళి పోయింది.

ఆగంతకుడు సేరుగ రామమోహనుడున్న చోటకి వెళ్ళి "హలో - మోహన్" అని పిలిచాడు.

పరధ్యానముతో నున్న మోహనుడు ఉలిక్కిపడి తిరిగి చూచాడు. ఎదుట మిత్రుడు గోపాలరావు. అతనిని ఆహ్వానిస్తూ కౌగిలించుకొని మోహనుడు కుర్చీలో కూర్చుండబెట్టి "ఎప్పుడొచ్చావోయ్ గుంటూరు నుండి?" అని ప్రశ్నించాడు.

"నిన్న సాయంకాలము. Congratulations that you have

passed B. Sc. in I class (నీవు బి. యస్‌సి. ఫస్ట్‌క్లాసులో ఉత్తీర్ణుడై నందుకు అభినందిస్తున్నాను)."

ఇటీవల మోహన్ తన పరీక్షను, పరీక్షా ఫలితాన్ని గురించియే మరచిపోయాడు. జీవితములో అతనికి కలిగిన పరీక్ష ముందిదెంత?

గోపాలరావు చేతిలో నున్న ఒక ఆంగ్ల వార్తా పత్రికను తీసి చూపుతూ "ఇదిగో, యిది నీ నెంబరు. ఇది కలువలపల్లి కృష్ణమూర్తిది అని ఇద్దరు మిత్రులు ప్యాసైనట్టు చూపాడు. అందులో మోహన్ నెంబరు మొదటి శ్రేణిలో ఉంది. గోపాలరావు సెకండు యియర్ బి. యస్‌సి. అతనిది కూడ సింహాద్రిపురమే. మోహన్ అతడు కాలేజీ మేట్సు అయిన మిత్రులు.

పరీక్షా ఫలితాలను చూచాక రామమోహనుడు తాత్కాలికంగా కొంత ఉత్సాహ మనస్కుడయ్యాడు.

నీవిక ముందు ఏమి చేయదలంచావు, మోహన్?"

"ఇప్పుడేగా రిజల్ట్సు తెలుస్తున్నాయి? అప్పుడే ముందుమాట నేలా చెప్పేది?

"నీవు ప్యాసయ్యే విషయములో ఎవ్వరికి అనుమానమే లేదు కదా? అలాంటప్పుడు భవితవ్యాన్ని నిర్ణయించుకోకుండా ఉంటావా? ఇంతకు, యింత దూరం చదివాక నీవంటివానికి 'ఎయిమ్' అంటూ ఒకటి లేకుంటుందా."

"ఏమో. నాకిటీవల మనసే బాగులేదు, గోపాల్! అసలు సన్యాసినై పోతే బాగుండు ననిపిస్తూంది."

"ఇదేమిటి కోరికరోయ్? ఉన్నదున్నట్టు నీలాంటి యువకుడేమి? సన్యాసి కావడమేమిటి? సన్యాసి కాదలచిన వాడు బి. యస్. సి. ప్యాసు కావాలా? "



"లేదు. ఆ కోర్కె నాకీ వారము రోజుల నుండే కలిగింది."

"పిచ్చివాడా? సంసారంలో విరక్తి చెందినవాడుకదా సన్యాసి కాదలచుకొనేది? నీకింకా సంసారమే లేదు. విరక్తి ఎందుకు కలిగింది?"

"అసలు శంకరాచార్యులు సంసారి కాదు కదా? అతడెందుకు సన్యాసి అయ్యాడంటావ్?"

"వారంతా కారణజన్ములు. వారి అవతారోద్దేశమే వేరు. తాము చేయదలచిన మహత్కార్యములకు గృహస్థ జీవితము ప్రతిబంధక మౌతుందని వారు ఆడిలేనే సన్యాసులయ్యారు. మనవంటి వారి సంగతే వేరు? అలంటి మహానుభావులతో మనలను పోల్చుకోవచ్చునా, మోహన్?"

మోహన్ మాట్లాడ లేదు. లీలగా నవ్వి ఊరుకున్నాడు.

"సరే, ఏదో నీవే నిర్ణయించు కొంటావులే. ఇంతకు మీ అన్నకీ సంగతి యింకా తెలువదుగా?"

"సాయంకాలం యింటికి వస్తూనే చెబుతా."

మరికొంతసేపు బాతాఖాని గడిచాక గోపాలరావు మిత్రునిపద్ద సెలవు తీసికొని వెళ్ళిపోయాడు.

రామమోహన్ ఉత్సాహముతో చిరచిర మేడదిగి పోతూ "వదినా, వదినా," అని యశోదను పిలిచాడు.

ఏమిటో సంగతి అని ఆమె వసారాలోకి వచ్చింది మఱదిని ఎదుర్కొనేందుకు.

"Examination results (పరీక్ష ఫలితాలు) వచ్చాయి, వదినా?"

"నీవు ప్యాసయ్యావుకదూ?"

"నేనొకడే యేమిటి, కృష్ణమూర్తికూడ ప్యాసయ్యాడు."



కృష్ణమూర్తి, ఆశగా, తమ అన్నకూడ ప్యాసుకావడమేనో సంతోషవార్తేకాని, ఆ పేరును మోహను డుచ్చరించేసరికి యశోద హృదయము గతుక్కుమంది.

ఇంతలో గేటువద్ద "కంగ్రాచ్యులేషన్స్, మోహన్" అనే అరుపు వినబడింది. వదిన, మఱది తిరిగిచూచారు. దివాకరరావు ఆదినం "హిందూ" పత్రికను చేతబట్టుకొని వస్తూ "తమ్ముడూ, నీవు ఫస్టుక్లాసులో ప్యాసయ్యావురా. కంగ్రాచ్యులేషన్స్" అని మోహన్ వీపుమీద చేయివేసి నిమిరాడు, ముఖంమీద చిఱునవ్వు చిందులాడుతూ వుంటే.

ముగ్గురు సంతోషముతో లోపలికి వెళ్ళిపోయారు. యశోదా దివాకరుల మనసులలో వినిర్మలమైన ఆనందం తాండవించింది కాని, పాప మోహనుడు వారిపలె అంత నిష్కల్మషమైన సంతోషాన్ని అనుభవించ లేక పోయాడు.

తమ్ముడు బి. య. సి. ఫస్టుక్లాసులో ప్యాసయినందుకు దివాకరరావు తన సంతోషాన్ని వేయివిధాల వెల్లడించాడు. యశోద ఆ సంతోషములో భాగస్థురాలు. వారి ఆనందమంతా హృత్పూర్వకమైనది,

అట్టి సమయములో అందరికంటె తానే "ఎక్కువ ఉత్సాహ సంతోషాలను ప్రదర్శింపవలసిన మోహనుడు మాత్రము అర్థ మనస్కుడై సంతోషించినట్లు మాట్లాడుతున్నాడంతే. అతని ముభావానికి, మితభాషిత్వానికి కారణం మగనికంటె యశోదకే బాగా అర్థమయింది, మఱది మనసులోని నిరాశా విచారాలను అణచి, అతన్ని ఉత్సాహపరచాలని ఆమె ఎంతో నేర్పుతో వర్తిస్తూఉంది, అయినా, మోహనుని హృదయ కవాటం బంధించబడి పొయ్యింది. ఆ రెండు లోపల ప్రవేసించేందుకు వీలుకాకుండ, హృదయముయొక్క లోతులోని కది పొయ్యేందుకు సాధ్యము కాలేదు.

రాత్రి భోజనానంతరం అన్న తమ్ముణ్ణి కూర్చోబెట్టుకొని అడిగాడు, యశోదకూడ అక్కడేఉంది.

"మోహన్! నీవు ముందుయేదైన కోర్సుకు వెళ్ళాలి. నీ కేది యిష్టమో చెప్పు."

" నాకేది యిష్టములేదు. చదువే చాలిద్దామనుకొన్నా."

"అదేమిమాట? చదువలేకనా, లేక నేను చదివించలేకనా? నాకేమో ఎక్కువ చదువుప్రాప్తి లేకపోయ్యింది. నీ వింతవరకు చదివావు. గమువగలిగిన వయస్సు, శక్తి ఉన్నాయి. ఆ విషయమై నీ వెంతో వృద్ధికి రావాలని అమ్మ, నాన్న జీవించినకాలములో ఎంతో ఆశపడ్డారు, వారి కోర్కెను తీర్చాలి. నీవు తప్పకుండ చదవాలి. ఇంతకు నీ నిస్పృహకు కారణమేమో నాకు తెలియకుండ ఉంది. నా ప్రవర్తనా నీ దాపరికమంతా? చెప్పు, తమ్ముడూ! నీ కేమీ లోటు కలిగించాను? ఎందుకు నీ వెప్పుడు యింత విచారంగా ఉంటావు?"

అన్నమాటలలో ప్రేమామృతం చిప్పిలిపోయింది. ఆ మాటలను వింటూఉన్న యశోద కన్నుల్లో నీరుకూడింది. వంచిన తలయెత్తకుండ రామమోహనుడు లోలోన చాల కళవళపడి పోయాడు. తుదకెట్లో మనస్సును సమాధానపరచుకొని అతడిట్లన్నాడు.

"లేదన్నా. నాకేలాటి విచారములేదు. ఎందుకుండాలి? నీవు మరల గృహస్థుకావాలని ఎంతో ఆశతో ఉంటిని. ఆ యాశ తీరింది. ఆ యాశ తీరడంలో, లక్ష్మీదేవిలాంటి వదిన రావడముతో ఏలాటిలోటు లేకుండ తీరింది. మనకు భగవంతుడేమి తక్కువ పరచాడని నేను మళ్లీ చదవాలి? ఎంతచదివిన నౌకరీకేగా? అది నా యిష్టం కాదు. చదివించావు. నీ కిష్టమైనంత కాలం ఉద్యోగంచెయ్యి, నేను ఇంటి వ్యావహారాలు, బయటి వ్యవహారాలు చూచుకొంటా."

"తమ్ముడూ! నేను చేసేదికూడ ఒక ఉద్యోగమే నంటావా? చదివింది స్కూల్ ఫైనల్, చేసేది గుమాస్తాపని, తెచ్చేది వందరూపాయలు.

ఇది నిజంగా మనకవసరమంటావా? బి. యస్. సి., ఫస్ట్‌క్లాస్‌లో ప్యాసైన నీకే, చదువువిషయములో, ఉద్యోగవిషయములో అంత నిస్పృహ ఉంటే, నాకా ఉత్సాహముండేది? ఇన్నాళ్ళు యింటివద్ద ఒంటరిజీవితం గడపలేక, ఏదోపని కల్పించుకొందామని యీ వెధవచాకిరీ చేస్తున్నానంతే కాని, యిందులో పుణ్యమా? పురుషార్థమా?"

దివాకరరావు మాటలకు మోహనుడెంతో సంతోషించాడు. "అన్నా! నీ మాటలవల్ల నా కెంతో ఆనందంగా ఉంది. మీరు వెంటనే యీ సేవకా వృత్తి వదలుకొని, యింటిపట్టున ఉండి, మనపనులు చూచు కొంటే చాలు. మనయిద్దరి ఐకమత్యముతో ఆస్తిని ఎంతైనా వృద్ధి చేయగలము."

ముందునెలలో తన ఉద్యోగానికి రాజీనామా నిచ్చేట్టు దివాకరరావు నిశ్చయించుకొన్నాడు. తమ్ముడు, భార్య 'సరే' అన్నారు. ఆ రోజుకు సరిగ మామూలుపద్ధతి మేరకు రాత్రి భోజనాలయ్యాక [illegible] వచ్చిన శంకరభట్టుకు కూడ దివాకరరావు తన నిశ్చయాన్ని తెలిపి "[illegible] ముందు నెలనుండి నేనన్నివిధాల స్వతంత్రుణ్ణి" అని చెప్పితే భట్టు [illegible] హర్షించాడు.

ఇక మిగిలింది రామమోహనుని భవిష్యత్తును గురించిన సంగతి దివాకరరావు భట్టుతోను, భార్యతోను తమ్ముడు ఎదుటలేని సమయములో ఆ విషయాన్నిగురించి తీవ్రంగా ఆలోచింపసాగాడు.

చదువుకంటె ముందు మోహనునికి పెండ్లి చేయడం అవసరమని భట్టు, యశోద ఏకాభిప్రాయంగా తెలిపారు దివాకరరావుకు. పెండ్లి జరిగితే మఱది పిచ్చికుదురుతుందని యశోద అభిప్రాయం.

కాని, రామమోహనుడు తనకిప్పుడు పెండ్లి అవసరం లేదని అన్నతో ఖచ్చితంగా చెప్పివేశాడు. ఒక సంవత్సరంపాటు తన్నాలాంటి

విషయాలతో బాధపెట్టవద్దని, ఒకవేళ అట్లు చేసినట్టయితే వెంటనే ఎవరికి చెప్పకుండ ఎక్కడికో వెళ్ళిపోతానని చెప్పాడతడు.

అప్పుడింకేమి మాట్లాడగలరు? అన్న, వదినలనోళ్ళు మూతపడిపోయినాయి. తమ్ముని మనసెందుకలా చెడిపొయ్యిందా అని దివాకరరావు ఎంతో ఆలోచించాడు కాని, సమాధానం తెలిసింది కాదు. కారణాన్ని ఎవరు చెప్పగలరు? నిజమైన కారణం తెలిసిందా — ఇంక ఆ సంసారానికి విచ్ఛిత్తితప్ప గత్యంతరంలేదు. అదిగ్రహించి యశోద చాల జాగ్రత్తగ మసలుకొంటూ ఉంది.

అనుకొన్నట్టు దివాకరరావు తన ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి వేశాడు. పొలంపనులు, లావాదేవీలు, ఇంటిపనులు, చూచుకొనే విషయములో అన్నదమ్ములిద్దఱు సహకరించి పనిచేయసాగారు.

"మోహన్! నీకు పొలముపనులంటే తెలీదు. దానికికావలసిన అనుభవం, ఓపిక నీకు మొదటినుండి పట్టుపడలేదు. అదంతా నేచూచుకొంటా. మనకు ఏబది ఎకరాల మాగాణి ఉంది. సుమారు మూడువందల ఎకరాల మెరక ఉంది. అదంతా ఒకచోటలేదు. మూడునాల్గు స్థలాల్లో ఉంది. ఎప్పుడే పంటపెట్టించాలి, ఏలాంటిఎరువులు వేయించాలి, రైతులతో ఎట్లు యేగవలసింది నీకేమీతెలీదు. నేనాపనులు చూచుకొంటా. నీవు యితర పనులు, ఇంటిపనులు చూచుకో" అని దివాకరరావు కార్యవిభజనచేశాడు. మోహనుడు అన్న మాట కొప్పుకొన్నాడు.

సింహాద్రిపురానికి ఉత్తరదిశలో ఒక ఫర్లాంగుదూరములో చిత్రావతీ నది ప్రవహిస్తూ ఉంటుంది. వర్షాకాలములో గొప్పగా వరదలువచ్చినా, యితర కాలాల్లో పిల్లకాల్వవలె ఉంటుంది ఆనది. దాని గట్టున్నే దివాకర రావు క్రొత్తగా పెట్టించిన ఫలవృక్షాల తోటఉంది. తాను ఉద్యోగంచేస్తూ ఉన్నా, చెట్లను పెంచాలనే కుతూహలంగల దివాకరరావు, సుమారు మూడె

కరాల నేలలో నారింజ, నిమ్మ, మామిడి, సపోటా మొదలైనవి నాటించి, వానిపోషణ కొఱకు ఇద్దఱు నౌకర్లను నియమించాడు. పె విశ్వాసపరులైన కూలివారేకదా? యజమానికున్నంత శ్రద్ధ, ఆసక్తి వారి కేలాగుంటుంది? అందువల్ల దివాకరరావు ప్రతిదినము ఉదయమూ సాయం కాలము తోటకువెళ్ళి రెండు మూడు గంటలకాలం అక్కడగడిపి యింటికి వచ్చేవాడు. ఇంకా ఎక్కువకాలం అక్కడ గడపాలనే అతని కుతూహలం, కాని, చేసే ఉద్యోగం ప్రతిబంధకంగా ఉండేది. పైగా, మాణిక్యాంబ పోయాక కలిగిన నైరాశ్యత కొంత అడ్డుపడుతూ వచ్చింది.

ఇప్పుడతడు మరల సంసారి అయ్యాడు. తమ్ముడిల్లుచేరాడు. యశోద తగిన యిల్లాలనిపించుకొంది. అడ్డుగాఉన్న ఉద్యోగాన్ని బుద్ధిపూర్వకంగా వదిలేసుకొన్నాడు. అంతటితో దివాకరానికేదో ఆనందమయమైన స్వేచ్ఛ లభించినట్టయ్యింది. ఆ తోటనింక 2-3 సంవత్సరాలు పోషించినట్టయితే సాలుకు పదివేలు ఆదాయం తేగలదని అతని అంచనా. అందులో అపోహ యేమీలేదు. దానిముందు పోల్చిచూస్తే తన గుమాస్తాగిరి ఎంత? అందు చేతనే నౌకరీని నిర్విచారంగా వదలుకొన్నాడు.

దివాకరం తన శ్రద్ధనంతా యిప్పుడు పండ్లతోటమీద, మాగాణీ భూములమీద కేంద్రీకరింప నిశ్చయించుకొన్నాడు. ఉదయమే అన్నదమ్ము లిద్దఱు స్నానాలుచేసి, కాఫీ పుచ్చుకొని తోటభూములను చూచివచ్చేం దుకువెళ్ళి పదకొండింటికివచ్చి, భోజనం చేస్తారు. మధ్యాహ్నం ఒక గంట లేక రెండుగంటలు విశ్రాంతి తీసికొని దివాకరమొక్కడే పొలాలకు, తోటకు వెడతాడు. తానింట్లోలేని కాలములో యింటిపనులు చూసుకోవ డము, వచ్చిపొయ్యేవారిని విచారించుకోవడం, తన చదువును చూచు కోవడం రామమోహనుని పనిగా నిర్ణయింపబడింది. మూడు నాలు గంట లకు మోహన్ స్వయంగా అన్నకు టిఫిన్, కాఫీ తీసికొని తోటకు వెళ్ళ

...లు చీకటిపడేవేళకింటికి వస్తారు. వారి దినచర్య యీరీతిగా సాగి ...ంది.

# 10

పిచ్చికుదిరితే పెండ్లవుతుంది, పెండ్లయితే పిచ్చికుదురుతుంది అన్నట్టుంది రామమోహన్ పరిస్థితి.

చదువు నిమిత్తం స్థలాంతరానికి వెళ్ళి ఆపనిలో మగ్నుడైనా, లేక యింటనేఉండి వివాహంచేసికొన్నా ఆతని మనోవిచారము క్రమంగా తీరిపో గలదు, కాని, చదువుమీదకాని, పెండ్లిమీదకాని అతనికున్న మోజంతా పోయింది. అదంతా అభారవైరాగ్యము కాబట్టే, మనశ్శాంతి లేదు.

ఒకనాటి సాయంకాలము దివాకరరావు తమ్మునితో యింటికివచ్చిన పిదప, "యశోదా!" అని భార్యనుపిలిచాడు. యశోద చిరచిరవచ్చింది మగనిదగ్గరకు.

"యశోదా! ఈవేళ సినిమాకు వెళ్ళివత్తామా?"

"మీ తమ్ముడుకూడ వస్తాడా?"

"వాడు రాడంట. తోటవద్దనుండి చెప్పుతూనే వచ్చాను. వాని మూర్ఖం వానిది. నన్నేమి చేయమంటావు?"

"ఇంటిలో ఒక్కడే ఉంటాడా?"

"ఉండక యేమి పసిబిడ్డడనుకొన్నావా? కావలసివుంటె నీవుకూడ పిలిచిచూడు."

యశోద "సరే" యని రామమోహన్ గదిలోకివెళ్ళి "మోహన్, మీ అన్నగారు నేను సినిమాకు వెళ్ళదలచినాము. నీవుకూడ రావాలి." అని పిలిచింది బతిమాలినట్టు.

నూతన దంపతుల ఉల్లాసజీవితములో, పాసకములో పుటకవలె, తానడ్డుపొయ్యేందు కిష్టములేక మోహనుడు తనకు వచ్చేందుకిష్టములేదని చెప్పాడు.

యశోదా దివాకరులిద్దరే సినిమాకు బయలుదేరిరి. శరీరమేమో భర్తప్రక్కన నడుస్తూవుంది కాని, యశోద మనసు యింట్లో రామమోహనునివద్దనేఉంది. మగనితో అర్ధమనస్కతతో మాట్లాడుతూ, మఱదిరాలేదనే విచారముతోనే ఉంది యశోద.

ఆవూరిలో ఉండేదది ఒక్కటే సినిమాహాలు. ఎవరో ఒకరిద్దరు భాగస్థులుచేరి బాగానేకట్టించారు. అప్పుడప్పుడు హైక్లాస్ పిక్చర్లే వస్తుంటాయి. ఆవరణములో ఒక అయ్యర్ హోటలు, షోడా, బీడీ దుకాణం ఉన్నాయి. ఎటుచూచిన దీపావళిపండుగల్లో టపాకాయలవలె సోడాబుడ్ల "టప్‌టప్" ధ్వనులే.

అలుమగలిద్దరు రిజర్వుడు టిక్కెట్లుతీసికొని బాల్కనీలో ప్రక్క ప్రక్కగా సోఫాలోకూర్చున్నారు. తాను కాపురానికివచ్చాక, మగనితో యీరీతిగారావడం యశోదకిదే మొదటిసారి.

యశోద మనసులో ఒకమూల భయముకూడఉంది. ఒకవేళ తనకు, రామమోహనునికి పెండ్లికి ముందుజరిగిన తతంగమంతా మగనికి తెలిసిపోతే....

ఆతలంపు మనసులో మెదలినప్పుడంతా గుండె చలించిపోతూ వుందామెకు. ఆసంగతి తెలియదుకాబట్టే మగడు తన్నింతగా ప్రేమిస్తున్నాడు. ఒకవేళ తెలిసిపోతే అప్పుడుకూడ యీలాగే ప్రేమించగలడా? అంతలోనే "అతనికెట్లు తెలుస్తుంది" లెమ్మనే నిబ్బరంతో తెరమీది సంగీతంవింటూవుంటె ఆమె కుడికన్నెందుకో అదిరింది దాంతోపాటు యశోద గుండెకూడ అదిరింది....

ఆనాటి సినిమా "లవకుశ" అన్నివిదాలా బాగుందాపిక్చరు. ప్రతి ఘట్టము సహజంగాను, మిక్కిలి ఆకర్షణీయంగాను ఉంది.

తనకు మున్యాశ్రమాలకేగి, మునిపత్నులను సేవించిరావలెనని ఎందుకు కోరికకలిగిందో సీత సరియైనకారణం చెప్పలేదు. అవతారపురుషుడైన శ్రీరాముడు గ్రహించాడుకాబోలు నామెకోరిక భవితవ్యానికి మూలకారణమని. అందుకే ఆమెను మరల తనప్రశ్నలతో వేధించకుండ "సీతా! నీముచ్చట తీర్చేందుకంటె నాకు ఆనందముందా? అవశ్యం ఎల్లుండి వెళ్ళుదువుగాక" అన్నాడు.

ఆమాటకు జానకి పరమానందమగ్నురాలయ్యింది. తనవెంట భర్తను కూడ రమ్మని బతిమాలింది. "నీప్రక్కవదలి ఒక్కక్షణమైనా ఉండగలనా మైథిలీ?" అంటాడు రాఘవుడు....

ఆవెంటనే భద్రుడనే గూఢచారిరాక.... మధురామృతఘటములో విషబిందువుపడింది.... కథవిషాదాంతం కాజొచ్చింది.

వదినెను అడవిలో విడిచిరావలసినదుర్దశ పాపం సుమిత్రానందనుని మీదపడింది. పరమసాధ్వియైన సీతాదేవికి నీలాపనింద అంటగట్టబడింది. అన్న ఆజ్ఞమీరలేక, చూలాలైన వదినెను అడవిపాల్జేయలేక రామానుజుడు పడిన మనోవేదన ప్రేక్షకుల హృదయాలను కదిలించివేసింది....

మసక మసక వెలుతురులో దివాకరరావు భార్యవైపు తిరిగిచూచాడు. యశోద అప్పుడే కన్నులు తుడుచుకొంటూ ఉంది. లక్ష్మణుని దుఃఖమును చూడలేక కన్నీరు కారుస్తూ వుందనుకొన్నాడు దివాకరం. నిజమే, ఆడువారి మనసు చాలా మృదువైనది కదా!

రథారూఢయైన వదినెను మ్లానవదనముతో లక్ష్మణుడు భాగీరథీ తీరం వరకు తెచ్చాడు. పతియాజ్ఞను సతికి తెలిపే సాహసం లేక మనోవేదనతో పరితపించే మఱిది వాలకం సీత కెందుకో అనుమానం కలిగించింది....

ఇరువురు గంగా స్రవంతిని చేరి అవ్వలిగట్టు చేరారు. అంతా గొండారణ్యము. వనమృగ ధ్వనులతో భయంకరంగా ఉంది. తుదకు సౌమిత్రి తన కఠిన సందేశాన్ని వదినెకు తెలుపక తప్పలేదు....

ఆ దుర్వార్త నాలకించి మొదలు నరికిన కదళీతరువు వలె సీత "హా" యని క్రిందపడి మూర్ఛిల్లిపోయినది.

ఆ దృశ్య ఘోరాన్ని మృదు చిత్తమైన యశోద భరించలేక కాబోలు కన్నులొత్తుకొంటూ, మెల్లిగ భర్తతో ఇంక యింటికి వెళదామండి" అనింది.

దివాకరరావు లేవలేదు. సినిమా ముగిసేంతవరకు అతడు లేచేట్టు కనబడలేదు.

అంతలో విశ్రాంతి బెల్లు మ్రోగింది. హాలంతా దీపాలు వెలిగాయి. పటకుడ్యము మీది బొమ్మలన్నీ మాయమయ్యాయి.

"ఏమండీ నమస్కారం కులాసాగా ఉన్నారా?" అనే ప్రశ్న వినబడింది ప్రక్కన - దివాకరరావు తిరిగి చూచాడు. ప్రక్కన కుర్చీలో నాగభూషణం కూర్చున్నాడు. దివాకరం ప్రతి నమస్కారం చేసి "ఒహో, నాగభూషణం! ఎప్పుడొచ్చావయ్యా?" అని చనువుతో ప్రశ్నించాడు.

"నేను కొంత లేటుగా వచ్చాను. అప్పుడే షో ప్రారంభమై ఉణ్ణింది. అమ్మాయిగారు...." అని నసిగాడు నాగభూషణం.

"అయితే, నీకింకా తెలీదన్న మాట?"

"ఎక్కడిదీ? మూన్నెల్లుగా ఊళ్ళోనే లేను. ఏదో వ్యాపారం మీద. పల్లెలన్నీ తిరుగాడవలసి వచ్చింది. ప్రత్తి, చేరుసెనగ మంచి గిరాకీలో ఉంటిలెండి."

"కాదామరి. ఇది సీజన్. ధాన్యం సేకరించుకొంటే ధనం సేకరించుకొన్నట్టే కదా."

"అంతేమరి. ఈ మధ్య కలువలపల్లిలో తెలిసింది మీకావూరు వేంకట్రామయ్యగారి కూతురుతో వివాహమయిందని. చాల సంతోషం. భగవంతుని దయవల్ల వెతికిన సంస్కారం చక్కబడింది."

అని యేదో లోకాభిరామాయణంలోకి దిగేలోగా మళ్ళీ బెల్లు మ్రోగింది - లైట్లు మాయమయ్యాయి - అంతా మసక చీకటి - సినిమా మళ్ళీ ప్రారంభమైంది. వ్యక్తుల జీవిత కధాసారాన్నంతా బట్టీపట్టి షుమారు మూడు గంటల కాలములో చూపించగలిగిన సినిమాలో కూర్చున్న ప్రతి యొక్కరు "అబ్బా! అంతలోనే ముగిసిందే యీ ఆట!" అని పెదవి విరవ కుండా ఉండలేదు. అయినా, అది ఒక తప్పని సరియగు పరిణామ దశ జీవిత కధలంతా యింతే.

సినిమా ముగిసింది - ప్రేక్షకులంతా హడావుడిగా బయటికి వెళ్ళి పోసాగారు. "రావోయ్. నాగభూషణం." అని దివాకరరావు నాగ భూషణాన్ని కూడ తమ వెంట పిలుచుకొని, మేడ దిగి కాంపౌండులోకి వచ్చాడు.

యశోద కెప్పు డింటికి వెడదామా అని ఆతురంగా ఉంది. ఇంట్లో రామమోహనుడు ఒంటరిగా ఉన్నాడే. ఆతనికిట్టి సరదా జీవితాన్ని అనుభ వించే ప్రాప్తి లేకపోయిందే. ఒకవేళ అతడు తన్ను వివాహమాడివుంటే అప్పటి పరిస్థితి ఎట్లుండేది. ఇసే ఆలోచనలు ఆమె మస్తిష్కములో తెరలు తెరలుగా దాటిపోతున్నాయి.

దివాకరరావు జట్కా నొకదాన్ని యేర్పాటు చేసి యశోద నందులో ఎక్కుమన్నాడు. అతడుకూడా ఎక్కబోతూ ఉండగా నాగభూషణం "బాబూ, కొంచెం మీరిలారండి, మీతో మాట్లాడాలి." అని పిలిచే సరికి, జట్కావాలాను కొంత ఆగుమని నాగభూషణాన్ని సమీపించాడు

అతడు దివాకరాన్ని కొన్ని గజముల దూరం పిలుచుకొని పోయి మెల్లగ "మీ రన్నదమ్ములు వేరే అయ్యారా?" అని ప్రశ్నించేడు.

ఆ మాటకు దివాకరం చకితు డయ్యాడు

"ఎవరు చెప్పారు నీకీమాట నాగభూషణం?"

"ఎవరు చెప్పలేదు లెండి. నేనే ఊహించి అడిగాను."

"నీ వూహకు ఆధారం?"

"నాకు కలువలపల్లిలో ఏదో వార్త తెలిసి మిమ్మా మాట అడిగానంతే. క్షమించండి. ప్రొద్దుపోతుంది. ఇంటికి వెళ్ళండి, బాబు."

నాగభూషణం ఏదో చెప్పదలచి, దాస్తూ ఉన్నట్టు దివాకరరావు కర్థమైంది. అదేదో వినాలని కుతూహలం కూడా అధికమైంది. "ఏమి ప్రొద్దు పోలేదులే, నాగభూషణం. ఉండు, ఇప్పుడే వస్తా" నని జట్కాను సమీపించి, "యశోదా! నీవు యీ జట్కాలో యింటికి వెళ్ళు, అతనితో కొంత మాట్లాడవలసి ఉంది. కొంత ఆలస్యంగా వస్తా. నీవు, మోహన్ భోజనాలు చేసి పడుకోండి" అని జట్కావానికి బండి కిరాయి ఇచ్చి ఆమెను తమ యింటివద్ద విడువుమన్నాడు.

"మీరు రాండి. నేను ఒంటరిగా పోలేను." అనింది యశోద.

"భయము లేదు. జట్కావాడు మనవాడేలే."

"ఫరవాలేదు రండమ్మా. సుఖంగా యిల్లు చేరుస్తా" నని బండి వాడు నొగలెక్కి హార్నొని గుర్రాన్ని చబుకుతో అదిలించాడు.

బండి వెళ్ళిపోయింది. దివాకరరావు మరల నాగభుషణాన్ని కలుసుకొన్నాడు.

"ఇప్పుడు చెప్పు నాగభూషణం, కలువలపల్లిలో నీవు విన్న సంగతేమిటి?"

"ఏమి లేదులెండి. మీ పెండ్లిని గురించే."

"అది కాదు ఏదో వార్త తెలిసిందన్నావే, అదేమిటి?"

"అబ్బో. ఏదో నోరుజారి అంటే అయ్యగారు నన్ను వదిలేట్టు లేదే."

"అందుకేగా నా భార్యను ఒంటరిగా యింటికి పంపించి నేను నిలిచింది. నేను యింకో జట్కాలో వెడతానులే."

"అయితే చెప్పమంటారా?"

"ఏమిటి, నాగభూషణం నీధోరణి? ఏదో చెప్పొచ్చావు. మళ్ళీ దాచ యత్నిస్తున్నావు. నేను వినదగిందయితే నీకెందుకు జంకు?"

"జంకేమిటి? సింహాద్రిపురంలో తెలీదుకాని, కలువలపల్లంతా వాగి పోయిన వార్తేగా?"

దాంతో దివాకరరావు కుతూహలం మరింత అధికం కావడమే కాకుండా, మనసులో ఒకరీతి భయం కూడా జనించింది.

ఉదయం కలుసుకొందాం లెండి. నాకూ ప్రొద్దుపోతోంది."

"పరవాలేదు నీ సంగతి నాకు బాగా తెలుసు. నీవు రాత్రంతా యింటికి పోకపోయినా నిన్ను దండించే వారు లేరులే."

"అయ్యో మంచి చిక్కులో పడేశారే నన్ను."

"ఏమిలేదు. నీవేగా మొదట నాలో కుతూహలాన్ని రేకెత్తించింది"

"సరే లెండి. ఏదో నోరు జారింది మాట. ముందుగా నాకొక్క వాగ్దానం చెయ్యాలి. అట్లయితే చెబుతా."

"ఏమని వాగ్దానం?"

"మీరన్నదమ్ములు కలహించకూడదని."

"దానికొరకు కింకొకరికి వాగ్దానం చేయాలా నాగభూషణం, తూర్పున పుట్టే సూర్యుడు పడమట పుట్టినా మా అన్నదమ్ములు వేరేకారని నమ్ము."

ఆమాటకు నాగభూషణం కొంత వికటాట్టహాసమే చేశాడు. అందులో నుండి ఎగజిమ్ముకొని వచ్చే విషవాయు ప్రభావము దివాకరాని కర్థము కాలేదు.

"అట్లయితే ఫరవాలేదు. మీ భార్య కంటే పెద్దవాడొక డుండాలి కదూ?"

"అవును. ఉన్నాడు, అయితే అతడు పెండ్లికి రాలేదు గాబట్టి నేను చూడలేదు. మా రామమోహనుడు, అతడు క్లాస్‌మేట్సట."

"అతని పేరు కృష్ణమూర్తి"

"అవును."

"అతడెందుకు పెండ్లికి రాలేదో అడిగారా?"

"అడిగాను వాళ్ళ అమ్మ నాన్నను. ఏదో అర్జంటు పనిమీద గుంటూరుకు వెళ్ళాడని, పెండ్లినాటికి సరిగ యిక్కడికి వస్తాడని చెప్పారు."

"ఒక్కగానొక్క చెల్లెలి వివాహం జరుగుతూ వుంటే అతని కంతకంటే అర్జంటు పనేముంటుంది చెప్పండి."

"అదేదో నాకు తెలీదు."

"అదంతా పెండ్లికి రాకూడదనే నెపము లెండి."

"అదెందుకు? వారిలో వారు కలహించుకొన్నారా?"

"అలాంటి దేమి లేదు. కాని...."

"కాని యేమిటి, అర్థణా? త్వరగా చెప్పవయ్యా నీళ్ళు నమలకుండా?"

"చెప్పనా?"

"చెప్పు."

"తరువాత నన్ను నిందించరు కదా?"

"చెప్పవయ్యా నన్ను చంపక. చెప్పకపోతివా ఒట్టు."

"అంత మాటెందుకులే, బాబూ? ఈ అమ్మాయి మొదట మీ తమ్ముణ్ని ప్రేమించిందట."

ఆ మాట వింటూనే దివాకరానికి కొరడా దెబ్బ తిన్నట్టయింది.

"ఎవరు చెప్పారు నీకీసంగతి?"

కలువలపల్లిలో ఆబాలవృద్ధులకు తెలుసు. అక్కడికి వెళ్ళితే ఎవరయినా చెబుతారు."

"నాగభూషణం, నీవక్కడ విన్న సంగతులేవో దయచేసి విశదంగా చెప్పు."

కృష్ణమూర్తి రామమోహనుని సెలవుల్లో తమ గ్రామానికి పిలుచుకొని పోయింది మొదలు, మోహనుడొక వారం రోజులక్కడుండి మరల గుంటూరికి వెళ్ళి పోయినదీ, ఆలోగా వేంకట్రామయ్య యింట్లో జరిగిన సంగతులు, తరువాత వేంకట్రామయ్య యీ సంగతులేవీ తెలీకుండ దివాకరరావుకు బిడ్డ నిస్తానని లగ్నపత్రిక వ్రాయించుకొని పోయినదీ, తరువాత యింట్లో వారంతా జరిగిన పొరబాటుకై విచారించడం, తుదకు తలిదండ్రుల బలవంతంమీద యశోద దివాకరరావును పెండ్లిచేసుకోవడం మొదలైన వివరాల నన్నిటినీ దివాకరానికి వినిపించాడు.

ఈ సంగతులన్నీ వింటూ ఉంటే దివాకరరావుకు తన కాళ్ళ క్రింద భూమి 'ఫటేలు'న పగిలి తా నందులో కూరుకొని పోతున్నానా అనిపించింది.

# 11

"తన చెల్లెలిని ఏలాగైన మిత్రుడైన రామమోహనుని కిచ్చి పెండ్లి చేయాలనే ఆశతో కృష్ణమూర్తి మీ తమ్ముణ్ణి తమయింటికి పిలుచుకొని వెళ్ళాడు.

"ఏదో విహారయాత్రకు స్నేహితులతో ఎక్కడికో వెళ్ళుతున్నానని నాకు వ్రాశాడే మోహన్?"

"అదంతా అబద్ధములెండి. అతడు కలువలపల్లికి పొయ్యిందీ, ఒక వారంరోజులు వేంకట్రామయ్య యింటవున్నదీ, మీ భార్య అతడు పరస్పరం ప్రేమించుకొని ఒకరినొకరు పెండ్లి చేసుకొంటామని, కృష్ణ మూర్తి, వాళ్ళతల్లి ఎదుట ప్రమాణాలు చేసిందీ, నిజము."

"ఒకవేళ తాను రామమోహనుని వివాహమాడ నిశ్చయించుకొని ఉంటే, తండ్రితో ఆ మాట చెప్పి నాతో వ్రాయించుకొని వెళ్ళిన లగ్న పత్రికను రద్దుచేయవచ్చునై ఉండెనుకదా? ఈ వల్లని కాపురాన్ని ఎందుకు స్వీకరించింది?"

"చాలా అమాయకంగా అడుగుతారే? మీతో తనపెండ్లి జరిగేట్లు తండ్రి నిశ్చయం చేసుకొని వెళ్ళాడు, అది కాదని తాను మీ తమ్మునితప్ప అన్యులను చేసుకోనని అమ్మాయి పట్టుపట్టితే మాత్రం ప్రయోజన మేమి?"

"నేను తప్పకుండ యశోదను రామమోహనునికే యిచ్చి పెండ్లిచేసి ఉందును."

"అయితే మీ తమ్ముడేనా మీ కంటె తక్కువ తిన్నవాడు? -మీ

కొరకు తండ్రిచేత నిశ్చయింపబడిన కన్యను, లగ్నపత్రిక కూడ వ్రాయబడిన తరువాత, మీరు వద్దంటేమాత్రం మీ తమ్ముడు చేసుకొంటాడా?"

"అవును అదీ నిజమే."

"అప్పటి కమ్మాయిగతి త్రిశంకు స్వర్గమే కదా?"

"అవును."

"అందుకే యిదంతా విధి విలాసమని తండ్రి నిర్ణయానికి తల ఒగ్గింది, అయినా, యీ విషయములో మీ భార్య త్యాగాన్ని, మీ తమ్ముని త్యాగాన్ని తప్పకుండ పొగడాల్సిందే, బాబూ!"

దివాకరరావు మాట్లాడలేదు. మనసులో చొరరాని అనుమానం ప్రవేశించిది. అతని మనసులో పరిపరివిధముల ఆలోచనా వాయుపులు వీచ సాగాయి.

నాగభూషణం ఒకమారు బేరగాడు. అగ్గువగా పల్లెల్లో ధాన్యం, సరకులు కొని ఆయాకాలములో మంచి లాభాలకమ్మి, యిప్పటికి పదేండ్లుగా పది పదిహేనువేలు కూడ బెట్టుకోగలిగాడు. అప్పుడప్పుడు తన వ్యాపారానికి కావలసిన పెట్టుబడి దివాకరరావువద్ద అప్పుక్రింద తీసికొని పోయేవాడు.

పానకంలో పుడకవలె పాపమా నూతనదంపతులేదో సరదాకొరకు సినమాకు వచ్చి ఆనందపడుతూవుంటే యీ నాగభూషణ మీ రీతిగా తటస్థపడడమేమిటి – నోటిలో మాట నిలువలేని ఆ పీడమనిషి యిప్పట్లో కలువలపల్లిలో తాను విన్నదంతా చెప్పడమేమిటి ఇదంతా విధివిలాసం కాకపోతే,

దివాకరరావు వైఖరినిచూచి నాగభూషణం మనసులో "అరెరె, నే నెందుకీ సంగతి సీతనితో చెప్పాను? అయ్యగారి వాలకం చూస్తే

యింట్లో యేదో రభస లేవదీసే రకంగానే ఉందికదా!" అని కొంత బాధ పడ్డాడు.

"అయినా దానితో యిప్పుడేమిపని? అమ్మాయి,తమ్ముడు మీకు అనుకూలంగానే ఉన్నారుకదా?"

"సరే, నాగభూషణం వెళ్లొస్తా" నంటూ మరేమిచెప్పకుండ యింటివైపు నడవసాగాడు దివాకరరావు.

"బాబూ, నడచివెడుతున్నారే? ఒక జట్కానో, రిక్షానో తీసికెళ్ళండి."

"అవసరంలేదు. తిన్నగ నడిచి వెడతా!"

"నన్ను రమ్మంటారా యింటిదాక?"

"అక్కర్లేదు. నీవు వెళ్ళు, నాగభూషణం." అని దివాకరరావు ఒకమలుపు తిరిగాడు.

నాగభూషణం కొంత పశ్చాత్తాపపడుతూ, భారంగా అడుగులువేసి కొంటూ వెళ్ళిపోయాడు.

దివాకరరావు కాళ్లేమో అలవాటుకొలది ముందుకు సాగిపోతున్నాయి కాని, మనసు మాత్ర మధీనములో లేదు. ఒకమారు చేతి గడియారం చూచుకొన్నాడు — అప్పుడే పంద్రెండు కా వచ్చింది,

రామమోహనుడు గుంటూరునుండి వచ్చిననాడే ఎంతో విచారంగా ఉండినాడు. అంతకుముందతడు తన పెండ్లిగురించి వ్రాస్తూ వచ్చిన ఉత్సాహవాక్యాలకు, నాటిచర్యకు చాలాతేడా కాన్పించింది. అందుకు కారణం తాను పెండ్లాడ నిశ్చయించుకొన్న యశోద తనకు దక్కలేదు కదా అనే దుఃఖము కాక మరేమౌతుంది?

పెండ్లి కార్యాలనన్నిటిని మోహన్ యాంత్రికంగా జరిపినాడే కాని

అందులో నిజమగు ఉత్సాహము, ఆనందము కాన్పించలేదనే సత్యం ఇప్పుడు దివాకరానికి ద్యోతక మౌతుంది.

ముందు చదువక్కర్లేదంటాడు. వివాహము చేసికోమంటే వద్దంటాడు. అవును, తన ప్రేమ భగ్నమైంది. తాను కోరిన లతాంగి పరుల పాలైంది. ఇంక ఉత్సాహమెక్కడినుంచి వస్తుంది? మోహనుడు భగ్న హృదయుడగుటచేతనే అంత నిస్పృహ జనించింది. కారణం స్పష్ట మౌతూంది.

యశోదను 'వదినా' అంటున్నాడు — ఆమెతో అప్పుడప్పుడు మాట్లాడుతున్నాడు - కాని, అందులో యిమిడిఉండే బాధ, సంకోచము యిప్పుడర్థమౌతూ ఉన్నాయి.

ఇక యశోద సంగతికూడ అంతే. తాను మనసార వలచి, పెండ్లాడవలచిన యువకునితో తనకు పొత్తు తప్పిపొయ్యింది. ఆమెకూడ భగ్నహృదయ. ప్రేమను మోహనునిమీద ఉంచి — శరీరాన్ని తన కప్పగించింది.

మొదటి నుండి ఆమె మోహనుని పక్షమే వహించి మాట్లాడుతూ ఉంది. అతడంటే బహిర్గతము కాని యేదో ప్రేమాభిమానం ఆమె హృదయములో స్థిరనివాస మేర్పఱచుకొని, లోలోన బాధిస్తూ ఉన్నట్టుంది.

తుద కాదినం సాయంకాలము "సినిమాకు రావా, యశోదా?" అని అడిగితే "మీ తమ్ముడుకూడా వస్తాడా?" అని అడిగింది. తమ్ముడు రాక పోతే తనకీ సరదాతో పనిలేదనా అందలి భావం? "ఇంటిలో ఒకడే ఉంటాడా?" అని అంటుంది. దీని కర్థమేమి? అతన్ని ఒంటరిగా ఉంచేది ఆమె కిష్టము లేనట్టేగా?

ఒక్కొక్క చిన్న, పెద్ద విషయాన్ని జ్ఞప్తికి తెచ్చుకొని సమన్వయ పరచే కొలది, దివాకరరావు అనుమానం దృఢపడి, మనసు అవశమవుతూ వచ్చింది.

## కన్నీటి కాపురి

అయినా, దివాకరరావు మనసును అధీన
మానాన్ని వెంటనే బయట పెట్టకుండ, ఇంకా కొన్
ఎట్లు వర్తిస్తారో గమనించాలని స్థిరపరచు కొన్నాడు.

అనుమానం ప్రాణ సంకటం. దివాకరరావు వెం
వానివలె లోలోన బాధపడుతూ, కర్తవ్యాన్ని గురించి ఆలోచ
సమీపించాడు.

ఇంట్లో లైట్లు యింకా వెలుగుతూనే ఉన్నాయి సి
గేటును తెరచి వరాండాలోకి వచ్చి, కిటికీగుండా తొంగి చూచాడతడు

నడిమి హాలులో బార్‌లైటు క్రింద ఒక చిన్న రౌండ్ టే
ఉంచుకొని, దానిమీద చదరంగపు ఆటవస్తువులుంచి, ఇరుప్రక్కల రెండు
కుర్చీలలో కూర్చొని, నవ్వుతూ, చదరంగమాడే తమ్ముడు, భార్య, దివాకర
రావు కంటబడినారు!

అతని కాక్షణమే లోపలికురికి ఆ యిరువురిని హత్య చేతామా
అనేంత కోప ముదయించింది కాని, దివాకరరావు కొంత తమాయించుకొని
మూసిన తలుపుమీద దబదబ కొట్టి "యశోదా" అని పిలిచాడు.

మోహనుడు, యశోద అదరిపడి లేచారు. ఎందుకో యిరువురి
మొగాలు వెలవెల పోయాయి. బయటినుండియే దివాకరరావు వారి చర్య
లను గమనిస్తూనే ఉన్నాడు.

అయినా, వారి చర్యలలో అసహజమేమి లేదు. యశోద బిరబిర
వెళ్ళి తలుపు తీసి "ఎంత ఆలస్యం చేశారండీ?" అని ఒయ్యారంగా
అడిగింది భర్తను.

"ఎందుకన్నయ్యా యింత ఆలస్యం చేశావు?" అని రామమోహన్
కూడ ప్రశ్నించాడు.

దివాకరరావు ముభావంగా "వేరే పని ఉణ్ణింది" అని చెప్పి తన

మాస్చుకోసాగాడు. అతని వైఖరిని చూచిన
ము కలిగింది. 'అన్న ఎందుకీలాగున్నాడా!' అని
ంత ఆశ్చర్యపోయాడు.
పొద్దుపోయింది. భోజనానికి లెండి."
కక్కర్లేదు."
ందుకు?"
"ఎందుకేమిటి? నీ మొహం. ఆకలిలేదు."

ఆ చీదరింపుతో యశోద గుండె గుభిల్లుమనింది.

"నేను, వదినా యింకా భోజనం చేయలేదన్నా. నీకొరకే కాచుకొని ఉన్నాము."

"మిమ్మల్ని ఎవరు భోంచేయొద్దన్నారు? నాకక్కరలేదు. మీరు భోజనం చెయ్యండి." అని దివాకరరావు దబాలున గది తలుపులు మూసుకొని, లోపల గొళ్ళెం పెట్టుకొన్నాడు.

అతడా రాత్రి యింక అక్కడే ఒంటరిగా పడుకొంటాడని అర్థమైంది యశోదా మోహన్‌లకు.

ఇద్దరి మనసులు కల్లోలితమై పోయాయి. భర్త భోజనం చేయనిది భార్య భోజనం చేస్తుందా? అందులో అతడిప్పుడెందుకో కోపముతో ఉన్నాడు. కేవలం ఆకలిలేని మామూలు పరిస్థితి అయిఉంటే అది వేరు మాట. యశోదకు కూడ భోజనం చేయ బుద్ధిపుట్టలేదు. మఱదిని చూచి "మోహన్! నీవైనా భోజనానికి లేవయ్యా" అనింది.

"నాకూ అక్కర్లేదు, వదినా, నీవు భోజనం చెయ్యి" అంటూ అతడు మేడమీదికి వెళ్ళిపోయాడు పడుకొనేందుకు.

సాయంకాలమే భర్త కిష్టమైన గుత్తివంకాయకూర, మజ్జిగ పులుసు చేసి పెట్టింది యశోద. తనకూ ఆకలిగానే ఉంది. కాని, భర్తను, మఱదిని

విడిచి తాను భుజించగలదా? "సరి, పోయిన జన్మలో నేమెవ్వరికి అన్నం పెట్టినట్టు లేదీపూట" అని అనుకొనింది పాపమా అమాయకురాలు.

భర్త తలుపు తీయలేదు. రెండు మూడు మార్లు తలుపు చిన్నగా తట్టి భోజనానికి రమ్మని బతిమాలింది. లోపలనుంచి దివాకరరావు "నాకు ఆకలిగా లేదంటే మాటిమాటికి పిలుస్తున్నావు. బుద్ధి లేదూ?" అని గదమాయించాడు.

"పాపం, మీ తమ్ముడు కూడ పస్తుపడుకొన్నాడండీ."

"పాపం! కలిపి నోట్లో పెట్టు, నే వద్దన్నానా?"

"ఏటి మాటలండి యివి? ఎందుకిలా అంటున్నారు? నేనేమి తప్పు చేశానని?"

"ఎవరు తప్పుచేయలేదు, తప్పంతా నాది. ఇంక నోరు మూసుకొని అవతలకు వెడతావా? లేదా? నాకు నిద్దరొస్తుంది."

"నా తప్పులేమైన ఉంటే క్షమించండి. మీ తమ్ముడు మేడమీదికి వెళ్ళాడు పడుకొనేందుకు. నే నొక్కతే యింత హాలులో పడుకో లేనండీ...."

అని యసోద అంటూ ఉండగానే "పడుకోలేవా? గాడిదా? పో, వాడిదగ్గరే పడుకో పో" అని తటాలున తలుపు తీసికొనివచ్చి, యసోద చెంపపై పెడేలున దెబ్బవేసి "ఛీ - పో మళ్ళీ లేపావా, చంపేస్తా" నంటూ మరల దబాలున తలుపు మూసుకొన్నాడు."

రామమోహన్ మేడమీదికి పూర్తిగా వెళ్ళకముందే ఇంట్లో వదినకు అన్నకు జరిగే సంభాషణ చెవిలోపడి, నిలిచిపోయాడు వింటూపోతూ. యసోద మాటలేమో స్పష్టంగా వినబడుతున్నాయి కాని, గదిలో నుండి దివాకరరావు మాట్లాడే మాటలు స్పష్టంగా వినబడలేదతనికి. అంతలో అన్న తలుపు తీసి వదినను కొట్టడం, ఆమె "అమ్మా" అని బాధపడడం

అతడు గమనించాడు. ఇన్నాళ్ళుగా లేని యీ వైపరీత్యం మెందువల్ల కలిగిందా అని చాల తల్లడిల్లి పోయాడు మోహన్. అప్పుడే మళ్ళీ లోపలికి వెళ్ళి సంగతేమిటో కనుక్కొందామను కొన్నాడు. కాని, అందువల్ల ముందేమి ప్రమాద ముందునో యని నిలత్రొక్కుకున్నాడు.

భర్త యిచ్చిన చెంప పెట్టు బాధను శరీరం భరించలేక తహతహ లాడితే, యసోద మనసు ఆతని యందలి యీ ఆకస్మిక పరిణామానికి అగ్నిలోని మిడతవలె కుతకుతలాడిపోయింది.

"ఆతని మనసెందుకిలా మారిపోయిందా" అని ఆమె అపరిమిత మైన ఆవేదనకు లోనైంది. ఇంకేమి మాట్లాడేందుకు వీలులేదు. తన దుష్కర్మకు దుఃఖిస్తూ, కన్నీటితో పోరాడుతూ, అక్కడే హాలులో చతికిల పడిపోయింది యసోద.

తన యెదుట భూగహ్వరం పగిలి భయంకర వికటాట్టహాసము చేస్తూ అందుండి యేదో వికృతశక్తి తన్ను మ్రింగవచ్చినట్టు తలచి పాపమా ముగ్ధ తల్లడిల్లి పోయింది ఆ సమయాన.

# 12

మనుష్యుల కష్టసుఖాలతో సంబంధంలేకుండ కాలందాటిపోతూంది. దానిగమనాన్ని సూచిస్తూ గోడమీదగడియారం రెండుగంటలు కొట్టింది.

మేడమీద రామమోహన్, గదిలో దివాకరరావు, హాలులో యశోద ఎవరిచింతలోవారుపడి కొట్టుకొంటున్నారు.

"తనబిడ్డ రామమోహనుని వివాహమాడగోరినప్పుడు, ఆమెను వాసికెయిద్వకుండ యీకుటిలుడు వేంకట్రామయ్యా నడుమ నాకెందుకిచ్చి

పెండ్లిచేశాడు? అప్పుడే యశోద యీసంబంధము తనకిష్టమ్ము తలి దండ్రుల నెందుకు ఎదురించలేకపోయ్యింది! మోహనుడైనా ముందుగా నాకీసంగతిని వ్రాయకూడదా? మనసులో యశోదను తాను పెండ్లాడగోరి కదా వీరు ఒక వారంరోజులపాటు కలువలపల్లివెళ్ళి, నాకు యేదో విహార యాత్రకు వెడుతున్నామని అబద్ధాలు వ్రాశారు. యశోద నన్ను పెండ్లాడటం మోహనుని కెంతమాత్రం యిష్టములేనట్టే ఉంది. వివాహమునకు ముందు నుండి వీరుకనబరచే ప్రవర్తనవల్లనే ఆసంగతి విశదమౌతూవుంది. అసలు తాను పెండ్లికి వచ్చేవాడుకాదేమో. లోకులేమనుకొంటారో అని వచ్చినాడు కాబోలు. యశోదతత్వమే నాకర్థంకాకుండా ఉంది. ఒకవేళ తానువలచిన మోహనునితప్ప మరెవ్వరిని పెండ్లాడనని పట్టుపట్టిఉంటే ఆమెను కాదనే వారెవ్వరున్నారు. పెండ్లికిముందు యింతగా ప్రేమనుపెంచుకొన్న వీరిద్దరు నాయెదుట 'వదినా' అని ఒకరు, "రామమోహన్" అని మరిఒకరు పిలుచు కొంటేమాత్రం మనసులోని ప్రేమ అణగిపోతుందా. నాపరోక్షములో వీరు దానికేదైన కార్యరూపమివ్వకుండా ఉంటారా? అసంభవము. అసహ జము. లోగుట్టు పెరుమాళ్ళకెరుక. యశోదమనసు అన్యాయత్తమై ఉంద నుట నిజము మహావంచకురాలు. దేహం నాకు. మనసు మోహనునికి అప్పగించిందీఘాతకి. రాత్రి వీరిద్దరు నేను వచ్చేవేళకు ఎంత సరదాతో చదరంగమాడుతూ ఉండినారు. వివాహమై మూడునెలలైనా యశోద ఎన్నడైనా యింతసంతోషంగా నాతో సంచరించిందా? నిన్న సినిమాకు రావడంకూడ అర్ధమనస్కతతోనే. అయ్యో! వీపునబుట్టిన తమ్ముడే నన్నిం తగా మోసగించినాడు! మాణిక్యం గతించాక యీమూడెండ్లు బ్రహ్మచారినై ఉంటనికాదా. నాదుష్కర్మ కాకపోతే యీఘాతకినితో మళ్లీఎందుకు పెండ్లి కొప్పుకొంటినోకదా! ఇంక నాకీభార్యతో సుఖమేముంది? త్యజించితినా లోకోపవాదము. ఉంచుకొనేందుకా మనసొప్పుటలేదు. ఏమిచేయుట మిప్పుడు?



# కన్నీటి కాపురం

అని దివాకరరావు పరిపరివిధములైన ఆలోచనలలో, అసహ్యముతో తలనొప్పించుకొంటున్నాడు. నిద్ర ఎన్నడో దూరమైపోయ్యింది.

ఇక యశోద సంగతి....

"నేనే ద్రోహంచేశానని భర్త యీదినం నామీద యింతకోపము, అసహ్యము, దౌర్జన్యము కనబరచినట్టు! ఇతనిమనసులో ఏదో దురాలోచన ప్రవేశించిఉంటేతప్ప యిట్లుప్రవర్తించేవాడు కాదు.

ఇతరస్త్రీ నెవరినైన ప్రేమించిఉంటాడా? అదెట్లుసాధ్యము? సినిమా ముగిసేవరకు మేమిద్దరం ఒకరిప్రక్కన ఒకరు కూర్చొనేఉన్నాము. ఎంతో ప్రేమతో మాట్లాడిస్తూవచ్చాడు. నన్ను జట్కాలో ముందుగాపంపించి, ఆ నాగభూషణమనే అతనితో మాట్లాడడానికి నిలిచా డంతేకదా. ఈ ఒకటి, ఒకటిన్నర గంటల్లోనే యేఆడుదాని యింటికి వెళ్ళిఉంటాడు - ఎవతె ఈ కొద్దికాలములో ఇతనిమనసునింతగా మార్చివేయగలిగిఉంటుంది? అట్లేమి ఉండదు. బహుశ, ఆనాగభూషణమే ఇతనితో నేను, రామమోహన్ వివాహాత్పూర్వం ప్రేమించుకొన్నట్లు చెప్పిఉంటాడు. ఈమధ్య కలువపల్లికి తానువెళ్ళినట్టు, అక్కడ తనకు మావివాహంసంగతి తెలిసినట్టు నాయెదుటనే చెప్పాడుకదా నాగభూషణం. సినిమా ముగిశాక ఇతన్ని అంతదూరంగా పిలుచుకొనివెళ్లి మాట్లాడవలసిన రహస్యమేముంటుంది నాగభూషణానికి? కలువలపల్లిలో నన్ను మొదట రామమోహనునికిచ్చి పెండ్లిచేస్తారనేవార్త ప్రాకిఉంటుంది. అది మాఇంట్లో జరిగినవిషయమే అయిన లోకానికి మూకుడుంటుందా? ఆలోచించిచూస్తే నాభర్త ఈసంగతంతా ఈ నాగభూషణం ద్వారావిని ఈవిధంగా మనసుచెడుపుకొని ఉంటాడు. ఇప్పుడింకేదిగతి! ఒక వంక నేను, మరియొకవంక మోహనుడు ఎంత నిష్కల్మషంగావర్తించినా ఈతనిమనసులో ప్రవేశించిన అనుమానపిశాచ మీతనిని ఊరకఉండనివ్వదు. నాశీలాన్ని, తమ్ముని సత్ప్రవర్తనను ఇతడు శంకించినట్టుంది. అబ్బా! మగవారిదెంత ఆతురబుద్ధి! ఎంతమౌర్ఖ్యము! విషయమేమో తెలిసిఉండవచ్చు

అయినా, విమర్శనాజ్ఞానముండ బనిలేదా? ఇంతదౌర్జన్యమా? తాళిగట్టినఆడుది కదాఅని నన్నింత నీచంగాచూడడం భావ్యమా. కాకపోతే, యశోదా, నీవుచేయగలిగిందేది? నీవిప్పుదెవరిమీద ఎదురుతిరుగగలవు? సంఘములో స్త్రీయొక్క పరిస్థితి ఎంతనాజూకైన స్థితిలోవుందో అర్థమవుటలేదా? అరటి ఆకు తానైతాను ముండ్లమీద పడితేనేమి?- ముండ్లు దానిమీదపడితేనేమి- యెటుచూచినా నష్టము స్త్రీకేకదా. ఏమాత్రమపకీర్తి అంటగట్టబడినా, యుక్తాయుక్తములతో బనిలేక, న్యాయాన్యాయ విమర్శలేకుండ లోకులు కాకులై పొడుచుకుంటారు. హేభగవాన్! నాముందుగతేమి? నా నిర్దోషిత్వాన్ని ఇప్పుడేవిధంగా ఋజువుచేసికొని, భర్త ననునయింపగలను?".

అని పాపమామె నిద్దురలేక ఒకవంక ఆకలితో, మరియొకవంక మనోవిచారముతో అలమటించి పోతూఉంది. భర్త తన్ను చెంపపై కొట్టాడు. ఆ ప్రేటుయొక్క బాధ ఎంతసేపైన ఉండదు కాని, ఆదెబ్బను వేయవలసివచ్చిన మనస్తత్వ పరిణామము మాత్రము జన్మాంతముదాక బాధిస్తుంది. స్త్రీ అస్వతంత్రురాలని ఋజువు పరుస్తుంది. తనది తప్పుకాని, ఒప్పుకాని మగవాని దౌష్ట్యాన్ని సహించవలసిందే అని శాసిస్తుంది.

మేడమీద పరుపుమీద పడున్న రామమోహనుడు అగ్ని వేడిమికి పరితపించినట్టు చింతాగ్నికి చిక్కి నిద్రలేక జరిగిన దానికి అలమటించి పోతున్నాడు. అన్న విపరీత ప్రవర్తనకు కారణమేదో సరిగ గోచరించ లేదు. యశోద నాతడెందుకు కొట్టినట్టు? తన్నెందుకంత అసహ్యంగా చూచాడు? మోహన్‌కు యేది పాలుపోలేదు. జీవితములో తనకు జరిగిన తీరనిలోటును, తన దౌర్భాగ్యాన్ని, ఇకముందు కుటుంబములో కలుగనైయున్న పరిణామాన్ని గురించి ఆలోచించి ఆలోచించి అతని బుర్ర వేడెక్కిపొయ్యింది.

మూడుగంటలు సమీపించింది. దివాకరరావు మెల్లగ గదితలుపు [illegible]డు. ఆ చప్పుడు విని యశోద కన్నులొత్తుకుంటూ లేచింది.

"యశోదా, ఇటురా" దివాకరరావు ఆజ్ఞ. ఆమె తిన్నగ భయపడుతూ గదిలోకి వెళ్ళింది. తలుపు మరల మూయబడింది.

తప్త కాంచన శలాకవలె, మెఱుపుతీగవలె ఆవేళ భార్య తనూ విలాసమెంతో లావణ్యమయమై గోచరించింది దివాకరానికి. ముఖమండల మత్యంత సుందరమై కాన్పించింది. నల్లని మేఘము మాటులోని పూర్ణ చంద్ర బింబమువలె ఆ ముఖచంద్రుడు విరియబోసుకొన్న వినీలకుంతల ఘాటికతో యెంతో ఆకర్షణీయుడై ఉన్నాడు, స్త్రీని భీతహరిణీక్షణ అంటారు కవులు – ఇప్పుడు నిజముగ యశోద అట్టిస్థితిలో కాన్పించింది. కాతర ములై చంచత్తరళములైన ఆ విశాల దృగంచల సౌందర్యము పురుష హృదయానికెంతో హాయిని కలిగిస్తాయి. నున్నని, గుండ్రని బంగారు శలాకలలాంటి చేతులలో రవలగాజులు మిరమిర మెరసిపోతూ హృద యానికి చక్కిలిగింతగా ఉన్నాయి. నిట్టూర్పుతో చలించే ఆ సమున్నత వక్షోభాగము మదనసింహాసనము – ఆరక్షణములో యశోదయందు దివాకర రావు మున్నెన్నడు చూచి ఎఱుగని ముగ్ధమోహన సౌందర్యాన్ని చూడ గలిగాడు. మనసు విచలితమైంది. శిరీష కుసుమ కోమలమైన ఆ సుస్నిగ్ధ కపోలభాగాన్ని అంత కఠినంగా దండించినందుకు మనసులో నొచ్చుకొన్నాడు. తనభార్య యింత అపురూపసుందరి కదాయనే గర్వము తలఎత్తింది, కాని –,

కాని, ఆ మరుక్షణములోనే అతని కామె హృదయభాండము విష పూరితమైనట్టు కాన్పించింది. ఆమె ఆ పాదమస్తకము విషకన్యయై తోచింది. చెదరిన మనసును చిక్కబట్టుకున్నాడు. దివాకరరావు కేవలం కామాంధుడు కాలేదు. అందుకే "నాపై ఎందుకండీ యీ వేళయింతగా ఆగ్రహిస్తున్నారు?" అని తన బాహువల్లరులతో కౌగిలింపవచ్చిన యశోదను అవతలికి నూకి, గుడ్లురుముతు "దూరముండుము. నన్ను తాకవదు" అని శాసించగలిగాడు.

"నేనేమి తప్పుచేశానని నాకీదండన విధిస్తున్నారు." అని యశోద వెక్కివెక్కి ఏడుస్తూ మగని పాదాలమీద పడబోయింది. కాళ్ళు వెనుకకు లాక్కొన్నాడతడు.

"నీకు నాయందు నిశ్చయమైన ప్రేమ ఉందా, యశోదా?"

"ఇదేటి ప్రశ్న? ప్రేమలేనిదే మిమ్ము వివాహమాడినానా?"

"అది వేరుసంగతి, పరిస్థితుల ప్రాబల్యానికి లొంగి మెడలో తాళి కట్టించుకోవచ్చు. అంతమాత్రాన మగనికి మనసప్పగించి నట్లౌతుందా?"

"మీ మాటలెందుకో నాకు భయముకలిగిస్తున్నాయి. నేను చేసిన అపరాధమేదో చెప్పండి."

"సరే, చెప్తుతా నీవు నావద్ద అబద్ధమాడవుకదా?"

"నా ప్రాణముపోయినా సరే, అబద్ధమాడను."

"ఈ పెండ్లికి ముందు నీవు నా తమ్ముని ప్రేమించి ఉంటివా? లేదా? నిజముచెప్పు."

ఈ ఆకస్మిక ప్రశ్నతో ఆమె హృదయాన్ని శూలముతో గ్రుచ్చి నట్లయింది. తటాలున జవాబుచెప్పలేక తల్లడిల్లిపోయింది. మొగమెత్తి మగనివైపు చూచే సాహసం చాలక తలవాల్చి బొటనవ్రేలితో నేల రాస్తూ నిలబడింది.

"ఊ - పలుకవేమి?"

..............................

"సరే, నాకర్థమైంది. నా అనుమానం స్థిరపడింది."

తలమెత్తి బెదరుచూపులతో చూచింది మగనివైపు. "ఏమిటా అనుమానం?"

"ఏమిటా, మనసును మోహనుని కర్పించి, బలవంతానికి దేహాన్ని నా కర్పించావు, అంతేగా?"

"నన్నెవరు బలవంతపరచలేదు."

"పరిస్థితులు బలవంత పరచాయంట. "ఇష్టములేని యీ వివాహ మెందుకు చేసుకొన్నావు?"

దివాకరరావు ప్రశ్న ఒక్కొక్కటి వచ్చి వాడిములుకులవలె ఎదలో గ్రుచ్చుకొంటూ ఉంటే, బాధ నణచుకోలేక యశోద ఆ పాదమస్తకం కంపించి పోతూవుంది.

"నన్నెవరు బలవంతపరచలేదని చెప్పానుగా?"

"నా మొదటి ప్రస్నకు సూటిగా జవాబుచెప్పు. మొదట మా తమ్ముడు, నీవు కలువలపల్లిలో ఒకరి నొకరు ప్రేమించుకొన్నారు కదూ?"

తమ రహస్య మీ రీతిగా భర్తకు తెలిసిపోతుందని పాపము యశోద కలలోనైనాడ తలంచి ఎఱుగదు.

"ఊరకుంటివేమి, చెప్పు, నిజమేనా?"

"నా మాట నమ్ముతారా?"

"నమ్మడం నమ్మకపోవడం వేరుమాట. అసలు సంగతేమిటో తేలిపోవాలి."

"వివాహమైనది మొదలు మీరే నా పతి దేవులని మనస్ఫూర్తిగా తలిచి సేవిస్తున్నాను. ఇంతమాత్రము ఆత్మసాక్షిగా చెప్పుకొను చున్నాను."

"నీ జవాబు డొంకతిరుగుడుగా ఉంది. నోటినుండి నేనడిగినది 'ఔ' ననలేకున్నావు. ఈ కలికాలములో – నీ లాంటి ఆధునికి విద్యావతి – త్రేతాయుగమునాటి సీతాదేవి మాటలను వల్లెవేస్తే చాలునంటావా పతివ్రత

అనిపించుకొనేందుకు? సరి, నా కర్మమైంది. నీవు నా యెదుట ఒక్క ప్రమాణం చేయాలి. ఏమంటావు?"

"అలాగే, సెలవిండు."

"ఇప్పుడు నీకు, నాకు జరిగిన యీ సంభాషణలో ఒక్కమాటను కూడ రామమోహనునితో చెప్పకూడదు."

"ఆలాగే"

"మాట పైకి పొక్కిందా నిన్ను రెండుగా చీల్చివేస్తాను."

"మీ చిత్తము."

"పో – నా మనసు కుదుటుపడేవరకు, నీపై నాకు సద్భావం కలిగే వరకు నీ మీద నాకు ప్రేమ కలుగడానికి వీల్లేదు. నీ నిరపరాధిత్వాన్ని, నిష్కళంకత్వాన్ని ఋజువు చేసుకొనేభారం నీ మీద ఉంది. ఇది నీ కొక అగ్నిపరీక్ష."

"నేనొక సంగతిని అడుగవచ్చునా?"

"ఏమిటది?"

"మీ మనసులో యీలాటి అనుమానాన్ని ప్రవేశపెట్టిందెవరు?"

"అదంతా నీ కనవసరము. చెప్పానుగా, నీవు నిష్కళంకవని తేలే వరకు నీకు నాకు ఉండే ఆలుమగల సంబంధము కేవలము చూపులచే కాని నన్ను నీవు, నిన్ను నేను తాకడానికి వీల్లేదు. వెళ్ళు బయటికి."

యశోద దుఃఖ సాగరములో పడి కొట్టుకుంటూ ఉంది. "ఇది నా ఆజ్ఞ వెళ్ళు."

ఆమె ఇంక వెళ్ళిపోక తప్పలేదు. మరల కవాట బంధనం జరిగింది.

తెల్లవారక పోతుందా? తెల్లవారింది. ఆ ఒక్కరాత్రిలో యశోద కేవలం శోకమూర్తి అయిపొయ్యింది. ఎంతఘాతి గుండెకలవాడైన ఆమె దీనస్థితిని జూచి కనికరించే స్థితిలో ఉంది. కాని, మగనికి మాత్రము దయ కలుగలేదు.

శోకదందహ్యా చిత్తముతో, యేడ్చియేడ్చి కటికి నేలమీద పడివున్న యశోదను అప్పుడే రామమోహనుడు కిటికీగుండ చూచాడు. అప్పటి కప్పుడే ఉదయం ఏడు గంటలయి ఉంది.

"వదినా!" అని తిన్నగ పిలిచాడు. యశోద తటాలున లేచి చూచిం. రాత్రంతా నిద్దురలేని కారణంగా ఆవేకువ జామున ఏదో ఉన్నస్థితిలోనే కొంత కలత నిద్దుర పట్టింది. ఏడ్చిఏడ్చి చెక్కిళ్ళమీద కన్నీటి మరక లేర్పడినాయి, ఒక్క రాత్రిలో ముఖమెంతో వాడిపోయింది.

వెంటనే వచ్చి తలుపుతీసి, మఱదికి మొగము చూపలేక, గ్రుక్కిళ్లు మ్రింగుతు స్నానాలగదిలోకి వెళ్ళిపోయింది యశోద.

రామమోహనునకేమి అర్థము కాకపోయినా, అన్న ఆమెను చాల బాధించి ఉంటాడని మాత్రము స్పష్టమైంది. "ఎందుకలా ఉన్నావమ్మా?" అని ప్రశ్నించాడు కాని, ఆమె జవాబు చెప్పకుండ వెళ్ళిపోయింది. నిర్విణ్ణుడై ఉన్నదగ్గరే నిలబడి పోయాడు మోహన్.

అంతలో, గదిలోనుండి తలుపుతీసికొని దివాకరరావు యీవలకువచ్చి కోపదృష్టితో తమ్ముని చూస్తూ "ఒరే, మోహన్, రెండు కత్తులొకవరలో యిమడనట్లు యింకమీద మనమిద్దరము కలిసి యీ ఇంట్లో ఉండేందుకు వీలు లేదు. తక్షణం, తీర్మానించు. ఏమిచేయదలచావో?" అని పిడుగు లాంటి ప్రశ్నను విసరివేశాడు తమ్మునిమీద.

రామమోహన్ ఒక నిమిషముసేపు కేవలం ప్రతిమవలె నిలబడి అన్నవైపు కండ్లప్పగించి చూచాడు.

"చెప్పు. నీ జవాబేమిటో వెంటనే చెప్పు."

"అన్నా! ఏమిటీ వైపరీత్యం? ఉన్నదున్నట్టు నీ మనసెందు కిట్లు మారిపోయింది? జరిగిన సంగతేదో చెప్పరాదా? ఒకవైపు వదిన నారీతిగా దుఃఖింప చేస్తున్నావు. రెండవవైపు నా విషయమై యింత కఠినంగా వర్తిస్తున్నావు? మేము చేసిన అపరాధమేమి? నేరమేదో చెప్పి శిక్ష విధిస్తే బాగుండును కాని, విచారణ, విమర్శ లేకుండ దండన విధిస్తావా? ఈ యిల్లు విడిచిపోవడములో నాకేమి కష్టము లేదని నెల క్రిందటనే చెప్పానుగా? వెళ్ళిపోతానంటే వద్దన్నవాడవు నీవేగా?"

"అప్పటి మాట వేరు. ఇప్పటి మాట వేరు."

"నీ యిష్టము. వెళ్ళిపొమ్మంటే యిప్పుడే వెళ్ళిపోతాను. ఎక్కడికి పొమ్మంటావు?"

"నీ కిష్టము వచ్చిన చోటికి...."

అంతలో మామూలుగా వచ్చిపోయే పద్ధతిలో యశోదతో యేమో పనుండి పొరుగింటి అన్నపూర్ణమ్మ వచ్చిందచ్చటికి.

ఇల్లంతా వెలవెలబోతూ వుంది. యశోద కనబడలేదు, అన్న దమ్ము లిద్దరు ఉన్న వైఖరిని చూచి ఆమె వారినేమి అడగలేక పోయింది. ఇద్దరూ ఎందుకో తీవ్రంగా వాదించుకొంటూ ఉన్నారనే సంగతిని అర్థంచేసి కొనేందు కామె అట్టే ఎంతో కాలం పట్టలేదు. దివాకరరావే అడిగాడు "ఏమమ్మా సంగతి?" అని. యశోదతో పని ఉన్నట్టు చెప్పితే అతడామె కొరకు స్నానపు గది చూపాడంతే.

యశోద అక్కడే గోడకు చేరగిలబడి, గ్రుడ్లనీరు గ్రుక్కుకొంటూ అన్నదమ్ముల సంభాషణ వింటూ వుంది. అన్నపూర్ణమ్మ రావటం గ్రహించింది కాని మాట్లాడేందుకు నోరు పెకలింది కాదు. ఆమెను చూస్తూనే

పాపం యశోద దుఃఖం మరింత ఎక్కువైంది. "ఏమిటర్రా సంగతి" అని అన్నపూర్ణమ్మ ఎవరినడిగినా బదులు చెప్పరు. ఆమె వెంటనే తిరిగి పోయి శంకరభట్టుతో ఈ సంగతంతా చెప్పేసరికి అతడు బిరబిరా వచ్చాడు సమాచార మేమో విచారిద్దామని.

కాని, ఎవరు ఏమి మాట్లాడలేదు. దివాకరరావు "ఏమిలే"దన్నాడు. యశోదకు మాటలే రావు. రామమోహనుదన్నాడు "భట్టుగారూ! నేను మీ యింటికొస్తా."

"ఎందుకు?"

"కొన్నాళ్ళు మీ యింట్లోనే ఉంటా. నాకు ఇల్లు లేదు వాకిలి లేదు."

"అదేమి మాట, మోహన్? మీరేమైన కలహించుకొన్నారా?"

"ఏమిలేదు లెండి వెడదాం పదండి."

అని శంకరభట్టును పిలుచుకొని రామమోహన్ వాళ్ళ యింటికి వెళ్ళిపోయాడు. దివాకరరావు ఏమి పలక లేదు. స్నానపు గదిలోకి వెళ్ళి ముఖప్రక్షాళణ చేసికొని ఎక్కడికో తానూ వెళ్ళిపోయాడు.

# 13

మూడు దినాలు గడచిపోయాయి. రామమోహన్ తమ యింటికి రాలేదు. అన్నను, వదినను మాట్లాడించలేదు. అందుకు కారణం భట్టు గారి యింటో ఎవ్వరికి తెలియదు. వారంతా ఎంతో అడిగారు కాని, మోహన్ యేమీ చెప్పలేదు. ఏదో అన్నదమ్ములు కీచులాడు కొన్నారు

కదా అని అనుకొన్నారు వారంతా, త్వరలో రాజీపడతారు లెమ్మని వారి తలంపు. అసలు విషయాన్ని ఊహించేందుకు వారికి ఆస్కారమేది?

దివాకరరావు మూడు దినాలుగా భార్యతో మాట్లాడ లేదు. పొద్దస్తమానం తోటలో కాలం గడుపుతూ నౌకరుతో అక్కడికే భోజనం కాఫీలు తెప్పించుకొన్నాడు. మూడు రాత్రుల నుండి యశోద ఒక్కతే బిక్కు బిక్కు మంటూ అంత యింటో కాలం గడిపింది.

అన్నపూర్ణమ్మ, కామాక్షి అప్పుడప్పుడు వచ్చి చూచి పోతున్నారు కాని, వారితో యశోద యేమీ చెప్పలేదు. ఆలుమగళ్ళ పోట్లాటలో తల దూర్చడ మెందుకని వారు కూడ ఎక్కువగ జోక్యం కలిగించుకోలేదు.

నాల్గవదినం ఉదయం తొమ్మిదిగంటలప్పుడు అన్నపూర్ణమ్మ వచ్చింది. యశోద హాలులో గోడకు చేరగిలబడి కళ్ళు మూసుకొని కూచొని ఉంది. అంతవరకు స్నానము కాని, వంటకాని యేమి చేసినట్టు లేదు. ఎందుకో తూగుతూ వుంది. "యశోదా?" అని పిలిచింది అన్నపూర్ణమ్మ, మాట్లాడలేదు. ఏవో కొన్ని విపరీత లక్షణాలు చూచి అన్నపూర్ణమ్మ చిరచిర వెళ్ళి కామాక్షిని, భర్తను తోడ్తెచ్చింది. ఎవరెంత పిలిచిన యశోద పలుకలేదు. తల విరియబోసుకొని కూచుంది. ముఖమంతా ఏదో వికృతంగా వుంది. తనలో తాను నవ్వుకోవడం, ఏదో గొణగడం చూచి "ఎందుకీలాగున్నదా?" అని అందరు విస్తుపోయారు. పరామర్శ లేని మల్లికా లత వలె వాడి రత్తలై పోయింది పాపం యశోద.

అంతలో ఏదో అనుమానం తోచి కామాక్షి చెవిలో గుసగుస లాడింది అన్నపూర్ణమ్మ. 'ఔ'నన్నట్టు తల వూపింది కామాక్షి.

"యశోదా! యశోదా!" అని యిద్దరు పిలిచారు. భట్టు ఊరక చూస్తూ నిలబడ్డాడు. అంతలో "ఎవరే యశోద?" అని అరిచింది యశోద.

అన్నపూర్ణమ్మ, కామాక్షి స్థిరపరచారు అదేదో గ్రహావేశ స్థితి అని. కామాక్షి కిట్టి విషయాల్లో పిరికితన మెక్కువ. అన్నపూర్ణమ్మే ముందు పడి "ఎవరమ్మా నీవు?" అని అడిగింది.

.... .... .... .... .... .... .... ....

"చెప్పమ్మా నీవెవరు? ఎందుకొచ్చావు? నీకేమి కావాలి?"

ఈ ప్రశ్నను మూడు మార్లడిగిన పిదప యశోదను ఆవహించిన గ్రహము "నా యింటికి నేను రాకూడదా?" అనింది.

"ఇది నీయిల్లెట్లవుతుంది?"

"నాదికాకపోతే నీదా? మీ అబ్బదా?"

"అయితే నీవు...."

"అవును నేనే. ఇంకా అనుమానమా?"

"మాణిక్యాంబవా?"

"కాక యింకెవరనుకొన్నావు?" అని బిగ్గరగ జవాబు చెప్పి యశోద ప్రక్కకు వ్రాలి పడుకొంది. ఆ మాట వింటూనే అందరి హృదయాలు జలదరించాయి. శంకరభట్టు హడావుడిగ తోటకు వెళ్ళి దివాకర రావును పిలుచుకొనివచ్చాడు. మూడు దినాలుగా యింటికి రాని మోహన్ కూడ ఈ సంగతి విని వచ్చాడక్కడికి. వదిన ఉన్న స్థితిని చూచేసరికి మోహనుని మనస్సంతా తడి తువ్వాలు పిండినట్లయింది. అతడేమి మాట్లాడకుండ ఊరక నిలబడి చూడసాగాడు యశోదను, ఆమె దురవస్థను.

దయ్యమంటే దివాకరానికి నమ్మిక లేదు. అతడెప్పుడు ఇట్టి దృశ్యాలను చూచి ఎరుగడు. మోహనునికి కూడ గ్రహచేష్ట అంటే

యేలాంటిదో యిప్పుడే తెలియవచ్చింది. అసలీ దయ్యాలంటే యేమిటా అని అడిగాడు దివాకరరావు భట్టును. భట్టు ఈలా జవాబు చెప్పాడు. "ఈ స్థూలశరీరాన్ని ఆవరించుకొని అదే పోలికతో ఛాయా శరీర ముంటుంది. అది యేకారణంచేతనైన స్థూలశరీరంతోబాటు నశించి పోక పోతే, అందలి జీవు డప్పుడీ రీతిగ తన కీ భూలోకములో నుండు వారితో గల ఇచ్ఛా ద్వేషాది సంబంధాలను వ్యక్తపరచుకొనేందుకు బ్రతికి ఉన్న వారి నావరించి ఛాయా శరీరం ద్వారా తృప్తి పొందుట కలదని శాస్త్రాలు చెబుతున్నాయి."

యశోద.... కాదు, ఆమె నావహించిన గ్రహం.... పకపక నవ్వింది. ఇందులో నటన యేమైన ఉందేమో అని దివాకరరావు మొదట కొంత అనుమానించాడు. కాని, లక్షణాలను బట్టి అతని మనసు సంశయాన్ని విడిచి "నిజమేనేమో" అనికొనింది.

అందరు ఊరక గుటకలు మ్రింగుతూ చూస్తూ వుంటే అన్న పూర్ణమ్మే మాట్లాడుతూ వుంది గ్రహంతో.

"ఏమమ్మా, నీ విప్పు డేకోర్కెతో వచ్చావో చెప్పమ్మా. ఇడిగో నీ భర్త. అడుగో నీ మఱది."

గ్రహం కిలగా నవ్వింది. ఏదో అస్పష్టంగా గొణిగింది, ఎవ్వరికీ అర్థము కాలేదు. అన్నపూర్ణమ్మ అదే ప్రశ్న నడిగింది రెండు మూడు మార్లు. అయినా జవాబు లేదు.

"మాణిక్యం, నీవు బ్రతికిన కాలములో ఎంతో మంచిదాన వని పించు కొంటివికదా, ఇప్పుడీ కర్మయేమి?" అని దివాకరరావే ప్రశ్నించాడు.

"నా స్థానములో యింకొకతె ఈ ఇంట్లో కాపురం చేసేందుకు వీలు లేదు."

"అట్లయితే, పెండ్లికి ముందే నీవు నీ మగనిని హెచ్చరించక పోతివా?" అని భట్టు ఈసారి అడిగాడు.

"మారుపెండ్లి చేసుకొనే వానితో మాట లేమి?"

"అయితే, ఇప్పుడేమి చేయదలంచావు?" అని అన్నపూర్ణమ్మ ప్రశ్న.

"తీ–సు–కొ–ని–పో–తా" అని మళ్ళా మెల్లిగ గొణిగింది.

"ఎవరిని?"

"య–శో–ద–ను"

అదేమి దైవచిత్రమో – ఆ వేళకు సరిగా కలువలపల్లి నుండి వేంకట్రామయ్య బస్సు దిగి ఇంటికి వచ్చాడు. పెండ్లి జరిగి మూడు నెలలైంది. బిడ్డ కాపుర మేలాగుందో చూచిపోదామని వచ్చాడా వృద్ధుడు బిడ్డమీది మమకారంకొద్దీ. ఆతనిని చూచి అందరు "సమయాని కొచ్చాడు తండ్రి" అని ఒకరీతిగా హర్షించినా, కంటి ఎదుట జరుగుతూ ఉండే విషాద సంఘటనకు ముఖాలలో విషాదచ్ఛాయలు కనబరుస్తూ ఖిన్నులై చూపట్టిరి.

సంభ్రమము, భీతి, దుఃఖము ముప్పిరిగొని వేంకట్రామయ్య సంగతంతా విని కన్నతండ్రి ఎంత బాధపడిపోవాలో అంత బాధ పడ్డాడు.

అన్నపూర్ణమ్మ చేసైగతో ఎవ్వరిని మాట్లాడవద్దని "ఏమో చెబు తుంది వినండి" అనింది.

"య–శో–ద–యీ–యింట్లో–ఉం–డ–కూ–డదు. ఉంటే...."

"ఉంటే ఏమి చేస్తావు?"

"తీసు–కు–పో–తా."

"అంతే - యశోద తటాలున కన్నులు తెఱచి నాచొని చుట్టూ పరికించి చూచింది. గ్రహం వదలి పోయింది కాబోలు....

వేంకట్రామయ్య బిడ్డ తలపై చేయి వుంచి నిమురుతూ "యశోదా ఏమిటమ్మా ఇదంతా?" అని కళ్ళు తుడుచుకొంటూ ప్రశ్నించాడు. యశోద ఆతని ఎదపై వ్రాలి "నాన్నా" అని వెక్కి-వెక్కి- ఏడ్వసాగింది. ఒక్క- దివాకరరావు తప్ప తక్కి-న అందరి హృదయాల్లో ఉత్పన్నమైన విచార చిహ్నంగా కన్నీళ్లు సాక్షి పలికాయి.

"బాబూ, దివాకరం, అమ్మాయిని మా యింటికి పిలుచుకొని పోదునా? ఈస్థితిలో ఒంటరగా ఏమి చేసుకోగలదు?" అని అన్నపూర్ణమ్మ అడిగింది.

"సరే, మీ యిష్ట"మంటూ నసిగాడు దివాకరరావు.

"నీవు, మీ మామగారు మా ఇంట్లోనే భోజనాలకు రావాలి" అని భట్టు ఆహ్వానించి, యశోదను పిలుచుకొని తమ ఇంటికి వెళ్ళిపోయాడు.

ఆ దినం భోజనాల వేళ కందరు ఉన్నారు కాని, రామమోహన్ లేడు. 'సరే, వస్తాడు లెమ్మని అందరు భుజించి లేచారు. మోహనుడు ఏమి ఎరగనట్టు అప్పుడు వచ్చి బయట వసారాలో కూర్చున్నాడు. భోజనానికి లెమ్మని అన్నపూర్ణమ్మ, భట్టు పిలిచారు. "హోటలుకు వెళ్ళి భోజనం చేసి వచ్చా"నన్నాడు మోహన్.

"హోటలుకు ఎందుకు వెళ్ళావు, నాయనా?"

"ఇంతమంది ఒకచోట ఎందుకు లెండి."

"ఇదేమిటి, మోహన్, క్రొత్తగా మాట్లాడుతున్నావు? ఇదేమి మీకు క్రొత్త యిల్లా?"

"కాదనుకొండి. భోజనములో ఏముంది. మనసులో ప్రేమ విశ్వాసాలుండాలికాని. ఎక్కడో ఒక చోట ఇంత తినడమౌతుంది."

ఇదంతా అన్నను గురించి మాట్లాడిన వైరాగ్యమని అర్థముచేసుకో లేక శంకరభట్టు, అతని భార్య "మనసులో ప్రేమవిశ్వాసాలు లేనిదెవరికి మోహన్?" అనిరి.

"అబ్బే, మీ మాట కాదండి. లోకం రీతిగా మాట్లాడా నంతే."

వచ్చినప్పటినుండి మామను దివాకరరావు మాట్లాడించలేదు రామ మోహను దసలే ఆ పనిచేయలేదు. బిడ్డ దుఃఖములో పడిన వేంకట్రా మయ్య కూడ వారిని పలుకరించ లేదు. ఇంతకు మాట్లాడేందుకు దివాకర రావు ఆస్పద మిస్తేనా? భోజనమౌతూనే ఇంటికి తాళం వేసుకొని తోటకు వెళ్ళిపోయాడు. భార్యగతి నసలే విచారించ లేదు. ఆమెను మాట్లాడించను లేదు.

వచ్చిన కొంతసేపటిలోనే వేంకట్రామయ్యా కర్థమైంది అన్నదమ్ము లకు భార్యా భర్తలకు ఏదో మనస్తాపం ప్రారంభించిందని. అది బహుశ యశోద వివాహత్పూర్వ విషయమే కావచ్చునేమో అని కూడ అనుమా నించాడతను. అతడు, శంకరభట్టు చిరకాల మిత్రులు. ఇంతకు భట్టేగా ఈ వివాహం కుదిర్చి లగ్నపత్రిక వ్రాసింది.

రామమోహన్ మళ్లీ ఎక్కడికో వెళ్ళిపోయాడు. వేంకట్రా మయ్య, శంకరభట్టు, అన్నపూర్ణమ్మ, కామాక్షి ఒకచోట కూర్చుని దివాకర రావు యింటి సంగతులను గురించి ముచ్చటించుకో సాగారు. ప్రక్కన గదిలో సగం మెలకువ, సగం మగతతో యశోద పరుపుపైన పండుకొని వుంది. మూడు దినాలనుండి ఆమెకు సరిగా నిద్రాహారాలులేవు. ఆ పూట అన్నపూర్ణమ్మ బలవంతంమీద యింత తిని పడుకొనింది.

ఆ యింట్లో ఆలుమగలు, అన్నదమ్ములు ఏలాంటి పోరుపొచ్చెము లేకుంత మూడు దినముల క్రిందటి వరకు బాగానే వుండినారని, కారణ మేమోకాని రామమోహన్ మూనాళ్ళ నుండి యింటికి పోకుండ తమ

యింటనే భోజనంచేస్తూ వున్నవాడు యీ దినం హోటల్‌కు వెళ్ళాడనీ. చెప్పారు వారు వేంకట్రామయ్యకు. ఒక గంట తరువాత శంకరభట్టు వేంకట్రామయ్యతో "నే నిప్పుడే తోటకువెళ్ళి దివాకరాన్ని కలిసికొని, సంగతులనన్నిటినీ విచారించుకొని వస్తా"నని చెప్పి లేచిపోయాడు

ఎన్నటికిరాని శంకరభట్టు ఆ దినం తోటకు రావడముతో దివాకరానికి కారణం కొంతవరకు సంబోధకమయ్యింది. ఇద్దరు ఒక అరగంటసేపు తోటంతా తిరిగారు, చెట్లను చూచారు. తోట మంచి అభివృద్ధిలో వున్నందుకు భట్టు అతన్ని అభినందించాడు. తరువాత ఇరువురువచ్చి ఒక నులక మంచంమీద కూర్చున్నారు.

తాను వచ్చిన పనిని గురించి సంభాషణ నెట్లు ఉపక్రమించాలో కొంత ఆలోచించి భట్టు యిట్లన్నాడు.

"దివాకరం! మోహను డెందుకు మూడు దినాలనుండి యిల్లు చేరకున్నాడు?"

.... .... .... .... .... .... ....

"మీ మామతోకూడ మాట్లాడ కున్నావెందుకు?"

.... .... .... .... .... .... ....

"అసలా యశోద చేసిన తప్పేమి?"

.... .... .... .... .... .... ....

"ఇటూరకుంటె సంగతులెట్లు తెలుస్తాయి? మీ రేమి పసిబిడ్డలా? మీలో మీరే ఈ విధంగా పైముఖ్యం వహిస్తే యింట్లో విచారించే దిక్కెవరు? ఈ సంగతికాస్త బయటపడిందా చూచి ఓర్వలేని వారింక ఎన్ని కథ లల్లుతారో! పచ్చని కాపురాన్ని రచ్చకీడ్వవచ్చా? వెంట్రుకలున్నచోట చిక్కుపడడం సహజం. నలుగురున్నచోట ఏదో మాట వస్తుంది. మాట

పోతుంది. అంత మాత్రాన యింత ఎడాపెడగావుండిపోతారా? అబ్బాయ్? మేము మీకు మొదటనుండి హితకాంక్షులని నీ అంతరాత్మ చెప్పేపట్ల సంగతేమిటో నావద్ద వివరించి చెప్పు. నా శాయశక్తుల పాటుపడి సరిదిద్దుతా? మా యింటి గొడవ మీ కెందుకంటావా నీ యిష్టం. నిన్నడుగను."

అని భట్టు కొంత భీష్మించుకొనే సరికి దివాకరరావు "మామా—" అని, అంతలో గొంతుకలో పచ్చి వెలక్కాయ అడ్డుపడినట్టు తలవాల్చాడు. అతడు చిన్ననాటి నుండి భట్టును 'మామా' అని, అతని భార్యను 'అత్తా' అని సంభోధిస్తూ ఉండడం పరిపాటి.

"చెప్పు, నాయనా, సంగతేమిటో. వృధా ఎందుకు లోలోన కుమిలి పోతున్నావు?"

"మామా! నీ వద్ద నేనేమి దాచను. మాకు నీవు తప్ప హిత చింతకులైన పెద్ద లెవరున్నారు. అన్ని సంగతులు వినిపిస్తా విను," అని దివాకరరావు తనకు నాగభూషణం తెలిపిన సంగతులన్నిటిని పూసగ్రుచ్చినట్టు చెప్పి "ఇప్పుడు చెప్పండి. ఈ సంగతులన్ని విన్న తరువాత మోహనుడు, యశోద నిష్కలంక హృదయులయ్యే వుంటారంటావా? వారు నన్ను వంచించ లేదంటావా? ఈ విషయములో వేంకట్రామయ్య పాత్ర యేలాటిదంటావు? అత డిదంతా తెలిసే నాకు మాటయిచ్చి మనతో ఆ నాడు లగ్నపత్రిక వ్రాయించుక పోయాడంటావా? లేక, తెలియక చేశాడంటావా? భగ్నప్రేమతో భగ్నహృదయులైన నా తమ్ముని గురించి, యశోదను గురించి నా కసహ్యము జనించింది. నా కర్తవ్యాన్ని తెలియ జెప్పు." అని ముగించాడు.

ఇదంతా శంకరభట్టు కేమి తెలుసు? చాల ఘోరమైన పనే జరిగిందని తలంచాడు. దివాకరరావు ఇప్పుడనుమాన పీడితుడయ్యాడంటె ఇందులో అసహజ మేమిలేదు.

"దివాకరం! నీ మాటలు వింటూవుంటే నాకెంతో సానుభూతిగా వుంది. అయినా, నీవు చాల ఆతురపడ్డావోయ్, ఎవరో చెప్పినమాటను విన్న వెంటనే అనుమానించడం పొరబాటు. మనసులో అనుమానం ప్రవేశించిందంటె అది ఎంతటి వారినీ దారితప్పిస్తుంది. అంతేకాదు. లోకమంతా తన్నే వ్రేలెత్తి చూపుతూవుందని భావిస్తుంది. ఈలాటి విషయాల్లో ఎంతో గాంభీర్యము, సహనము, దూరదృష్టి, విచక్షణ, అవసరం బాబూ! ఇప్పుడు మించిపోయిందేమిలేదు. మీ మామ కూడా వచ్చాడు కదా! ఇప్పుడే ఇంటికి వెడుతూనే యీ విషయమంతా నీ యెదుటనే ప్రస్తావిస్తా. అతని సమాధానాన్ని విందాము. నాకు చూడబోతె అతడు అమాయకుడని. తాను ఊళ్ళో లేనికాలములో నీ తమ్ముడు, యశోదా ప్రేమించుకొన్నారనే సంగతి తెలియకుండ, నీకు మాటయిచ్చి లగ్నపత్రిక వ్రాయించుకొని వెళ్ళివుంటాడనే నా ఊహ. తరువాత తన వాగ్దానానికి భంగము రాకూడదని బిడ్డ నిందు కొప్పించి ఉంటాడు. మోహన్ నీ సుఖమాసించి తన సుఖాన్ని త్యాగం చేసి ఉంటాడు. ఇదంతా నిజమనే నా అంతరాత్మ చెబుతూవుంది. నీవు నిష్కారణంగా మోహనుని, నీ భార్యను తప్పు తలచావు. నీవు కొంత ఆలసించి యింటికిరా. ఆలోగా నేను వేంకట్రామయ్యతో, యశోదతో యీ సంగతులని ప్రస్తావించి ఉంటా. ఈ అనుమానం పరిష్కారం కావల్సిందే సుమా!"

అని శంకరభట్టు యింటికి వెళ్ళిపోయాడు. వేంకట్రామయ్య అతని కొరకే ఎదురుచూస్తూ బిడ్డవద్ద కూర్చుని ఆమెను పరామర్శిస్తూ ఉన్నాడు. ఇంట్లో రామమోహన్ లేడు. ఎక్కడికో వెళ్ళిపోయాడు. తక్కిన యిద్దరు ఆడంగులు ఏవో యింటిపనుల్లో లీనమైఉన్నారు.

శంకరభట్టు యశోదను చూచి "ఎట్లుందమ్మా?" అని ప్రశ్నించాడు.

"చాలా నీరసంగా ఉంది. బాబయ్యా!"

"ఉండదా మరి. మూనాళ్ళ నుండి సరిగ తిండిలేదు, నిద్రలేదు. నీ బాధనీకాయె. పైగా గ్రహబాధ."

"ఒళ్ళంతా సమ్మెటల్తో కొట్టినట్టుంది."

"ఔనమ్మా. అదంతా ఆలాగే ఉంటుంది, వేంకట్రామయ్యా! ఇదంతా తాత్సారం చేయవలసిన సంగతికాదు. జాగ్రత్తగా అమ్మాయికి తగిన చికిత్స చేయించాలి సుమా."

"ఆదే అనుకొంటున్నాను. మా ఊళ్ళో పేరుపొందిన భూత చికిత్సకుడున్నాడు. ఎంత మొండి గ్రహాన్నైనా అట్టే స్వాధీనపరచుకొని ఉచ్చాటనచేసివేస్తాడు."

"సరే, ఇంకేము. వెంటనే అమ్మాయిని రేపే కలువలపల్లికి ప్రయాణం చేయించు. ముందు తగిన చికిత్స కేర్పాటు చెయ్యి."

"ఇంతకు అల్లుడేమంటాడో? నీ వేమైనా మాట్లాడివచ్చావా?"

"ఆ, అంతా మాట్లాడి వచ్చాను. దివాకరం చాలా మంచివాడే కాని, అతనిని కూడ ఒక అనుమాన పిశాచంపట్టి పీడిస్తూంది. అందువల్ల యీ మూన్నాళ్ళ నుండి తమ్ముని యెడ, భార్యయెడ విపరీతంగా వర్తించాడు."

"ఏమిటా అనుమానం?"

"నీకు, యశోదకు, రామమోహనునికి అర్థమయ్యే ఉంటుంది. ఈమెకు వరుణ్ణి వెతకుతూ నీవు ఇల్లువిడిచివచ్చి, దివాకరరావుని అల్లునిగా నిర్ణయించుకొని, లగ్నపత్రిక వ్రాయించుకొని వెళ్ళేలోగా నీ కుమారుడైన కృష్ణమూర్తి, తన స్నేహితుడైన మోహనుని మీ ఇంటికి పిలుచుకొని వచ్చాడా?"

"అవును. ఆ పని జరిగింది."

"ఆ సంగతి నీకు తెలుసా?"

"నా కేలాగు తెలుస్తుంది? నా పనిలో నేనుండిపోయాను. భట్టూ! పెండ్లికి ముందుజరగిన సంగితంతా దివాకరానికి తెలిసిపోయినట్టుంది కదూ?"

"అవును. మూనాళ్ళ క్రింద అమ్మాయితో దివాకరం సినిమాకు వెళ్ళాడు. అక్కడ నాగభూషణం అనే ఒక ధూర్తుడీ సమాచారమంతా మీ అల్లునితో చెప్పాడట.

అంతా వింటూవున్న యశోద కిప్పుడర్థమైంది. మగని విపరీత ప్రవర్తనానికి కారణం. "ఔను, నాన్నా, ఆ రాత్రి నన్ను ముందుగా జట్కాలో యింటికి పంపి వారు, చాలాసేపటికి ఒంటరిగా వచ్చారు."

"అప్పుడే పాలకుండలో విషబిందువు పడిందమ్మా. 'ఇంతగా ప్రేమించుకొన్న వీరిద్దరి హృదయా లెంతవరకు నిష్కళంకంగా ఉంటాయి? నా తమ్ముని తన బిడ్డ ప్రేమించిందని తెలిసికూడ ఈ వేంకట్రామయ్య నా కెందు కీ పెండ్లి చేశాడు' అని దివాకరం వాదన."

"భట్టూ! దేవుని ఎదుట చెప్పినట్టు చెప్పుకుంటా వినవయ్యా. నేను అమ్మాయికి సంబంధం కుదుర్చుకొని ఇంటికి వెడతానని మా యింట్లో ఎవ్వరికి తెలియదు. అక్కడికి కృష్ణమూర్తి తన మిత్రుని పిలుచుకొని వస్తాడని, మోహనుడు, ఈమె ప్రేమించుకుంటారని నాకు తెలియదు, మీతో లగ్నపత్రిక వ్రాయించుకొని నేను ఇల్లు చేరేలోగా ఇంతప్రమాదం జరిగిపోయ్యింది. ఇందులో మే మెవ్వరైన బుద్ధిపూర్వకంగా ఎవరికైనా ద్రోహం చేశామా చెప్పు."

"లేదు. అంతా పొరబాటే. అయినా, యశోద చాల గొప్ప హృదయం కల ఆడుబిడ్డ. చాలాదూర మాలోచించే యీ పనిచేసింది. మోహనుడు కూడ మంచిపనిచేశాడు. ఒక వేళ తాను మొదట ప్రేమించు

కొన్నట్టు మోహనునితప్ప ఇతరుల నెవ్వరిని పెండ్లి చేసుకోనని ఈమె పట్టుపట్టి వుంటేమాత్రం మోహన్ లభించి ఉండేవాడేనా!"

"లేదని అమ్మాయి, మేము గ్రహించే, తుదకీ నిర్ణయానికి వచ్చాం భట్టూ."

"అది అర్థమౌతూనే ఉంది. ఇందులో నీ తప్పేమిలేదనేది స్పష్టమైంది. పోతే, వీరిద్దరి హృదయనైర్మల్యాన్ని గురించిన అనుమానాన్ని తొలగించేదెట్ల?"

యశోద తిన్నగా లేచింది. ఏందుకో అనుకున్నారు వారిద్దరు. ఆమె వారి పాదాలను చెరియొక చేత్తో పట్టుకొని "మీలో ఒకరు నాకు కన్నతండ్రి, ఇంకొకరు నాకు పినతండ్రితో సమానులు. మీ పాదాల సాక్షిగా, నా ఆత్మ సాక్షిగా. సర్వాంతర్యామి అయిన భగవంతుని సాక్షిగా నేను నా భర్తయెడ త్రికరణశుద్ధిగ ఏ దోహం చెయ్యలేదు. అంతా నా ప్రాప్తి అని కర్మకు తలఒగ్గి నడచుకొంటున్నాను." అని దుఃఖింపసాగింది.

# 14

రాత్రి దీపాలుంచేవేళకు దివాకరరావింటికి వచ్చాడు. మోహనుడు మాత్రం రాలేదు. ఎక్కడో హోటల్ భోజనం చేసివుంటాడని అందరు అనుకొన్నారు.

భోజనానంతరం భట్టు దివాకరాన్ని, వేంకట్రామయ్యను యశోద ఉన్నగదిలోనే కూర్చోబెట్టుకొని, దివాకరరావుతో వేంకట్రామయ్యలో యే దోషము లేదని సవిమర్శగ వాదించి చెప్పాడు. నడుమ నడుమ

అల్లుడు తన్నడిగిన ప్రశ్నల కన్నిటికి మామ తగిన సమాధానాలిచ్చాడు. అంతటితో దివాకరం మనసులో మామ విషయమై ఉండిన సంశయమంతా తీరి, ఆ స్థానములో పశ్చాత్తాపం నెలకొనింది.

ఇక యశోదా రామమోహనుల నిరపరాధిత్వమును గురించి భట్టు, వేంకట్రామయ్య తమ నేర్పుకొలది చెప్పారు. యశోద పెద్దలయెడ ఎన్నో ప్రమాణాలు చేస్తూ, భర్త పాదాలను కన్నీటితో కడుగుతూ, తాను కాని, తన మరదికాని వివాహానంతరము ఎట్టి పాపానికి ఒడిగట్టలేదనియు, పెండ్లికి పూర్వమేర్పడిన ప్రేమ తదనంతరము తనలో మాతృవాత్సల్యంగా మారి పోయిందనియు, రామమోహనుడు కూడ నిష్కల్మష చిత్తముతో తన సుఖాన్ని అన్న సుఖంకొరకు త్యాగంచేసి తన్ను తల్లిగా భావించాడేకాని కాముక దృష్టితో యేనాడు చూడలేదనియు భర్తమనసు కరగేట్టు ప్రతి చిన్న విషయాన్ని విమర్శించి చెప్పుకొనింది. తండ్రి, భట్టు మొదలైన వారంతా ఆమె శీలాన్నిగురించి కాని, తమ్ముని సత్ప్రవర్తనను కాని సంశయించడం పొరబాటేకాక, వారి కన్యాయంగా గొప్ప ద్రోహంచేయడం తప్ప మరేమి కాదనీ యశోద వాదాన్ని సమర్థించిరి.

దివాకరరావులో ఘనీభవించిన సంశయాంధకారము సత్యమనే భానూదయముతో పటాపంచలైంది. యశోద ఎడ తాను కావించిన దుష్కార్యాని కెంతో వగచి ఆమెను మనసార తనచేతులతో అదిమి పట్టుకొని, కన్నీటి ధారతో హృదయ కల్మషాన్నంతా కడిగివేసుకొన్నాడు.

సంతోషమే సగము బలమన్నారు కదా! అప్పుడే యశోద శరీరములో ఏదో నూతనశక్తి కలిగింది. భర్తమాటలనే అమృత ధారలతో దుఃఖాగ్నిచే పరితప్తమై పోయిన ఆమె హృదయము చల్లబడింది. ఆ దృశ్యాన్ని చూచి అక్కడున్న పెద్దలంతా పరమానంద భరితులయ్యారు.

"దివాకరం, నడుమ చెడిన నిద్ర తరువాత గాఢనిద్రగా మారి ఎంతో ఉల్లాసమిస్తుంది. అల్లే, ఒకమారీ రీతిగా దెబ్బతిన్న ప్రేమ తరువాత అమృతముకంటె రుచికరమౌతుంది. మీ వాలు మగలొక్కటైనారు. చాల సంతోషము, నాయనా! పాపం, అమాయకుడైన రామమోహన్ - నిన్ను తండ్రివలె ఆదరించే తమ్ముడు - నీ ఆదరణచెడి - నీ కోపముతో మనసుచెడి — చూడు, ఇల్లుచేరకుండ పిచ్చివాడై తిరుగుతున్నాడు. మొదటినుంచి మీ ఇద్దరి భ్రాతృప్రేమ అనన్య సామాన్యమైంది. మోహనుని చేరతీసి, వాని మనసునకు శాంతి కలిగించు." అని భట్టు చెప్పుతూఉండగానే అకస్మాత్తుగా రామమోహన్ వాడ గడపలో కాలుంచాడు. దివాకరరావు పరుగెత్తిపోయి "మోహన్" అని వానిని బిగియార కౌగలించుకొని కన్నీటితో వాని అంగిని తడిపివేయ సాగాడు. అతని దుఃఖము, అనుతాపము మాటలకు మీరిపోయాయి కాబట్టి దివాకరం మాట్లాడలేక పోయాడు.

"ఏమిటీసంగతి!" అని రిచ్చపడి చూచే రామమోహనునితో శంకరభట్టు అన్నివిషయాలు చెప్పివేశాడు. అన్నదమ్ము లిద్దరు ఒకరి నొకరు కౌగిలించుకొని కన్నీళ్ళతో హృదయక్షాళన కావించుకొంటూ ఉంటే చూచేవారంతా ఆనందబాష్పాలు రాల్చారు.

ఆ సంతోష పరిణామ చిహ్నంగా శంకరభట్టు ఆ మరుసటి దినం తమయింటోనే గొప్పగా విందు చేయించాడు. అందరిముఖాలు హాస ప్రఫుల్లమయ్యాయి. యశోద చిన్నగ పాటాడగలిగింది. వెనుకటి దినం కలిగిన ఉపద్రవాన్ని బట్టి ఆమెను అన్నపూర్ణ మొదలైనవారు స్వగృహానికి పంపలేదు.

వృద్ధులంతా గ్రహవిషయం ఖచ్చితంగా నమ్మారు. దివాకరరావు, మోహన్ నమ్మీనమ్మకుండా ఉన్నారు, అయినా యికముందు యశోద

విషయమేమి చేయదనూ అని దివాకరరావు మామను, తక్కినవారిని అడిగాడు.

"బాబూ, కొన్నాళ్ళపాటు అమ్మాయిని ఊరికి పిలుచుకొని వెళ్ళాలని అనుకొన్నాను, మా ఊళ్ళో ఒకమంచి భూత చికిత్సకుడున్నాడు. చేయించవలసిన చికిత్సలన్నీ అక్కడ చేయిస్తాను. ఒక నెలరోజులుండి వస్తుంది. పంపించు" అన్నాడు వేంకట్రామయ్య.

భట్టు, అన్నపూర్ణమ్మ అతని అభ్యర్థనను సమర్థించారు. "దివాకరం! నీకు యీ గ్రహాల అనుభవంలేదు కాని, మా ఊళ్ళో నేను చాలామందిని చూచాను. ఇందులో కొన్ని చాల అసాధ్యమైనవి ఉంటాయి. ఎవరికీ లొంగవు. వాటిశక్తి యేమో కాని ఒక్కొక్కసారి అన్నంతపని చేసి పోతాయి. ఈ చిన్నవయసులో యశోద కీదురవస్థ కలిగిందంటే ఎంతో విచారకరంగా ఉంది. అందులో మరెవ్వరో కాదు. ఇది అసడానికి రాదు. అనుభవించడానికి రాదు. తగిన జాగ్రత్త ప్రారంభంలోనే తీసికోవాలి. మీ మామ కోరినట్లూ యశోదను కొన్నాళ్ళు వాళ్ళూరికి పంపు. కొంత మేలైనాక పిలుచుకొని రావచ్చు" అని అన్నపూర్ణమ్మ హితవు చెప్పింది,

అప్పటి పరిస్థితుల్లో కొన్నాళ్ళు పుట్టింటికిపోయి రావలెననే అభిలాష కలగటంచేత యశోద ఒకరీతి దీనదృక్కులతో భర్త నభ్యర్థించింది.

భార్యను కొన్నాళ్ళపాటు పుట్టింటికి పంపడమే సమంజసమని దివాకరానికి కూడ తోచింది. తమ్ముని అభిప్రాయ మేలాగుందో చూడాలని "మోహన్! మీ వదినెను కొన్నాళ్ళు పుట్టింటికి పంపవచ్చును కదా?" అని ప్రశ్నించాడు.

ప్రశ్నలోగల భావమేమో మోహన్‌కు స్ఫురించలేదు. "ఎంతగా

ఉందే, సన్నడగడమెందుకు? నీ యిష్టము వచ్చినట్టు చేయవచ్చును." అన్నాడు ముక్తసరిగ.

"అదికాదు, మోహన్! ఇంట్లో మనము ఇబ్బంది పడవలసి వస్తుందికదా అని అడిగానంతే."

"బాగుంది. ఎల్లకాలం మనసుఖాన్నే చూచుకొంటె ఆమె ఆరోగ్యం సంగతేమిటి? ఆడువారికి అప్పుడప్పుడు పుట్టినింటికి పోయి రావాలనే కుతూహలముండనే వుంటుంది. ఆమె వచ్చేదాకా మనతిప్పలు మనవి."

భార్యను కలువలపల్లికి పంపేందుకు దివాకరరావు సమ్మతించాడు. ఆ మరుదినం ప్రయాణానికి మంచిదిగా నున్నందున ప్రయాణం నిశ్చయింప బడింది.

"ఇప్పటికేమో సరిపోయింది. ముందుగతేమి?" అనింది అన్న పూర్ణమ్మ.

"ఏ విషయము చెప్పు, అత్తా?" అన్నాడు దివాకరం.

"యశోద యీ యింట్లో ఉంటే తప్పక తీసుకొని పోతాననింది కదా గ్రహం. ఆ సంగతిని గురించి యేమాలోచించావు, నాయనా?"

"అందుకు మీ అందరి సలహాయేమిటో చెప్పండి."

"నా సలహా యేమిటంటె, వదినె వచ్చేలోగా మన మీ యింటిని వేరెవ్వరికైన అద్దెకిచ్చివేసి, వేరే యిల్లు కుదుర్చుకొందాం." అన్నాడు మోహన్.

"అదీ ఒకందుకు బాగానేఉంది. అలాగే చేద్దాం" మని సమాధాన పడ్డాడు దివాకరరావు.

ప్రయాణానికి ముందు దినం రాత్రి యశోద భర్త ప్రేమామృత

సాగరములో ఓలలాడింది. ఇరువురు తమ మనస్సులను పరిశుద్ధ పరచు కొన్నారు. రామమోహనుని గురించి తనలో యింకా ఏమాత్రం పూర్వాభిమాన మున్నా దానిని యశోద పూర్తిగ తుడిచివేసుకొని ఆ స్థానములో నూటికి నూరు పాళ్ళు మాతృవాత్సల్యాన్ని స్థిరపరచుకొనింది.

ఆ రాత్రి వేరొక చోట పరున్న మోహన్ కూడ తమ గృహ పరిస్థితులను గురించి దీర్ఘంగా ఆలోచిస్తూ నిద్రను చెడగొట్టుకున్నాడు. యశోద విషయమై తాను చూపవలసిన పవిత్ర భావము నిదివరకే అలవరచు కొన్నవాడైన, ఇకముందు మరింత జాగ్రత్తతో మసలుకోవడం అవస్యమని నిశ్చయించుకొన్నాడు. మనసును జయించగలిగిన పిదప అది మరల దారి తప్పిపోతుందనే భయమేమి ఉండదు కదా! వెనుక నాలుగైదు రోజులనుండీ అన్న కనబరచిన కాఠిన్యమును గురించి మోహన్ తప్పుగా భావించలేదు. అతని స్థానములో ఉంటే తానూ ఆ రీతిగానే వర్తించే వాడని మోహన్‌కు అర్థమయింది కాబట్టి అన్న నతడు అపార్థం చేసుకోలేదు. పైపెచ్చు, ఆతని నిస్సహాయ స్థితిని చూచి తమ్మునికి మరింత జాలివేసింది మనసులో.

ప్రయాణ సందర్భములో యశోద భర్త పాదాలకు నమస్కరించి అందరివద్ద సెలవు తీసికొనింది. అన్నదమ్ములిద్దరు బస్సువరకు వెళ్ళి ఆమెను, వేంకట్రామయ్యను సాగనంపి వచ్చారు.

వారు తిరిగి యింటికి వచ్చేలోగా శంకరభట్టు "యశోద మరల తిరిగి వచ్చేదాక మీ అన్నదమ్ము లిద్దరు మా యింట్లోనే భోజనాదికాలు చూచుకోవాలి సుమా," అన్నాడు.

"అదేమి పొసగదు మామా! నీకు మేము కష్టపడకూడదనే తలంపు ఉంటే మాకొక వంట మనిషిని కుదిర్చిపెట్టు" అన్నాడు దివాకరరావు.

"సరే, అలాగే" అని భట్టు ఆ దినం సాయంకాలములోగా సుమారు యాభై యేండ్ల వయసు గల రంగమ్మ అనే వితంతువును తోడ్తెచ్చి "ఇదిగో, అబ్బాయ్! ఈమె మన కులస్థురాలే. వంటలో సిద్ధహస్తురాలు. శుచికి రుచికి పేరుపొందింది. పైగా యశోదకు యింట్లో తోడుగా ఉంటుంది. ఈమెను ఎల్లకాలము మీ ఇంట్లోనే ఉంచుకో" మన్నాడు.

అన్నదమ్ములందుకొప్పుకొని ఆ మరునాటి నుండి రంగమ్మ తోడ్పాటుతో తమ యింట్లోనే భోజనాదులు జరుపుకో సాగారు.

వేంకట్రామయ్య బిడ్డతోకూడ కలువలపల్లిలో బస్సు దిగి యింటికి వెళ్ళాడు. బిడ్డ మొగం చూచి సునంద ఎంతో ఆనంద పడింది. తమ్ముడానందు దెగిరి అక్కను కౌగలించుకొన్నాడు. కృష్ణమూర్తి చెల్లెలివైపు సంతృప్తిగా చూచి సంతోషించాడు.

క్రమంగా సునందకు చెప్పాడు వేంకట్రామయ్య. యశోదకు ఇటీవల జరిగిన సంగతులన్నిటిని. బిడ్డనొక గ్రహ మావేసించిందని వింటూనే తల్లి హృదయము తల్లడించింది. మగని యింటికి కాపురానికి వెళ్ళిన తరువాత ఈ మూడు మూడున్నర నెలల్లో యశోద పుట్టింటికి రావడం యిదే మొదటిసారి. ఆమె ఉన్న స్థితిని చూచి అత్తవారింటో బిడ్డకేలాటి కష్టము లేదని సునంద గ్రహించింది కాని, ఈ దుర్వార్తవల్ల మనసు చాల బాధపడింది.

"అదేమి చేస్తుందిలే. మన వీరబ్రహ్మాన్ని పిలిపించి విచారిస్తే అన్నీ తేలిపోతాయి. ఈలాంటి గ్రహాలు గ్రిహాలు వాని ముందు పరారి కావాల్సిందే." అని సమాధాన పరిచాడు వేంకట్రామయ్య.

"ఎందుకైనా మంచిది. రేపు ఆదివారం కాబట్టి తప్పక పిలిపించండి" అని బతిమాలుకొన్నట్టు చెప్పింది సునంద.

వీరబ్రహ్మ మొక కమసాలి. ఆ ఊళ్ళో గ్రహ చికిత్సకు పేరు పొందినవాడు. ఆ ఊళ్ళో మాత్రమన నేమి....చుట్టూ పదిమైళ్ళలో అతని కెప్పుడు ఈ విషయమై పని ఉండనే ఉంటుంది.

ఆదివారం ఉదయమే వేంకట్రామయ్య వెళ్ళి పిలుచుకొని వచ్చాడు వీరబ్రహ్మాన్ని. అతడు యశోద నాడిని పరీక్షించి "అయ్యగారూ! భూతనాడి స్పష్టంగానే ఆడుతూనే వుంది. గ్రహాన్ని ఒంటిమీదికి తెప్పించి సంగతంతా కనుక్కోవాలని, వెంటనే అష్టదిగ్బంధన చేయాలి. ఇందుకు మీకు పాతిక రూపాయలు ఖర్చవుతుంది." అని తన సంగతిని, తాను చేయవలసిన సంగతిని విశదీకరించి చెప్పాడు.

పుట్టింటికి వచ్చేటప్పుడు దివాకరరావు భార్యకు నచ్చ చెబుతూ "యశోదా! నీ ఆరోగ్య విషయం చాల జాగ్రత్తసుమా. మీ తండ్రిగారి కుండే డబ్బు యిబ్బంది నాకు తెలుసు. ఇక చికిత్సల కని, మందులకని ఎంతో బాధపడుతారు. అలాటి దేమీ లేకుండ ఈ మూడు వందలు నీవద్ద ఉంచుకో. కావలసి ఉంటే మళ్ళీ నాకు ఉత్తరం వ్రాయి. డబ్బు పంపుతా నని డబ్బిచ్చి పంపాడు.

ఆ సంగతిని గురించి బిడ్డ దారిలోనే చెప్పింది తండ్రితో. అందువల్ల వేంకట్రామయ్య ముందు వెనుక లాలోచించకుండ వీరబ్రహ్మం చెప్పిన దానికంతా 'సరే' అన్నాడు.

మంగళవారం సాయంకాలము ఒక గదిని ప్రత్యేకంగా అలికించి ముగ్గులు పెట్టించాలని, ఫలానా వస్తువులను తెప్పించాలని చెప్పి వెళ్ళి పోయాడు చికిత్సకుడు

ఊళ్లో ఎవరింటో యేమి సంగతా అని నిరంతరం అన్వేషించే అమ్మలక్కల చెవిలో పడిందీవార్త. ఇక ఊరంతా ఈ సంగతి వ్యాపిం

చేందు కట్టే ఎంతో కాలం పట్టలేదు. అయితే మ్యాత్ర మింగులో తప్పే ముంది అందరు యశోదను సానుభూతితో చూచారు "భగవంతుడేదో కలవారి యింటి కోడల్ని చేసినా, యీ ప్రారబ్ధ కర్మ ఒకటి గంటు పడింది కదా," అని విచారించారు.

మంగళవారం సాయంకాలము పూజకంతా సిద్ధము చేయబడింది. గ్రహాలకంతా భూతచికిత్సకుడు గురువులాంటి వాడు. అతడు వచ్చాడు తన పరికరాల్తో. కావలసిన వస్తువులన్ని సిద్ధపరచ బడ్డాయి. వీరబ్రహ్మ మేదో ముగ్గులాంటి చిత్రం గీచి, ఒక పీటవైచి, తల విరియబోసుకొని దానిమీద కూర్చోమన్నాడు యశోదను. ఇంటో సునంద, వేంకట్రామయ్యా కృష్ణమూర్తి తప్ప మరెవ్వరిని ఉండనీయ లేదు.

వీరబ్రహ్మం గ్రహాన్ని ఆవేశింప చేశాడు యసోద ఒంటిమీదికి. అప్పట్లో ఎన్ని వెకిలి చేష్టలు చేయాలో అన్నీ చేయసాగింది యశోద,

సుమా రొకగంటసేపు చికిత్సకునికి, గ్రహానికి సంభాషణ జరిగింది. చుట్టూ ఉన్న ముగ్గురు విస్తుపోయి చూస్తున్నారు. ఎంత అదలించి బెద రించినా గ్రహం "నేను పో"నంటుంది. వీరబ్రహ్మం తన వెంట తెచ్చు కున్న నిడుపాటి చింత బెత్తముతో ఒకమారు ఫఢేలుమని స్తంభాన్ని కొట్టాడు. యశోద....కాదు, ఆమె నావహించిన గ్రహం.... 'అబ్బా – చంపావురా, పాపీ' అని గావుకేక పెట్టింది, అట్లాతడు నాల్గు తన్నులు తన్నాడు. ఆ దెబ్బలన్నీ గ్రహానికే తగిలినాయి కాబోలు. కడకది "పోతారా బాబూ, నన్ను హింసించవద్దు." అనేసరికి వీరబ్రహ్మం వెంటనే అందుకు తగిన వాగ్దానాన్ని, లాంఛనాలను పుచ్చుకొని, గ్రహాన్ని వదలేశాడు. యశోద తెప్పరిల్లుకొని లేచి కూర్చొనింది. సునంద బిడ్డ దగ్గరకు వెళ్ళి పరామర్శిస్తూ కన్నీళ్ళు తుడుచుకొనింది.

గ్రహోచ్చాటన, అష్టదిగ్బంధన – యిత్యాది కార్యక్రమమంతా

ముగించి, అమ్మాయికి ఒక యంత్రం వ్రాసి కట్టి వీరబ్రహ్మం "అయ్యా గారూ। గ్రహం చాల గట్టిది. సామాన్య చికిత్సకులకు లొంగేది కాదు. చూచారుగా, ఎంతపని చేశానో? ఇంక అమ్మాయికి భయం లేదులెండి. పూర్తిగా వదలించి వేశాను. ఇక మీ చిత్తం, నా భాగ్యం" అన్నాడు.

వేంకట్రామయ్య మాటప్రకారం పాతిక రూపాయలు తాంబూలములో ఉంచి వీరబ్రహ్మానికిచ్చి, చెప్పవలసిన మాటలు చెప్పి, తమ కృతజ్ఞతను వెల్లడించుకొన్నాడు.

ఆ మరునాడే వేంకట్రామయ్య జరిగిన సంగతులన్నీ అల్లునికి వివరించి వ్రాస్తూ, ఉన్నంతలో తీరిక చూచుకొని కొన్నాళ్ళు రావలసిందని కోరాడు. నాటినుండి యశోద రుగ్మత అంతకంతకు తగ్గి, సంపూర్ణంగా ఆరోగ్యం స్థిరపడింది.

# 15

నాగభూషణం ఒంటివాడు. పిల్లాజెల్లా ఎవ్వరులేరు. మొదటి నుండి వానిది ముకుద్రాడు లేని ఎద్దు లాంటి జీవితం. చిన్నతనంలోనే తల్లిదండ్రి గతించిపోయారు. వారిని వీరిని ఆశ్రయించి బ్రతుకుతూ యౌవ్వన దశలో కాలెట్టే సరికి యేదో చిన్నగ వ్యాపారము ప్రారంభించి అదృష్టవశాత్తు కొంత కూడబెట్టుకో గలిగాడు. అంతటితో సుందరి అనే వారాంగనతో పొత్తు కుదిరి అది గాఢ ప్రేమగా మారిపోవడం, తాను సంపాదించినదంతా ఆమె చేతిలో బెట్టి ఆమె యింట్లోనే తినడం, ఉండడం సంభవించింది. లోకాని కిదంతా ఏం కావాలి? ఎవని పాడువానిది....

ఇంతకు మానాభిమానాలు, కర్తవ్యపనీర్తులు ఆసించేవారికి లోకాభిప్రాయం కావాలి కాని, ఎవని లక్ష్యము లేనివాని కెపరితో నేమి పని?

వారిద్దరికి ఒక కూతురు జనించింది. ఆమె పేరు కృష్ణ, తల్లికి లేని సౌందర్యం, తనూవిలాసం బిడ్డకిచ్చాడు దేవుడు. వయసొచ్చే కొలది కృష్ణ రూపము ఎంత విరాగికైన మరులుగొలిపే రకంగా తయారైంది, నీతినియమాలు లేని సుందరి, నాగభూషణం ఆమెను తీరా పడపు వృత్తిలో దించేందుకే నిశ్చయించుకొన్నారు. వారికి కావలసినది ఆర్జన. ఒక బంగారు పిచ్చుకను తగిలేస్తే ఒక ప్రధాన సంపాదనా మార్గ మేర్పడు తుందనుకొని సుందరి, నాగభూషణం బాగా ఆలోచించారు. సుందరి అసలే పడపుచాన. బిడ్డకు చిన్ననాటి నుండి యియ్యవలసిన శిక్షణ బాగా యిస్తూ వచ్చింది. కృష్ణ జగన్మోహిని అగుటే కాక, ముమ్ముందు తానను సరింపబోయే వృత్తిలో తల్లికంటే పదాకులు హెచ్చుగానే చదివింది కాగల దనిపించుకొనింది. దానికి తోడు భగవంతుడా కన్యకు బహుశ్రావ్యమైన కోకిల కంఠ మిచ్చాడు. అది గమనించి సుందరి సలహామీద నాగ భూషణం నాలుగైదేండ్లనుండి ఒక సంగీత విద్వాంసునితో, ఒక భరత నాట్యాచారునితో సంగీతము, భరత నాట్యము నేర్పించాడు. కృష్ణ అద్వితీయంగా తయారయింది. ఆమె విద్యాభివృద్ధిని, అప్సరసలాంటి అందాన్ని చూచి తల్లి, తండ్రి "కృష్ణను ఏ మహారాజైన కండ్ల కద్దుకొని తన దానిగా చేసుకో గలడు" అని ఏర్రవీగుతూ ఉంటారు.

గురువు లిద్దరు నాగభూషణానికి సలహా యిచ్చారు. "విద్యకు ప్రకాశముండాలి. మీ కూతురు సంగీతనాట్యశాస్త్రాల్లో అద్వితీయంగా తయారైంది. ప్రథమంగా ఒక కచేరి పెట్టించి చూడండి. ఆమె నేర్పును నలుపురు చూచి ఆనందించడమే కాక, మా శిష్యురాలింతటిదైయిందని మేము కూడ గర్విస్తాము, పైగా మీ కది మంచి ఆర్జన మార్గమవుతుంది".

ఆ మాట సుందరికి, నాగభూషణానికి వేదవాక్యమైంది. గురువుల సలహామీద ఒక శుభదినం రామాలయములో పాట కచేరీ ఏర్పాటు చేయించాలని నిశ్చయించుకొన్నారు. నాగభూషణం అందుకు తగిన ప్రకటన పత్రిక లచ్చు వేయించి ఊరంతా పంచి పెట్టేడు. మొదట కచేరి తమ ఊళ్ళోనే కావాలని వారి కోరిక.

నాగభూషణం వెళ్ళి రామమోహనునికి, దివాకరరావుకు పత్రికలిచ్చి ప్రత్యేకంగా ఆహ్వానించాడు.

రామమోహనుడు వెళ్ళలేదు. అతని కీలాంటి విషయాల్లో సరదా చల్లారిపోయింది. దివాకరరావు మాత్రం వెళ్ళాడు పాట కచేరికి.

అది యశోద ఊరికి వెళ్ళిపోయిన నాల్గవదినం. పాటకచ్చేరి సాయంకాలం ఐదింటి కారంభమౌతుందనగానే ఊళ్ళో ఉండే యువకులు యువతులు, అనేకమంది గుమిగూడినారు రామాలయంలో. కృష్ణ చాల అందకత్తె అని సింహాద్రి పురములో అందరికి తెలుసు. బంగారుకు పరిమళమబ్బినట్టు రూపానికి తోడు విద్యకూడ బాగా పట్టుబడి ఊళ్లో పురుష జాతికి సుందరి బిడ్డ కృష్ణ అంటే ఒకరీతి అభిమాన మేర్పడింది.

సభకు విచ్చేసిన పెద్దల నందరిని నాగభూషణం ప్రత్యేకించి ముందు వరుసలో కూర్చో బెట్టాడు. దివాకరరావంటే మరెంత గౌరవాభిమానాలు చూపసాగాడతడు. సభ్యులంతా చందన తాంబూలాలతో, సత్కరింప బడ్డారు. సరిగ ఐదింటికి హార్మోనియం, పిడేలు, తబల శృతికలుప బడినాయి. కృష్ణ రంగస్థలం ప్రవేశించింది.

కేవలం ప్రకటన కొరకు మేర్పాటు చేయబడిన మొదటి సభ కాబట్టి నాగభూషణం డబ్బు పుష్కలంగా ఖర్చుపెట్టి రంగస్థలాన్ని వివిధ వర్ణాల ఎలెక్ట్రిక్ బల్బులతో, తోరణాలతో చాలా ఆకర్షణీయంగా అలంకరింప జేశాడు.

కృష్ణ ఏదో అందమైందని అనుకొన్నవారంతా ఈ దినమా కామాస్త్రి సదృశురాలి ఆకార సోయగాలను చూచి ముగ్ధులై పోయారు.

ఆనాట్య భంగిమలు, సంగీతగమకాలు,ఒయ్యారితనము, సోయగము, చూచి అందరు తన్మయులయ్యారు.

రాత్రి ఎనిమిదింటిదాక కచ్చేరి జరిగింది, ఎవరియిండ్లకు వారు వెళ్ళిపోయారు. కాని, దివాకరరావును మాత్రం నాగభూషణం వదల కుండ ఎవేవో మాటల్లోకి దించి తిన్నగ తమయింటికే తోడ్కొని పోయ్యాడు,

నిజం చెప్పాలంటె, దివాకరరావు కారణంలేకుండ నాగభూషణాన్ని గంగిరెద్దువలె అలా అనుసరించిపోయేవాడు కాదు – .

కృష్ణ అతన్ని అన్నివిధాల ఆకర్షించింది. అతనిని ఆ మాయా వాగురులో చిక్కించుకొనేందుకే నాగభూషణమాతనిని తమ ఇంటికి తోడ్కొని వెళ్ళాడు,

దివాకరరా వెప్పుడు వారియింటికి వెళ్ళి ఎరుగడు, ఇంత రాత్రి వేళ – అందులో సంగీత కచేరీ ముగిసిన వెంటనే – ఆతడు నాగభూషణం యింటికి వెళ్ళుతూ ఉండడంచూచి కొంత ఆశ్చర్యపడని వారుకూడ లేక పోలేదు. అతనికికూడ కొంత ఎబ్బెట్టుగానే తోచింది. కాని మనసాతని అధీనములో లేదు. మరియొకమారు కృష్ణను చూడాలని, ఆమె మృదు మధుర వాక్కులను వినాలని కండ్లు, చెవులు అతన్ని మోసగించి అలా లాక్కుపోయాయి.

ఇంటికొచ్చిన ఘరానామనిషిని – అందులో తనకు వలసినప్పుడు ధనసహాయం చేసిన ఉపకారకర్తను – నాగభూషణం చాల వినయవిధేయలతో ఆదరించి ఒక సోఫాలో కూర్చుండబెట్టి, లోపలికెళ్ళి అడంగులతో గుస

గుసలాడి, కృష్ణతోనే ఒక వెండికప్పుతో కాఫీని పంపించాడు. "ఇదో, నా ప్రేమామృతమిది. తనివితీర గ్రోలండి" అన్నట్టు ఆ జవ్వని కాఫీ కప్పు నాతని ముందున్న బల్లమీద ఉంచి, తా నల్లంత దూరములో, హావ భావ హాసాంచిత ముఖ పద్మముతో చీర చెఱుగును వ్రేలికి చుట్టుకొంటూ నిలబడింది.

నాగభూషణం, సుందరికూడ వెలుపలికి వచ్చారు. "అయ్యగారూ, కాఫీ పుచ్చుకోండి" అని యిద్దరు బతిమాలారు. అట్టివారి యింట్లో కాఫీ పుచ్చుకోవడమంటె ఎఱుగని దివాకరరావు చేతులాతని అవశమైనమనసునకు లోబడి కప్పును నోటి కందిచ్చాయి.

"అమ్మాయి ఇన్నాళ్ళుగ నేర్చిన విద్య యీ దినం మీ లాంటి పెద్దలయెడ ప్రదర్శింపబడింది, ఏదో, యింకా చిన్నతనము. రంగ స్థలానుభవం తక్కువ." అని ఒకరీతి క్షమాపణరూపకమైన నాందీ ప్రస్తావనతో ఆరంభించారు సుందరి, నాగభూషణం.

"బలేబాగుంది, నాగభూషణం, మన సింహాద్రిపురానికే కీర్తి తెస్తుంది మీ కూతురు, ఏదైన సినిమాల్లో చేర్చే ప్రయత్నం చెయ్యకూడదా?"

"అవన్నీ యిప్పుడు గొంతెమ్మకోర్కెలు లెండి. ఇంతకు ఆ యదృష్టం పట్టాలంటె మీ లాంటి పెద్దలదయ ఉండాలికదా, బాబూ,"

"నిరంజన్ పిచ్చర్స్ డైరెక్టర్ కాంతారావు నాకు బాగా పరిచయస్థుడు. మాకు కొంత స్నేహంకూడ ఉంది. అతనితో మాట్లాడి చూద్దాములే "

"అబ్బో, ఆ మాత్రం మీ రనుగ్రహిస్తే యింక మాకేమి తక్కువ బాబూ. అమ్మాయి, ఆ జన్మాంతం మీకు ఋణస్థురాలై ఉంటుంది." అని సుందరి అన్నమాటకు భావార్థ సూచకంగా నాగభూషణం,

"కృష్ణా! అయ్యగారికి తాంబూలమివ్వు" అన్నాడు.

"ఎందుకులే నాగభూషణం, చాల ప్రొద్దుపొయ్యింది. ఇంట్లో తమ్ముడొక్కడే ఉన్నాడు. వెళ్ళాలి." అని దివాకరం లాంఛన మాత్రంగా అన్నాడే కాని, కాళ్ళు కదలకుండా ఉన్నాయి.

"ఇంట్లో అమ్మగారు – "

"నాల్గు దినాలైంది పుట్టింటికి వెళ్ళి."

"మోహన్ బాబుగారేల సభకు రాలేదో?"

"వానికీలోగా మనసేబాగులేదు నాగభూషణం. ఏదీ కొంబట్ట కుండా ఉంటాడు."

"మరీ – ఇప్పుడొంటి వాడయ్యాడు."

ఆ మాటలోని అంతరార్థం దివాకరరావు హృదయములో శూలంవలె గ్రుచ్చుకొనింది.

అంతలో ఒకవెండి పళ్లెములో లేత తమలపాకులు, ఘుమఘుమ లాడే వక్కపొడి, యాలకులు, జాజికాయ వగైరాలు తెచ్చి కృష్ణ అతని ముందుంచింది. ఆమె సమీపించినప్పుడు సోకిన పరిమళ పూరిత మగు పైరసోకుటచేత దివాకరరానికి గిలిగింతలు పెట్టినట్టయ్యింది.

"ఏమిటే, అమ్మాయి, తట్టముందు పెట్టితేతీరిందా?" అని తల్లి చేసిన కనుసన్నతో కృష్ణ దివాకరానికి కొంత సమీపములో నిలబడి, తనమృదువగు వ్రేళ్ళతో తమలపాకుల యీనలుతీసి, వక్కపొడినింపి, కొంత సుగంధ ద్రవ్యమును పూసి, సిగ్గు నభినయిస్తూ అందియ్యబోయిందాతనికి.

దివాకరానికి అరతిచేలో స్వర్గం కనబడినట్టయింది! కృష్ణచేతిలో నుండి తాంబూలాము లందుకొన్నది. దివాకరరావు శరీరమాపాద మస్తకం విద్యుత్తాదిత్త మైనట్టయ్యింది. ఆమెవైపు అదొకరీతిగా చూచాడు. కృష్ణ ముసిముసినవ్వుతో మూతి త్రిప్పుకొంది.

ఉదేసముగాన యింగితజ్ఞులైన నాగభూషణం, సుందరి యేదో ఉన్నట్టు బయటికొకరు, లోపలికొకరు వెళ్ళిపోయారు.

కృష్ణ దివాకరానికి సమీపములో నిలబడి ఉంది. అపురూపమైన ఆమె ముఖ సౌందర్యము సిగ్గు పెంపుతో గులాబీ చెక్కిళ్ళతో అతని మనో ద్రిక్తను మరింత వృద్ధిచేసింది.

"కృష్ణా! నీవు చాలావాగ పాడావు. నీ నటన మీద బలే అద్భుతంగా ఉంది. ఇంక నీ రూపలావణ్యాలు అమోఘమైనవి."

"అంతా అయ్యగారిదయ."

"ఒకరి దయమేమిటి? ఎంతటివారైన యికముందు నీదయ నార్జించాల్సిందే?"

"అంతమాటెందుకు? నేను మీలాంటివారి పాద దాసిని."

"దాసిమేమిటి, కృష్ణా! మహారాణి కాగలదానవు"

దివాకరరావు మనసు చిక్కబట్టకోలేక ఆమెచేయి పట్టుకొన్నాడు. "పురుష రాజ్యఘటంబు, పొలతి దానవహ్ని" అని పెద్దవారకే అన్నారా? ఆ సమయంలో దివాకరరావు తన్ను, తన అంతస్థును, కులగౌరవాలను, యశోదను - సమస్తం మరచిపోయాడు. కామాగ్నిలోన ప్రవేశించేంత వరకే అందరు పండితులు - వివేకులు.

కృష్ణమరింత సమీపాని కొచ్చింది. ఆ మరుక్షణమే అతనిబిగి కౌగిలిలో కరిగిపొయ్యింది, పుష్పబాణు డియువురిని అక్షాకలి బెట్టాడు. అంతలో నాగభూషణం చిన్నగా దగ్గేసరికి కృష్ణపైట సవరించుకొంటూ దూరమై నిలిచింది,

ఆనాటి కంతే - వా రిరువురి ప్రేమనాటకానికది నాంది, యశోద కుసుమకోమల హృదయానికది కుఠారము - ఆమె జీవితాన్ని కన్నీటి కాపురం చేసిన దుర్దినమది.

గడియారం పదికొట్టింది. దివాకరాన్ని ఎవరో హెచ్చరించి లేపి య్యింది, అప్పుడే లోపలికి వాచ్చిన నాగభూషణాన్ని చూచి అతడు నాగభూషణం! వెళ్ళివస్తా. చాల ప్రొద్దుపొయ్యింది." అన్నాడు లేచి నిలబడి.

"అమ్మాయి భవిష్యత్తు మీ చేతుల్లోఉంది" అని నసిగాడా జిత్తులమారి.

"దానికేం. చెప్పానుగా నా తలంపు, ఆలోచిద్దాం,"

"తాము అప్పుడప్పుడు వచ్చి పోతూఉండాలి,"

"సరే, దానికేం. వస్తా" నంటూ దివాకరరావు తన్నావేళ ఆ యింటినుండి పోయేది ఎవరు చూస్తారో అనే జంకుతో అటుయిటు చూచి వీధిని పడ్డాడు.

# 16

"ఇంతసేపు పాటకచేరీ జరిగిందా, అన్నయ్యా?"

"ఔనురా తమ్ముడు. బలేమజాగా పాడుతుంది, ఆడుతుంది కృష్ణ, నీవు రాకపోయావు, చూడ్డానికి నీకు ప్రాప్తిలేక పొయ్యింది."

"సరే. ఎవరిప్రాప్తి వారిది, భోజనానికిలే"

"నీవు భోజనం చేయలేదూ?"

"లేదు, నిన్నువిడిచి ముందుగా తిని నే చేసేదేముంది?"

"లేవమన్నానండి అబ్బాయిగారిని, అన్నయ్య రానీయమ్మా అన్నారు." అని రంగమ్మ సమర్థించింది మోహనుని భ్రాతృప్రేమను.

అన్నదమ్ములిద్దరు కూచొని భోజనం చేశారు. నడుమనడుమ సంగీత కచేరీ సంగతులను ఉత్ప్రేక్షించి అన్న చెబుతూవుంటే తమ్ముడు 'ఊ'కొట్టుతూ వచ్చాడు. తరువాత ఎవరిగదుల్లో వారు పడుకోబోయారు. రంగమ్మ తాను భోంచేసి, వంటయింటిని శుభ్రపరచి, లైట్లుతీసి పడుకొనింది. అప్పటికి పదకొండు కొట్టింది.

మరుసటి రోజునుండి దివాకరరావు దినచర్యలో గొప్ప మార్పే ర్పడింది. ఉదయం తోటకు వెళ్ళినవాడు పదకొండింటికి భోజనానికింటి కొచ్చి, కొంత విశ్రాంతి తీసికొని తోటకని వెళ్ళిన వాడు రాత్రి ఎనిమిది తొమ్మిదైనా యింటికిరాడు. తమ్మునితో నా నాటికి మాటలుకూడ తగ్గి పోతున్నాయి. ఏదైన అవసరమున్నప్పుడు అతనికి జవాబు చెప్పవలసి వచ్చినప్పుడు ముక్తసరిగా రెండుమాటలు చెప్పి వెళ్ళిపోతాడు. అన్న ఎందుకు మరల అలాగున్నాడో రామమోహనునికి అర్థంకావడంలేదు. యశోద సంగతే ఎత్తడు దివాకరరావు. ఆమె కేలాగుందో అనే ధ్యావంతమే కన బడదాతనిలో. ఆ సంగతి నెత్తేందుకు మోహనునికి భయం. తన్ను మరల ఎక్కడ అపార్థం చేసుకొంటాడో అని లోలోన విచారాన్ని అణచు కొంటూ వచ్చాడు. ఎప్పుడైనా రంగమ్మ యశోద ప్రస్తావన తెస్తే మోహన్ "నా ఎదుట ఆ సంగతేమి ఎత్తకమ్మా" అనేవాడు.

రంగమ్మద్వారా శంకరభట్టు యింటి ఆడంగులకు తెలిసిపోయ్యింది దివాకరరావులో కాన్పించే మార్పుసంగతి. భట్టు అడిగాడు మోహనుని. కాని, మోహన్ ఏమనిచెప్పగలడు? మధ్యాహ్నం తోటకని పోయినవాడంత దనుక అక్కడేమి చేస్తాడా అని రామమోహన్ నౌకర్లనడిగితే వారు "బాబూ, పెద్దయ్యగారు వారం రోజులనుండి మధ్యాహ్నం తోటకు రావడమే లేదు. మా పనులు మేము చేసుకపోతున్నాము" అన్నారు.

ఆ దినం అమావాస్య. రాత్రి ఎనిమిదిగంటలప్పుడు సోదరుని

రాక కెదురు చూస్తూ మోహన్ ఇంటివరండాలో ఒక పడకకుర్చీలో కూర్చొని ఏదో ఆలోచిస్తూ ఉంటే నడవలో రంగమ్మ కునికిపాట్లు పడుతూ వుంది.

వీధి దీపాలు కటికచీకటితో పోరాడుతున్నాయి. పైగా ఆకాశం మేఘాచ్ఛాదితమై పెద్దగా గాలివీచసాగింది. వీధిలో, ఇండ్లలో ఎలెక్ట్రిక్ దీపాలు ఉన్నవున్నట్టు శాంతమౌతూ, మళ్ళీవస్తూ, పోతూఉన్నాయి. రంగమ్మ రెండు కెరోసిన్ దీపాలువెలిగించి ఒకటి హాలులో, రెండవది బయట వసారాలో ఉంచింది.

మోహన్ టార్చిలైటు చేతబట్టుకొని వచ్చి మళ్ళీ కుర్చీలో కూచున్నాడు. మళ్ళీ లైట్లు ఆఫ్ అయిపోయాయి.

గేటువద్ద ఎవరో దబ్బున పడినట్టయింది - రామమోహన్ టార్చి లైటు వెలిగించి అటువైపు హడావుడిగా పరుగెత్తిపోయి చూచేసరికి ఆ దృశ్యాన్ని చూచి అతనిమనస్సు భగ్గుమనింది - .

పడినవాడు అన్న — .

మోహనుడు "అన్నయ్యా, అన్నయ్యా, దెబ్బతగిలిందా?" అని వచ్చి లేవనెత్త బోయేసరికి ముక్కుపుటములు పగిలేట్టు 'గుప్పు'న సారా వాసన కొట్టింది.

మోహనుడు నిర్ఘాంతపోయాడు. అన్నకు ఒంటిమీద ప్రజ్ఞలేదు. నిలువకుండ తూగుతున్నాడు. ఏమేమో తనలో తాను గొణుగుతున్నాడు.

మెల్లగా రంగమ్మ సహాయముతో రామమోహన్ అన్నను లోపలికి పిలుచుకొని పోయి అతనిగదిలో పరుండబెట్టినాడు అతడిందాక, త్రాగు

బోతుల కథలు విన్నాడేకాని, చూచి ఎఱుగడు. ఇప్పుడు స్వానుభవ మేర్పడింది - అదికూడ తన యింట్లోనే - తన సోదరుని మూలాన్నే - .

మోహన్ మాటమీద రంగమ్మ మెల్లగా పక్కయింటికి వెళ్లి శంకర భట్టును పిలుచుకొని వచ్చింది. అతడుకూడ కళ్ళారా చూచాడు దివాకర రావు ఉన్నస్థితిని. మోహనుని యీవలకు పిలిచి "మోహన్! వినాశ కాలే విపరీతబుద్ధి:" అన్నట్టు యీ యింటికేదో ముప్పువాటిల్లేట్టుంది. అందుకే మీ అన్న కిలాటి దుర్బుద్ధులు పుడుతూన్నాయి నీవు ఉండ వలసిన జాగ్రత్తలో ఉండాలిసుమా," అని హెచ్చరించి, అసహ్యించు కొంటూ వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి రంగమ్మ కాని, రామమోహన్ కాని భుజించ లేదు. ఇంట్లో పెద్ద వాడాస్థితిలో పడివుంటే వారికి భోజన మేలా ఒచిస్తుంది? రాత్రి మోహనునికి సరిగ నిద్ర కూడ లేదు. మాటి మాటికి గదిలోకి వచ్చి అన్న యేమి చేస్తున్నాడో చూచి పోతున్నాడు.

ఇంటి పరిస్థితులన్ని ఈ రీతిగా చుక్కెదురయ్యాయి. తరగతి అదో గతి అయ్యింది - పోనీ, అన్న వదిన అయినా సుఖంగా ఉన్నారా అంటే, ఆమె గతి అట్లుంది - ఇతని గతి యిట్టు పరిణమించసాగింది.

పాపము, తుదకు యశోద బ్రతుకు కన్నీటి కాపుర మయింది. ఇవన్ని తలచుకొని మోహనుడు చాల బెల్లిగ్గిపోయాడు.

ఇంటికి పెద్దవాడైన అన్న ఎవరిదో దుష్ట సహవాసములో పడి పతితుడై పోతున్నాడు. "భ్రష్టస్యకావాగతిః?" అన్నట్టు చెడిపోయేం దుకు ప్రారంభమైనవాని గతి తుదకెక్కడికి పోతుందో ఎవరు చెప్ప గలరు? తమదా - పేరుపొందిన సద్వంశము. తల్లిదండ్రులు మొదలగు పెద్దల పేళ్ళంటే ఆ ఊళ్ళోనే కాక, చుట్టుప్రక్కల ఎంతో గౌరవముంది

తులసివనములో గంజాయి మొక్క పుట్టింది - చెఱకు తుద వెన్ను పుట్టింది....

"అయ్యో! ఇకముందు యశోద గతి యేమి? ఆమెకీసంగతి తెలిసిందంటే ఆలేత హృదయ మేమౌతుందో? ఇంట రంభలాటి భార్య నుంచుకొని తుదకీ దౌర్భాగ్యున కీ బుద్ధి పుట్టవచ్చునా!" అని మోహన్ వదిన భవిష్యద్గతిని తలంచి తల్లడిల్లి పోయాడు.

తెల్లవారింది. దివాకరరావునకు తన రాత్రి చరిత్ర అంతా జ్ఞాపకానికి వచ్చింది. ఇంట్లో భార్య లేదు. తన చర్య విశృంఖలమై పోజొచ్చింది. దండించలేకు కాని, తన మీది గౌరవము కొద్ది, తమ్ముడు లోలోన బాధపడుతూ వుండడం స్పష్టంగా కనబడుతూ వుంది. పొరుగింటి భట్టు మొదలైనవారు తిరిగి చూడకున్నారు. తన్నప్పుడే అందరు వ్రేలెత్తి చూపుతున్నారు - అతడు కూడ ఆదినమంతా ఆలోచించుకొన్నాడు పూర్వాపరముల నన్నిటిని. భ్రష్టుడై పోతూవున్న తన సంగతి తన కర్థమైంది. లోకములో తనలాంటి వారి గతి యేమయ్యేది 'చూ - చా' యగ తెలుస్తూనే వుంది. అయినా -

అయిన, కృష్ణ యొక్క మోహన విగ్రహ మాతనిలోని వివేకాన్ని తల ఎత్త నివ్వటం లేదు. ఆ వెలది సహవాసము, తత్సుఖము లభించుట చేత తనవంటి అదృష్టవంతుడీ లోకములో ఉండబోడని దివాకరరావులో ఒకవైపు గర్వం కూడ కలిగింది. ఇక త్రాగడం మొదలైన దురభ్యాసాలలపడ్డాయనా - అగుగాక! తప్పేమి? అవన్నీ ఒకరీతి సుఖమార్గాలే - తన కెవరి లక్ష్యమెందుకు - తన దారి తనది - తన్నెవరు అడ్డగించేందుకు వీల్లేదు. తప్పని సరిగ కృష్ణను మద్రాసుకు తోడ్కొని వెళ్ళి ఒక సినిమా కంపెనీలో చేర్పిస్తయితే ఆమె లక్షలార్జిస్తుంది. అందు కిప్పుడొక పాతికో పరకో వేలు ఖర్చు పెట్టడంలో తప్పేముంది? ఆమె

ఏనాటికి – ఏస్థితిలో ఉన్నా – తన అధీనములోనే ఉండగలదు. ఇందాక అనాఘ్రాతమైన ఆ పుష్పసౌరభాన్ని అనుభవించే మహద్భాగ్యం తనకు లభించినది. అందరు యీసడించవచ్చును. అయితేనేం? లోకులు కాకులు. తమకు లభించినదాన్ని గురించే హేళనగా మాట్లాడడం జనుల లక్షణం. అబ్బా! యశోదకంటే కృష్ణ ఎన్నో రెట్లు అందమైంది. ఆమె దేవతా స్త్రీ యశోద మానవమాత్రురాలు – ఆమె కాలిగోటికైన యశోద బలాదూర్

దివాకరరావు పిచ్చి తలకెక్కి పోయింది. అది ఆతనిని ఎన్ని విధముల దారి తప్పించాలో అన్ని విధాలా భ్రష్టుణ్ని చేయసాగింది.

"అన్నా కలువలపల్లినుండి జాబు వచ్చింది."

"హూ – ఏమిటంట సంగతి?"

"వదిన ఆరోగ్యం కోల్కొంటూ ఉందట. గ్రహ చికిత్స చేయించారట...."

"సరే, సంతోషం."

"నిన్నొకమారు తప్పకుండ రమ్మని వ్రాశారు."

"ఇంక నేనెందుకు?"

"మీకొరకు వదిన మనసు ఆరాట పడుతూ వుందట."

"పాపం, నంగనాచి."

"అట్లనవద్దన్నా. ఆమె సంగతి నీకంతా తెలిసికూడ యిట్లన వచ్చునా? ఎప్పుడు వెళతావు కలువలపల్లికి?"

"నా కిప్పుడు వీల్లేదు. ఇక్కడ పనులు చాలా ఉన్నాయి."

"అవన్నీ నేను చూచుకొంటాగా?"

"నీవు చూచుకొనే పనులు కావు. ఇప్పుడు యశోదతో పనియేమి?

ఇంకా కొన్నాళ్ళక్కడే వుండి మందో మాకో తీసికొమ్మని ఉత్తరము వ్రాయి."

"నీవే వెళ్ళి. ఆమె స్థితిని చూచి, ఆ మాట అవసరమైతే నీవే చెప్పు."

"నేను పోయేందుకు వీలు లేదన్నాగా?"

"అట్లంటే ఎట్లు? ఆమె మరింత క్రుంగిపోతుంది."

"క్రుంగిపోదు, గ్రింగిపోదు. పోనీ నీవే పోయిరా."

"పోయిరావలసినవాడవు నీవు. నడుమ నేను పోవడము దేనికి?"

"ఎవరైతే నేమి?"

అన్నదమ్ములకు ప్రతి దినము యశోదను గురించి, సంసారమును గురించి ఈ రీతిగా మాటలు జరుగుతూవచ్చాయి. అయినా, దివాకర రావు తన చర్యను మాన లేదు. అది ఆలాపనలో నుండి రాగాన పడింది ...

"అన్నా నీ ప్రవర్తన ఎందు కిట్లా మారిపోయింది?"

దివాకరరావు కండ్లెర్రచేసి తమ్ముని చిరచిర చూచాడు.

"ఎట్ల మారిపోయింది? నన్ను దండిస్తావా?"

"అబ్బే, అది కాదు. దారి తప్పి తిరగడం మంచిది కాదంటున్నా."

"ఆ సంగతి చెప్పడానికి నీవెవ్వడు? నా మంచి చెడ్డలు నాకు తెలియదంటావా? వట్టి చవట పెద్దమ్మ, నీకేమి తెలుసురా జీవిత సుఖము."

అని దివాకరరావు ఈసడించుకొంటూ వెళ్ళిపోయాడు. వారం - నెల దాటిపోయింది. భర్తకై యశోద పరితపించిపోతూ వుంది. ఆమె

ఎంతో దీనంగా వ్రాస్తూ వుంది. కాని, అతని మనసు కరగలేదు. రామ మోహను దేమని ఈ సంగతులను గురించి వ్రాయగలడు? అయిన, వ్రాయక పోతే ఆమెకీ సంగతులు తెలిసే దెట్లా? తుదకతడు అన్న యొక్క విషయ మంతా వివరించి వ్రాస్తూ "వదినా, మీరింక ఆలసించకుండ ఇంటికి రాక పోతే పరిస్థితులింకా విషమించి పోవచ్చు" అని స్పష్టపరిచాడు.

మఱది నుంచి వచ్చిన ఉత్తరాన్ని చూచి, హృదయ విదారకంగా దుఃఖించింది యశోద. ఆమె తల్లిదండ్రులు అన్న చాల వ్యసన పడ్డారు. "ఇంక నీవు నీ యింటికి వెళ్ళమ్మా, యశోదా! నీ కాపురాన్ని నీ నేర్పు కొలది సరిదిద్దుకో తల్లీ! అన్నాడు వేంకట్రామయ్య."

"అయితే ఆ గ్రహ బాధ యింకమీద అమ్మాయి కుండదంటారా?" అని అడిగింది సునంద.

"ఏదీ, ఎక్కడుంది? నెల దాటిపోయింది. వీరబ్రహ్మం పూర్తిగ వదిలించి వేశానన్నాడుగా? మంచి మంత్రం కూడ వేశాడు."

"అమ్మా! నేను అభాగినిని. నన్ను నా కర్మకు వదిలెయ్యండి. ఈ పరిస్థితుల్లో నేనింక ఒక్క దినమైన యిక్కడుండను." అని యశోద తల్లిని, తండ్రిని నిర్బంధించి మగని యింటికి ప్రయాణమైంది.

వేంకట్రామయ్య కూతురును పిలుచుకొని వచ్చాడు సింహాద్రిపురానికి. వారిల్లు చేరేవేళకు దివాకరం యింట్లో లేడు. రామమోహన్ ఏదో చదువు కొంటూ తన గదిలో కూచొని వుంటే, రంగమ్మ వంట పనుల్లో వుంది. వదిన రావటం చూచి మోహన్ చాల సంతోషించాడు కాని, ఆ వెంటనే మనసులో విషాదచ్ఛాయ లలముకొన్నాయి. వేంకట్రామయ్యను గౌరవ పురస్సరంగా ఆహ్వానించి, ఆదరించాడు. తాను వెళ్ళిపోయిన నాటి నుంచి యింట్లో వంటమనిషి కుదుర్చుకొన్నందుకు యశోద చాల సంతోషించింది.

"ఇకమీద నీకీ యింట్లో ఒక ఆడు దిక్కు కూడ ఉందని ధైర్యంగా ఉండు తల్లీ!" అని రంగమ్మ యశోదకు ధైర్యము చెప్పింది.

భట్టు యింటివారంతా వచ్చి వేంకట్రామయ్యను, యశోదను పలుకరించారు. ఆమె ఆరోగ్యం కుదుటపడిందనేందు కామె దేహకాంతియే నిదర్శనం.

అదెందుకో యశోద మునుపటి కంటే యిప్పుడెంతో ఆకర్షణీయంగా గోచరించింది అందరికి. "అయ్యో! ఈలాంటి భార్యారత్న మింట వుంటే ఆమెను కాదని అన్న ముండలమారి అయ్యాడే" అని మోహన్ లోలోన చాల వ్యధ పడ్డాడు.

మధ్యాహ్నం పదకొండింటికి దివాకరరావు ఇంటికి వచ్చాడు. అంత త్వరగా భార్య రావడ మాతనికి కెంతమాత్ర మిష్టము లేదనే సంగతి ఆతని మాటలవల్ల స్పష్టమైంది.

"ఇంకా కొన్నాళ్ళుంచుకొని ఆరోగ్యం బాగుపరచుకొని పిలుచుకొని రాలేక పోయారా?" అని మామ నడిగాడు.

"ఇప్పుడు యశోదకు సంపూర్ణమైన ఆరోగ్యం లభించింది నాయనా! ఎన్ని ఉత్తరాలు వ్రాసిన నీవు రాలేక పోతివి. తుదకామె నిర్బంధమునకు తట్టుకోలేక పిలుచుకొని వచ్చాను."

"ఏమో, పాప మిక్కడ తనకంత వెలగ పెట్టేంత పని?"

అని దివాకరరావు యశోదను పలుకరించకుండ మేడమీదికి వెళ్ళి పోయాడు.

# 17

"ఎందుకైన మంచిది. మీ కుమార్తె నామె కర్మకు వదలిపోకుండ కొన్నాళ్ళపాటు మీరిక్కడే ఉండడం బాగు మామా." అన్నాడు మోహనుడు వేంకట్రామయ్యతో.

"కలువలపల్లిలో ఇంటివద్ద ఎట్లు?"

"కృష్ణమూర్తి ఉంటాడుగా? మీరప్పుడు పోయిరావచ్చు."

"మీ అన్న ఏమనుకొంటాడో?"

"ఆయన ఇంటిని గురించి, భార్యను గురించి, సంసారాన్ని గురించి ఏమైన అనుకొనేటట్టు ఉంటే మిమ్మల్ని ఉండమని కోరుతానా? అతనికివేవి కాబట్టకున్నాయి. ఎంతసేపు బయటి లోకమే."

"ఇట్లయితే ముందు గతేమి బాబూ?"

"భయపడకండి. నేనున్నానుగా అన్ని సరిదిద్దుకొనేందుకు."

భట్టు, ఆ యింటివారు కూడ రామమోహనుని కోరికను సమర్థించారు. అందుమీద వేంకట్రామయ్య కొడుక్కి ఉత్తరం వ్రాసి కొన్నాళ్లపాటు సింహాద్రిపురములోనే బిడ్డ వద్ద ఉండడానికి నిశ్చయించుకొన్నాడు.

దివాకరరావున కిదేమి సరిపడలేదు. మామ వెంటనే స్వగ్రామానికి తిరిగిపోతాడనుకొన్నాడు. కాని, ఆలా జరిగింది కాదు. ఇప్పుడతనికి భట్టు యింటివారి మీద కూడ అసహ్యమేసింది. తన్నెవరు కాదంటున్నారో వారంతా అతని దృష్టిలో తన కహితులు. తన చర్యలను సమర్థించే వారంతా హిత వర్గము. అందుకే యింటిలో తమ్ముడు, భార్య మొదలైన

వారంతా అహితులయ్యారతనికి. నాగభూషణం పరమ మిత్రుడు. వాని యిల్లే స్వర్గం. కృష్ణ సహవాసమే బ్రహ్మానందం.

యశోద యింటికి వచ్చి మూడు దినాలైన దివాకరరావు ఆమెను పలుకరించలేదు వీలు దొరికినప్పుడంతా భర్త పాదాలమీద పడి ప్రార్థిద్దామని పాపమా యిల్లాలు విశ్వప్రయత్నం చేసింది. కాని, అతడందు కవకాశమీయ లేదు. ఎప్పుడో తన కిష్టము వచ్చినప్పుడు వచ్చి "రంగమ్మా వడ్డించు" అని ఆమె వడ్డిస్తే తినిపోవటం తప్ప "నీగతిస్థితులే" మని యశోద నడుగ లేదు.

ఒకనాటి మధ్యాహ్నం రెండు గంటల కొచ్చాడు భోజనానికి. రంగమ్మ వడ్డిస్తూ వుంది. మేడమీది మోహనుడేదో పనిమీద ఉన్నాడు. వేంకట్రామయ్య ప్రక్క యింటికి వెళ్ళాడు.

యశోద మెల్లగ వెళ్ళి ప్రక్కన కూర్చొని రంగమ్మతో "అది వడ్డించు, ఇది వడ్డించు. మరింత నెయ్యివెయ్యి" అని ఉపచార వాక్యాలంటూవుంటే దివాకరరావు చీదరించుకొని "నీవు వచ్చి కూర్చొని చెప్పకపోతే పాపం రంగమ్మకు వడ్డించేరకమేమైన తెలుసా? పో — అవతలికి అని గట్టించాడు.

రంగమ్మ నోరు నొక్కుకొని మెల్లగా సైగ చేసింది యశోదకు వెళ్ళమ్మా" అని, యశోద బెదరి కొంత జరిగిందే కాని లేవలేదు.

"నీకేగా చెప్పేది? వెళ్ళిపోతావా? లేక భోజనం మాని పొమ్మంటావా?" అని లేవబోయే సరికి భోజనం విడిచిపోతాడేమో అని భయపడి కన్నీళ్ళు పెట్టుకొని యశోద వెళ్ళిపోయింది.

"పాడు ఏడుపుగొట్టు ఎప్పుడుమేద్పే" అని దివాకరం మరల భోజనం చేయసాగాడు.

భోజనం చేశాక దివాకరరావు "రామమోహనా!" అని పిలిచేసరికి తమ్ముడు "ఇదో వస్తున్నా" నంటు చిరచిర మేడదిగి వచ్చాడు. అన్న తన్నంత ఆప్యాయతతో పిలిచి నెల దాటిపోయింది. అంతటతోనే మోహనుడెంతో సంతోషించి "ఏమి?" అని అడిగాడు.

మోహనుని తన గదిలోకి పిలుచుకొని వెళ్ళాడు దివాకరరావు. తలుపు బంధింపబడింది.

లోపల ఏమి జరుగుతుందో చూడాలని సహజమైన కుతూహలముతో యశోద తలుపు వద్ద పొంచుండి జాగ్రత్తగా వినసాగింది.

తన్నా విధంగా పిలిచి, గదిలో తలుపులు మూసికొని అన్న యేమి మాట్లాడదలచాడా అని రామమోహన్ కొంత ఆశ్చర్య పడ్డాడు. అయిన, దురాలోచననేది శంకించ లేదు.

"మోహన్, మీ వదిన అంత త్వరగా వస్తుందనుకోలేదు. ఉత్తరాలకు కూడ జవాబు వ్రాయలేదుకదా, ఎందుకొచ్చింది?"

"అందుకే వచ్చింది. ఆమె వ్రాసిన ఉత్తరాలకు సమృత్తరమిచ్చి ఉంటే ఇంకా కొన్నాళ్ళు రాకుండ ఉండేదేమో. సరే, కాని ఇప్పుడొస్తే నష్టమేమి?"

"ఆ ప్రశ్న నీవడుగుతావని నాకు తెలుసు. చూడు, ఆమె మళ్ళీ వచ్చేలోగా ఈ యింటిని వేరేవారికి అద్దెకిచ్చి మనమింకొక ఇంటిని యేర్పాటుచేసుకొవాలని సలహా ఇచ్చింది నీవే కదూ?"

"అవును. ఆమె ఇంట్లో వున్నట్టయితే గ్రహంవల్ల ప్రమాద ముంటుందేమో అని అలాగన్నాను."

"ఇప్పుడా ప్రమాదం తప్పిపోయిందంటావా?"

"నాకాలాటివాటిలో అంత విశ్వాసం లేదన్నయ్యా."

"కావచ్చు. నేను నీలాగే ఉన్నవాణ్ణే. కాని, నాకెందుకో యిప్పు డిప్పుడు విశ్వాస మేర్పడుతూ వుంది."

"దానికి కారణం?"

"అది చెప్పలేను. ఎందుకైన మంచిది, నీ సలహాను పాటించేదే బాగనుకొంటా."

"మంచిది. నీ యిష్టము. మరి యింటి నెవరికిద్దాము?"

"ఎవరికైన మంచి వారికియ్యాలి. ఇంతకు ఎంత మంచివారైన వ్రాత కోతలుండొద్దూ మరి?"

"ఉండాలి."

"అందుకే నీ సంతకం, నా సంతకంతో ఒక అగ్రిమెంటు వ్రాసి యిస్తే, అద్దెకుండేవాడు మనకు ఒక అగ్రిమెంటు వ్రాసియిస్తాడు. రేపో ఎల్లుండో తగిన వారిని విచారిస్తా."

"అలాగే కాని."

"ఇదిగో యీ కాయితంమీద నా సంతక ముంచుతాను. నీవుకూడ సంతకం చెయ్యి, తరువాత తక్కిన పనులు నేను చూచుకొంటా" నంటూ దివాకరరావు టేబిల్ డ్రాయర్‌లో నుండి ఒక తెల్ల కాయితాన్ని తీసి, దాని కడుగున కొంత పైగా తన చేవ్రాలుంచి తమ్ముని కందిచ్చాడు.

రామమోహన్ కాయితం అందుకొని చేవ్రాలు పెట్టకుండ ఏదో ఆలోచిస్తూ ఉంటే చూచి "ఏమిటాలోచిస్తున్నావు? నా మాటలో నీకు నమ్మికలేదా మోహన్?" అని అడిగాడు దివాకరరావు.

"అబ్బే, అది కాదన్నా. అంతలోనే ఆలా అడుగుతా వెందుకు? మొదట అద్దెకు తీసుకొనేవాడుకదా వ్రాసియివ్వాలి అని ఆలోచిస్తూ ఉన్నా."

"ఎవరిస్తేనేమి మొదట? ఈ అగ్రిమెంట్లు యిచ్చిపుచ్చుకోవలసినవి కదా? నీ కిష్టముంటె సంతకముంచు. లేకపోతే—" అని దివాకరరావు తమ్ముని చేతిలోని కాగితం లాక్కొబోయాడు.

మోహన్ వెనుకకు తగ్గి కాగితంపై అన్న చేవ్రాలుక్రింద తానూ సంతకంపెట్టి యిస్తూ "ఇందా, మీ ఇష్టము." అన్నాడు.

"నా యిష్టమేమిటి? రెండు సంతకాలున్న తరువాత ఇది ఉభయుల యిష్టం కాకపోతుందా?

"సరే.కాని, నిన్నొక విషయం అడుగదలచాను. క్షమించి, మన సిచ్చి మాట్లాడుతావా అన్నయ్యా?"

"నీ వడిగే సంగతేమిటో నాకు తెలుసు, మోహన్, రేపు మధ్యాహ్నం తీరిగ్గా కూచొని మాట్లాడుకొందాం. సరేనా?"

"అలాగే."

ఇంక ఇద్దరు వెలుపలికి వస్తారేమో అని యశోద తటాలున ప్రక్క గదిలోకి తప్పుకొంది. ఆమెకు వారిద్దరు మాట్లాడుకొన్న ప్రతి మాట స్పష్టంగా వినబడింది.

వేంకట్రామయ్య యింకా పొరుగింటినుండి రాలేదు. అంతలోనే దివాకరరావు బయటికివెళ్ళిపోయాడు. రామమోహన్ వెళ్ళిపోతూవున్న అన్నతో ఒక్కమారు "నీవు కొంత పెందలకడనే రావాలి అన్నయ్యా." అన్నాడు. "అలాగే" అంటూ దివాకరరావు వెళ్ళిపోయాడు.

సాయంకాలము ఆరుగంటలైంది వేంకట్రామయ్య బిడ్డతో మాట్లా డుతూ హాలులో కూర్చొని ఉండగా రామమోహన్ కూడ అక్కడికి వచ్చాడు. యశోద "మోహన్" అని పిలిచింది.

"ఏమి, వదినా?" అని అతడు ఆమెను సమీపించాడు.

"అలా కూర్చో. నన్ను క్షమిస్తానంటె నిన్నొక సంగతి అడగాలని ఉంది."

"క్షమించడం దేనికి? అడగరాదా?"

"మొదట క్షమించానను"

"సరే_అలాగే."

"ఈ మధ్యాహ్నం మీ రన్నదమ్ములిద్దరు మాట్లాడుకొన్నది నా చెవినిబడింది."

"ఎవరు చెప్పారు నీతో?"

"గోడలకు చెవులుంటాయని నీవు వినలేదా?"

"అయితే, తలుపువద్ద పొంచుండి విన్నావన్నమాట."

"అందుకే క్షమించుమన్నాను. సాధారణ పరిస్థితుల్లో మీ రేమి మాట్లాడుకొన్నా నేను కుతూహలపడవలసిన అవసరంలేదు."

"నిజమే. తప్పేమిలేదు. గృహకృత్య విషయాల్లో మా కెంత బాధ్యతఉందో నీకూ అంతే ఉంది."

"మీ అన్న యేదో కాయితములో నీతో సంతకం పెట్టించుకొన్నాడే, అందులో ఏమైనా వ్రాసి ఉండినదా?"

"లేదు. వట్టి తెల్లకాయితం."

"అందులో నీవు సంతకం పెట్టవచ్చునా?"

"ఆయన మొదట పెట్టాడని పెట్టాను."

"రామమోహన్! నేను ఆడుదాన్ని. నీ వలె ఎక్కువ చదువుకోలేదు. లోకానుభవ మంతకూడలేదు. ఇందులో ఏదో మోసముందని నా అంతరాత్మ చెబుతూఉంది."

"అలాంటిదేమీ ఉండదనుకుంటా, వదినా! ఇంటిని అద్దెకిచ్చే విషయములో ఏదో అగ్రిమెంటు వ్రాసి ఇవ్వాలట."

యశోద తండ్రితో జరిగిన సంగతంతా చెప్పింది. దివాకరరావు ఇప్పుడున్న స్థితిలో అట్లా ఖాళీ కాయితంమీద తమ్మునితో చేవ్రాలు చేయించుకొనిపోయాడంటె వేంకట్రామయ్యకు కూడా యేదో అనుమానంతోచింది.

కొంత సంభాషణ జరిగాక రామమోహనుడు కూడా తానేదో పొరబాటు చేసినట్టు భావించసాగాడు.

క్రమంగా రాత్రి తొమ్మిది గంటలైంది. దివాకరరావు ఇంటికి రాలేదు. ఇది మామూలే అనుకొన్నారు యశోద, రామమోహన్ ఇంతవరకు అన్నమీది అభిమానంకొద్దీ అతడు వచ్చేవరకు తానూ భోజనంచేసేవాడుకాదు మోహన్. ఎంతకు రాకపోతే రాత్రి అకాలంలో భోజనంచేయలేక అప్పుడప్పుడు పస్తుపడుకొంటూ వచ్చాడు.

ఇటీవల మోహన్ పద్ధతి మార్చుకొన్నాడు. అన్న ప్రవర్తన బాగా అర్థమైపోయాక అతని కొరకు వేచివుండడు. ఊరినుండి వచ్చాక మూడు నాల్గు దినాలు యశోద కూడ యిట్టి దుస్థితినే అనుభవించింది. తండ్రి, మరది, శంకరభట్టు, అన్నపూర్ణమ్మ మొదలైనవారంతా చేరి "అసలే ఆరోగ్యంలేనిదానవు, వేళకు సరిగా భోజనంచెయ్యి"మని బోధించే సరికి ఆమెకూడ పెనిమిటి కొరకు ఎదురుచూడకుండా తండ్రి, మరది భోజనం చేస్తూనే తాను భోజనంచేస్తూ ఉంది.

ఇన్నాళ్ళుగా కొంత ఆలస్యమైనను రాత్రి దివాకరరావు ఇంటికి వచ్చేవాడు నేడు రాలేదు. తెల్లవారింది.

రామమోహన్, యశోద, వేంకట్రామయ్య చాలా అలజడిపాలయ్యారు. యశోదకు రాత్రంతా నిద్దురలేదు. ఎప్పుడు మగనిచింతే.

ఉదయం రామమోహన్ తోటకువెళ్ళి నౌకర్లను విచారించాడు అన్న సంగతి. తమకు తెలియదన్నారు వారు. ఊళ్ళో మామూలుగా దివాకర రావు వెళ్ళవచ్చే చోట్లకంతా వెళ్ళి భోగట్టా చేశాడు. ప్రయోజనంలేక పొయ్యింది. తుద కెవరితోనో నాగభూషణానికి కూడా చెప్పిపంపాడు దివాకరరావు సంగతేమిట అని. "నిన్న సాయంకాలము నుండి అతడు మా ఇంటికే రాలే"దన్నాడు జిత్తులమారి నాగభూషణం.

మరెక్కడికి పొయ్యినట్టు!

తిరిగి తిరిగి ఒంటిగంటకు మోహన్ ఇంటికి వచ్చేరాకనే పోస్టుమన్ గేటువద్ద కలిసికొని ఒక ఉత్తరం యిచ్చిపోయాడు.

దానిమీద అన్న చేతివ్రాత ఉంది. మోహన్ కవరుచించి లోపల ఉత్తరం చూచాడు. దాన్ని దివాకరరావు సింహాద్రిపురంనుండే వ్రాసినాడు. అందులో వెనుకదినం తారీఖు వేయబడింది. అందిట్లు వ్రాయబడింది....

"రామమోహన్!

ప్రేమసహజమై, యాదృచ్ఛికమైనప్పుడే పవిత్రమైనదగును. ఏదేని బాహ్య కారణముతో జనించిన ప్రేమ నిష్కల్మషము కాజాలదు. నీకును, యశోదకును నా వివాహమునకు ముందు కలిగిన ప్రేమ నిర్మలమైనది. కాని, విధివశముతో మీరు భగ్నప్రేమికులైతిరి. యశోద తన మనసున కయిష్టముగా నన్ను పెండ్లి చేసుకోవలసివచ్చెను. తరువాత ఆమె దానిని నిష్కలంకము కావించుకొనేందుకు ప్రయత్నించి ఉండవచ్చు. అయినా, అది బలవంత మాఘస్నానములాంటిది. నీ సంగతి కూడ అంతే. ఎంత నీవు యశోదను 'వదినా' అని పిలుస్తూ, గతాన్ని మరువ ప్రయత్నించినా, గడచిన గాథాస్మృతి మనసునుండి శాశ్వతముగ చెరిగిపోదు. నీవు పెండ్లి చేసికోనని పట్టినపట్టు, చదువును మానుటయందలి రహస్యము ఇత్యాదులే

ఇందుకు నిదర్శనము. వివాహమునకు ముందే నాకీ సంగతి తెలిసిఉంటే నే నెంతమాత్రము స్వార్థపరుడుకాకుండా మీ ఇద్దరిని ఒకటిచేసి ఉందును.

ఎంత మరచిపోదమన్నా నా హృదయములోని గాయము మాసిపోలేదు. అందువల్ల మీ ఇద్దరిని స్వేచ్ఛగా వదలి నాదారిని నేను వెళ్ళిపోతున్నాను. ఇంతటితో నాకు, మీకు గల ఋణానుబంధం తీరింది.

ఈ దినం నీతో కాయితంపై సంతకము పెట్టించినది ఇంటి అద్దె విషయమై అగ్రిమెంటు వ్రాయించేందుకుకాదు. మన ఇంటిని ఒకానొక ధనికునికి ముప్ఫైవేలకు విక్రయించి, అతనితో ఇరవై వేలు రూపాయలు పుచ్చుకొని, మిగిలిన సొమ్ము రిజష్టరు సమయములో నీ కిచ్చేట్టు ఖరారునామా వ్రాయించినాను. ఇందుకు నీసమ్మతి ముందుగా కావలసి ఉన్నందున నీ చేవ్రాలు పెట్టించుకొన్నాను. ఇంటిని కొన్నవాడు ఒక నెలలోగా తనకు దానిని స్వాధీనము చేయవలసినదిగా నీకు నోటీసు ఇవ్వగలడు. ఎదిరించి లాభములేదు. నీవు, యశోద త్వరలోనే వేరే ఇంటిని చూచుకోండి.

నే నిప్పుడేమి చేస్తున్నానో, తుదకేమైపోతానో నాకే తెలియదు. కాలప్రవాహములో కొట్టుకొనిపోతున్నాను. కడకేమైనాసరే జీవితము చెడుట కారంభించింది. సెలవు. మీ ఇరువురికి నా హృదయపూర్వకమైన ఆశీస్సులు.

ఇట్లు,
మీ అన్న,
దివాకరరావు."

# 18

ఆ ఉత్తరాన్ని చదువుతూ ఉండగానే రామమోహనుని శరీర మాద్యంతం ముచ్చెమటలుపోసి కన్నులు బైర్లు కమ్మినాయి. అతడున్న పాటున గేటున కానుకొని అట్లే కళ్ళు మూసికొని నిర్విణ్ణుడై నిలబడి పోయాడు.

లోపల హాలులో నుండి వేంకట్రామయ్య చూస్తూనే ఉండినాడు. పోస్టుమన్ రామమోహన్‌కు ఉత్తరం తెచ్చియిచ్చింది, అతడు చదువ సాగింది....

మోహన్ పరిస్థితిని గమనించి వేంకట్రామయ్య బిరబిర వచ్చాడతని దగ్గరకు. మోహన్ మాట్లాడలేదు. చేతిలోని జాబును మామకిచ్చి తిన్నగ పోయి వసారాలోని ఈజీఛైర్‌లో కూలబడ్డాడు.

అంతలో యశోద కూడ వచ్చిం దక్కడికి. ఈ హడావుడినంతా గమనించి "ఏమిటి, నాయనా? ఉత్తర మెక్కడిది?" అని తండ్రిని సమీపించి అడిగింది.

వేంకట్రామయ్య ఆమెను లోపలికి పిలుచుకొనివచ్చి ఉత్తరం చేతికిచ్చాడు. దాన్ని చదువుకొని "నాన్నా! నా కథ ముగిసింది" అని అరచి క్రిందపడి పొయ్యింది.

రామమోహన్, వేంకట్రామయ్య యశోద సేదతీర్చి కూర్చోపెట్టే లోగా యిదంతా చూచి రంగమ్మ పొరిగింటికి పారిపోయి భట్టును, అన్న పూర్ణమ్మను తోడ్తెచ్చింది.

యశోద తండ్రితొడమీద తలపెట్టుకొని "అయ్యో, నాదంతా కన్నీటి

కాపురమైపోయింది. నాన్నా!" అని పొంగివచ్చేదుఃఖాన్ని అ వలవల యేడ్వదొడగింది.

ఇతరులెంత ఉపశమింపజేస్తే మాత్ర మది అణగిపోతుంది? ఈ నవయవ్వన దశలోనే ఆమె పచ్చని కాపురం పాడైపొయ్యింది. దాని నిప్పును సరిదిద్దే శక్తి ఎవ్వరికుంది? ఎవరేమి చేయగలరు? పుష్పవనాన్ని కూడ వదలిందికాదుదావాగ్ని. ఆ మంటల సెగకు కోమలమైన పుష్పాలు ఆహుతి అయిపోయాయి. కాలానికి కరుణలేదు కాబోలు! అంతా ప్రారబ్ధకర్మ అని సరిపెట్టుకోవలసిందేనా? చెడ్డకు చెడ్డ, మంచికి మంచి ప్రకృతి ధర్మమైతే ఏ పాపమెరుగని అమాయకురాలగు యశోద కీదుస్థితి రానేల? దీనికి ఉత్తరమెవ్వరు చెప్పగలరు? ఇదంతా ఒక తీరని సమస్య....

రామమోహనుని దుఃఖము త్రిముఖంగా ఆవరించింది. అన్నిటికంటె భయంకరమైనది అన్న సంశయము. తాను, యశోద ఎంత నిష్కల్మష చిత్తముతో వర్తించుచుండినా ఫలితములేక పొయ్యింది. తమిద్దరిని అతడు పోతూ పోతూ కళంకితులనుచేసి పొయ్యాడు. తన పోకడ కదేకారణ మన్నాడు. వాస్తవికంగా, అది కారణంకాదని మోహన్ గ్రహించాడు, అన్న ఇటీవల కృష్ణ ప్రేమలోపడి, కామపిశాచావిష్టుడై, వారాంగన పొందుతో పొందవలసిన దుర్మార్గ లక్షణాలన్నిటిని పొంది, భార్య చేదై, సంసారమును వదలిపోతూ యీలాంటి నీలాపనిందను తనమీద, భార్యమీద వైచిపోయాడు. ఇంతకంటె ఘోరము — పాపము — ఉంటుందా.

ఇక వేంకట్రామయ్య బిడ్డ నూరడించగలడా?

ముందు దినము తనతో సంతకముపొంది తీసికొనివెళ్ళిన తెల్లకాయితమును అన్న ఈ రీతిగా దుర్వినియోగపరచడం మోహనున కెంతమాత్రము సహ్యము కాకున్నది. కాని, ఇప్పుడేమి చేయగలడు? అన్నమాట విని తాను మోసపోయాడు, సుమారు ఏబదివేలు చేసే అంత గొప్ప భవనాన్ని

వలకు తెగనమ్మి అందులో ఇరవై వేలు తానే తీసుకొని, తమ్ము ుకి నిండా అన్యాయము చేశాడు దివాకరరావు.

అసలతడిప్పు డెక్కడికి వెళ్లిపోయి ఉంటాడా అనేది వారిసమస్య ఒకవేళ విరక్తిచెంది సర్వసంగ పరిత్యాగియై వెళ్ళిఉంటే ఇంటినమ్మి ఇరవై వేల రూపాయలు మూటగట్టుకొని పోనవసరమేముంది?

దివాకరరావు కృష్ణప్రేమలోపడి అన్ని విధముల భ్రష్టుడయ్యాడని అందరికి తెలిసిపొయ్యింది. ఆ డబ్బంతా కృష్ణకే యిచ్చివేసి ఉంటాడా అని కూడా అనుమానించారు.

"మోహన్! మీ అన్న తప్పకుండ ఆ బోగంపిల్లవలలో పడిపోయాడోయ్. దాంతోనే లేచిపొయ్యి ఉంటాడు." అన్నాడు శంకరభట్టు.

"లేదు, మామా! నేను ఉదయం నాకు కావలసినవారిని పంపి విచారించాను నాగభూషణాన్ని మాఅన్న సంగతి గురించి."

"వాడేమన్నాడంట?"

"వానికి అన్నసంగతి యేమి తెలియదట. అసలతడు నిన్న సాయంకాలమునుండి తమ ఇంటికే రాలేదట."

"ఇదంతా నటన, మోహన్. ఇద్దరు కలిసి పగటిపూట ప్రయాణం చేసేందుకు జంకి మీ అన్న ముందుగా వెళ్ళిపోతూ, వెనుక ఆ పిల్లదాన్ని పిలుచుకొనిపొయ్యే యేర్పాటు చేసిఉంటాడని నా అనుమానం."

"ఆ పిల్ల ఇంట్లోనే ఉందట, ఆమె తల్లి, తండ్రి కూడ ఉన్నారు."

"అది నీవు విచారించినప్పటిమాట. రేపు వెళ్లి కనుక్కొంచూద్దాం నా మాట నిజమౌతుందోకాదో."

అని వారిట్లు మాట్లాడుకొంటూ ఉండగానే అన్నపూర్ణమ్మ "ఇటు చూడండి యశోధ గతి!" అని అందరి దృష్టిని యశోదవైపు మరల్చింది.

భర్త తమ్మంతా మోసగించి పలాయనుడై పోయాడని దుఃఖిస్తూ ఉన్న యశోద ఉన్నదున్నట్టు ఏడ్పుమానేసింది. కళ్ళు మూసుకొని ఏదో తనలో తాను నవ్వుకోసాగింది. అది చూచి అందరికి వెనుకటి సంఘటన జ్ఞాపకమునకురాగా భయముకలిగింది.

"వేంకట్రామయ్యా! ఏదో మంచి చికిత్స చేయించాను, మంత్రం వేయించానంటివే, మరల యిదేమి?" అని అడిగాడు శంకరభట్టు. వేంకట్రామయ్య కేమిచెప్పేందుకు నోరాడలేదు. బిడ్డ దురవస్థను తలచి అతని మనసు తరుక్కుపోతూంది.

మరల యశోదకు గ్రహప్రవేశ మయ్యిందని అందరు నిశ్చయించుకొన్నారు. అట్టి లక్షణాలు స్పష్టంగా కన్పిస్తూ ఉన్నాయి. మాట్లాడించుమని భట్టు భార్యతో చెప్పాడు.

"యశోదా! యశోదా!"

.... .... .... .... .... .... ....

"యశోదా! యశోదా!"

"ఎవరే యశోద?"

"మళ్లీ వచ్చావా, తల్లి!"

"రాక యేం చేస్తాను. ఈ యింట్లో ఉండొద్దన్నానుగా?"

"ఇప్పుడు దివాకరరావే ఎక్కడికో పరారి ఐపొయ్యాడు. నడుమ యీ అమాయకురాల నెందుకు పట్టిబాధిస్తావమ్మా."

.... .... .... .... .... .... .... ....

"చెప్పమ్మా, నీ కోర్కె యేమో తీరుస్తాము."

"కలువలపల్లిలో భూతవైద్యునితో వెళ్ళిపోతానని గుర్తులిచ్చి మళ్ళీ వచ్చావెందుకు?" అని వేంకట్రామయ్య అడిగాడు.

.... .... .... .... .... .... ....

"నీకు చెల్లెలు కావాలికదా, మాణిక్యం? ఎందుకు యశోదను బాధిస్తావు?"

"బా-ధ-లే-దు. ఇద్ద-రం-ఒ-క-దగ్గ-రుం-టాం."

"వద్దమ్మా ఆపని చేయకు."

భట్టు కొంచెము ఉగ్రుడయ్యాడు.

"వేంకట్రామయ్యా! ఆ భూతవైద్యుణ్ణి పిలిపించవయ్యా."

"పిలిపించని, నాకేమి భయమా?"

వేంకట్రామయ్యకూడ బెదరింపుమాటలే ఆడాడు, "కాని, చూద్దాం. ఎందుకు భయములేదో. మళ్ళీ నాల్గుచింతబర్రల దెబ్బలుపడితే తెలుస్తుంది."

గ్రహం నవ్వింది. అంతే-ఇంతలో యశోదకు హెచ్చరికవచ్చి పూర్వస్థితిని గురించి దుఃఖిపసాగింది. ఆ లేత వయసులో పెండ్లి జరిగి నది మొదలా తన్వి పడుతూవుండే కష్టాన్ని తలంచి భట్టు ఆతని కుటుం బము చాల బాధపడ్డారు.

"మామా, ఎటూ మాకీ ఇల్లు లేకపొయ్యింది. వెంటనే వేరేయింటిని యేర్పాటుచేసుకొంటే బాగుకదా?" అన్నాడు మోహన్ శంకరభట్టుతో.

"అదే సమంజస"మని అందరు తలంచినారు.

అన్నయేమో భార్య నాదుస్థితిలో వదలిపొయ్యాడు. రామమోహను డిప్పుడింకేమి చేయగలడు? ఒకవేళ యశోద ఆరోగ్యస్థితి..." ఉంటే, ఆమెకు తమ ఆస్తిలో కొంతభాగ మిచ్చి తండ్రివెంట పంపివేయాలనే అతడు తలం చాడు కాని, ఆమె దేహస్థితి, మనస్థితి యేమి బాగాలేదు. పైగా

# కన్నీటి కాపురం

"నేను కలువలపల్లి పోను, ఈ యిల్లు వదలిపోను. వ
నిరీక్షిస్తూ యీ యింట్లోనే ఉంటాను. వచ్చే కష్టమంత రానీగాక.
కంటె నాకు హెచ్చుగా కలిగే దుఃఖమేముంటుంది? చావా? చస్తే చస్తిని.
ఈ దుఃఖం తీరిపోతుంది." అని యశోద పట్టుపట్టి కూర్చుంది.

"వదినా, యీ యింటిని అన్నయ్య అమ్మివేశానని వ్రాశాడు కదా,
ఇంక మనకు దీనిపై హక్కు లేదుకదా,"

"అది నీవు చేసిన పొరపాటు, మోహన్ నేను నిన్నప్రొద్దున్నే
చెప్పలేదా యిందులో ఏదో మోసముందని?"

"అవునమ్మా, చెప్పితివి. అన్నయ్య యింటికి వచ్చాక అడిగి, అవ
సరమైతే తగవులాడి, కాయితాన్ని వాపసుతీసుకొవలెనని నిశ్చయించు
కొంటిని. కాని, తుద కతడు నన్ను, నిన్ను ఇట్లు మోసగిస్తాడని నేను
తలంచలేదు."

అందరు దీర్ఘాలోచనలోపడి ఐదునిముషాలు ఎవ్వరూ మాట్లాడలేదు.

"వేంకట్రామయ్యా! వెంటనే మీ గ్రామం వైద్యుణ్ణి పిలిపించు"
మని అన్నపూర్ణమ్మ మరల మరల చెప్పింది. వేంకట్రామయ్య వెంటనే
మోహన్‌వద్ద ఒక ఇన్‌లాండు కవరు నిప్పించుకొని, ఇక్కడ జరిగిన
యావద్వృత్తాంతాన్ని వివరించి కొడుక్కు జాబువ్రాస్తూ వీరబ్రహ్మాన్ని మరు
సటిదినం బస్సులో పంపవలసినదిగా తెలిపాడు. రామమోహన్ ఆ ఉత్త
రాన్ని అప్పుడే తమ ఇంటి కెదురుగా ఉన్న తపాలాపెట్టెలో వేసివచ్చాడు.

అందరు చెప్పారు రామమోహనునితో వేరే యింటిని తక్షణం
చూడుమని "అంతవరకు యశోద యీ యింట్లో ఉండవనిలేదు, మా
ఇంట్లో ఉండని. ఇక్కడ మోహన్, వేంకట్రామయ్య, రంగమ్మ ఉండ
వచ్చు"నని శంకరభట్టు తీర్మానించి, భార్యవెంట యశోదను తమ యింటికి
పంపివేశాడు.

## కన్నీటి కాపురం

కరభట్టు రామమోహనునితో చెప్పినసంగతి జోస్యమువలె యైంది. దివాకరరావు కృష్ణ ప్రేమలోపడి భార్యను, తమ్ముని, యింటిని, సమస్తము వదలి యిరవై వేల రూపాయలతో కృష్ణను పిలుచుకొని మద్రాసుకు వెళ్ళిపోయాడు.

ఊరినుండి కృష్ణను బహిరంగంగా తనవెంట పిలుచుకొని పొయ్యేందు కిష్టములేక, తాను ఉదయం రైలుకు వెళ్ళితే, ఆ దినం సాయంకాలము రైలుకు బిడ్డతోకూడ పలానాచోటికి వచ్చి తన్ను కలుసుకోవాలని చెప్పి, మూడువేల రూపాయలిచ్చి నాగభూషణాన్ని ఒడంబరచాడు.

నాగభూషణం ఆ యేర్పాటు మేరకు కృష్ణను పిలుచుకొని వెళ్ళి రేణిగుంట స్టేషనులో దివాకరరావు కామె నప్పగించి, ఇంకో ఐదువందలు తెచ్చుకొన్నాడు.

కృష్ణను మద్రాసులో ఉంచుకొని, ఆమెను క్రమముగా ఒక సినిమా తారగా తయారుచేయించి ఆ విధంగా సంపాదిస్తూ ఎదో స్వర్గలోకాన్ని అనుభవించాలని దివాకరరావు ఆశ.

ఇద్దరు మద్రాసు చేరారు. మాంబళంలో నెలకు డెబ్బైరూపాయల అద్దె కొకచిన్న యిల్లు కుదుర్చుకొని దివాకరరావు కృష్ణతో కాపురం ప్రారంభించాడు.

ఆ యువతీ యువకులు కాలగమనాన్ని గమనించేస్థితిలో లేరు. దివాకరరావుకు కృష్ణతోడిదేలోకం. అతని కింకేవిచారము లేదు. తన్నతదొక సినిమాతారగా తయారుచేయగలడని కృష్ణ చాల నమ్ముకొంది. అందుకు వలయు హంగులు, యోగ్యతలు వగైరాలన్ని ఆమెకున్నాయి.

ఒకనాడిరువురు సాయంకాలం పానుగల్ పార్కులో కూచొని అదేవిషయమై చాలసేపు మాట్లాడుకొన్నారు.

"మీ కెవ్వరో సినిమా డైరెక్టర్ స్నేహితుడున్నాడన్నారుగా?"

"అవును. రేపే వెళ్లి అతన్ని కలిసికొని మాట్లాడుతాను, ఒకవేళ అతడు నిన్ను సినిమాలో చేర్చుకుంటే?"

"అంతకంటె యింకేమికావాలి? మనకొట్టెనేతిలో పడ్డట్టేకదా?"

"అది సరేకాని, మనమప్పుడు యింత స్వేచ్ఛగా ఉండలేమేమో అని నా భయం, కృష్ణా!"

"ఎందుకుండలేము? అందు కడ్డంకు లేముంటాయి?"

"నీవు ప్రొద్దస్తమానం షూటింగులకు వెళ్ళిపోతే నేను ఒంటరిగా యింటివద్ద పడి ఉండాల్సిందేకదా?"

"అదాసంగతి. మరెట్లా చేయమంటారు? అవ్వాకావాలి. బువ్వా కావాలి అంటే ఎట్లా?"

"నా దగ్గర యింకా పదిహేనువేలుంది. డబ్బు కొరతలేదు. ఇంకా కొంతకాలమిట్లే స్వేచ్ఛగా సంచరిద్దామని నా కోరిక."

"ఏమండీ, కూర్చొనితింటే కొండలైన కరిగిపోతాయి. ఈ మహా నగరములో విచ్చలవిడిగా ఖర్చుచేస్తూవుంటే పదిహేనువేలు ఎంతకాలం వస్తుందని? దానికితోడు నేను సినిమాలో చేరి కొంత ఆర్జిస్తే మనము డబ్బు లోటులేకుండ ఒకవంక సుఖించవచ్చు. రెండవవంక పేరు ప్రతిష్ఠ లార్జించవచ్చు. ఏమంటారు?"

"నీ వన్నమాటకూడ నిజమే కృష్ణా! రేపే నా మిత్రుడైన నిరంజన్ పిక్చర్స్ డైరక్టరు కాంతారావును చూడబోదాము."

మరునటిదినం ఉదయం టి. నగర్‌లో ఉండే కాంతారావును చూడ్డానికి దివాకరరావొక్కడే ఒక టాక్సీలో వెళ్లిపోయాడు. మొదట మిత్రు

నితో మాట్లాడి అతని అభిప్రాయాన్ని కనుగొని కృష్ణను తోడ్కొని పోవాలని అతని తలంపు.

నిరంజన్ పిక్చర్స్ అనే సంస్థను కాంతారావు నాలుగేండ్లక్రితం స్థాపించి ఇప్పటికి ఏ డెనిమిది పిక్చర్స్‌తీసి, మంచి ప్రజ్ఞాశాలియైన డైరెక్టరనే పేరు పొందాడు మద్రాసులో. పుష్కలంగా డబ్బు గడించాడు. ఇటీవల అతడు ప్రొడ్యూస్ చేసిన "శకుంతల" అనే చిత్రము ఆంధ్రదేశ మంతట శతదినోత్సవాలు జరుపుకొనింది. మూడేండ్లక్రితం ఒకమారొక మిత్రుని యింట విజయవాడలో కాంతారావుకు, దివాకరానికి ప్రథమ పరిచయమై అది స్నేహంగా మారింది. తత్ఫలితంగా దివాకరరావు మిత్రునికి వ్యాపారం సాగేందుకు పాతికవేలు అప్పిచ్చాడు. ఆ మరుసటి సంవత్సమే కాంతారావు అదృష్టవశాన మూడులక్షలు నికరాదాయం సంపాదించి దివాకరరావు బాకీని యిచ్చివేశాడు. అప్పటినుండి వారిరువురు ఎప్పుడైన మద్రాసులో కలుసుకోవడం తటస్థిస్తూ ఉందేది.

కాంతారావిప్పుడు "సావిత్రి" పిక్చర్ తీయాలని సంకల్పించుకొని, క్రొత్త నటీనటులకై తంటాలుపడుతున్నాడు. ఆ దినము ఆదివారమగుట వలన కాంతారావు తీరిగ్గా ఇంటివద్దనే ఉండినాడు.

దివాకరరావు నతడు చాల స్నేహముతో ఆహ్వానించి, ఆదరించి, యోగక్షేమాలు విచారించాడు.

దివాకరరావు స్వవిషయాలేవి చెప్పకుండ తానొక అందమైన అమ్మాయిని సినిమాలో చేర్చాలని పిలుచుకొని వచ్చినట్లు మిత్రునితో చెప్పగా విని, కాంతారావు ఆమెను పిలుచుకొని రమ్మన్నాడు. అప్పుడే కారులో వెళ్లి దివాకరరావు కృష్ణతోకూడ తిరిగి వచ్చాడు.

కృష్ణ అన్నివిధముల తెరకు తగినదే అని కాంతారావు నిశ్చయించు కొని "దివాకరం! నేను యీసారి తీయదలచిన" సావిత్రి "పిక్చరులో

అర్ధ రు నూతన ముఖాలే ఉండాలని సంకల్పించుకొన్నా
పేచీలను తగ్గించుకొనేందుకేకాక, అర్హులైన క్రొత్తవారు పైకి
రవకాశమియ్యాలని కూడ నా నిశ్చయము. మీ కృష్ణ నా కన్ని
నచ్చింది. సావిత్రి పాత్రకు తగిఉంది. పోతే, తెరకు కొంత క్రొ
కావచ్చు. అయిన, భయములేదు. కొంత శిక్షణతో దారికి రాగలదు."

అని తన సమ్మతిని తెలిపిన కాంతారావు సద్భావానికి దివాకరరావు కృతజ్ఞత తెలుపుకొన్నాడు.

తరువాత క్రొత్తపిక్చరులో నటించేందుకు ప్రతిఫల రూపంగా కృష్ణకు పదివేల రూపాయలిస్తానన్నాడు కాంతరావు. దివాకరరావు అంచనా దాటిపొయ్యిందా ఫిగరు. వెంటనే అందుకు తగిన అగ్రిమెంటు వగైరాలను వ్రాయించుకొని, కాంతారావు అడ్వాన్సుక్రింద ఐదువేలు చెల్లించి కృష్ణతో రశీదు పొందాడు.

# 19

వేంకట్రామయ్య వ్రాసిన ఉత్తరంచూచాక, బదులు వ్రాయడాని కంటే సమక్షములో వెళ్ళడమే సమంజసమై తోచినందువల్ల కలువలపల్లిలో ఇంటికి తాళం వేసికొని సునంద, కృష్ణమూర్తి, ఆనందు సింహాద్రి పురానికి వచ్చేశారు.

యశోద దురవస్థనుచూచి తల్లి అనంతంగా కన్నీరు కార్చింది. అన్నపూర్ణమ్మ మొదలైనవారంతా ఎంతో ఊరడించారు కాని, ఆ తల్లి బిడ్డల హృదయాలు రెండు చింతాగ్నిచే దహించుకొని పోసాగినాయి.

# క న్నీ టి కా పు ర ం

...ందకు కన్నీటికాపురమయింది. భర్త నిరాదరణ చేయడమే ...ంచి, దుర్మార్గుడై ఎక్కడికో వెళ్లిపోయాడు. పైగా గ్రహ ...యశోద ఆరోగ్యం బాగా దెబ్బతినింది. ఆమె మంచంపట్టి ...ండంచూచి సునంద మగనితో యిట్లనింది "నేనిప్పుడీస్థితిలో అమ్మాయిని వదలి ఊరికిరాను. నా తల్లికింత ఆరోగ్యమయ్యాక తిన్నగ ఊరికే పిలుచుకొని పోదాము. ఈ లోగా మీరు అప్పుడప్పుడు వెళ్లి యింటివైపు చూచిరండి."

రామమోహన్ అత్తమాటనే సమర్థించాడు. వెంటనే ఊళ్లో సుప్రసిద్ధుడైన ఒక డాక్టరును, ఒక లేడీ డాక్టరును పిలుచుకొనివచ్చి వదినె దేహస్థితిని బాగా పరీక్షచేయించాడు. ఆమెకు దేహవ్యాధికంటె మనోవ్యాధే అధికంగా ఉన్నట్టు డాక్టర్లు ఇద్దరూ యేకాభిప్రాయ మిచ్చారు. అయినా మోహన్ మొదలైనవారి కోరికమీద చికిత్స ప్రారంభమైనది. తనకేరోగము లేదని, ఏ మందు వద్దని యశోద ఎంతచెప్పిన ఎవ్వరు వినిపించుకోలేదు. ఆమె డాక్టర్లు యిస్తూవచ్చిన మందులను సరిగా వాడడంలేదు. "కుక్కకాటుకు చెప్పుదెబ్బ" అన్నట్టు నా మనోరోగం సంగతి తెలిసికూడ మీరీ రీతిగ నన్ని పాడుమందులతో విసిగిస్తున్నారు. ఇది నా మనోరోగాన్ని మరింత వృద్ధిచేస్తుందేకాని అణచివేయలేదు." అని యశోద పట్టుపట్టి వైద్యుల రాకను నిరోధింపచేసింది.

చూస్తూ చూస్తూ ఉండగానే ఆమె చిక్కి శల్యము కాజొచ్చింది. నిద్రాహారములు రుచింపవు. ఎప్పుడు తల్లిదండ్రుల ఒడిలోపడి "నా నొసట ఎంత కౄరకర్మ వ్రాయబడింది. నేనింక బ్రతికి ఫలమేమి? నన్ను భగవంతుడు త్వరలో తీసికొనిపోతే యీ దుఃఖ జీవితం తీరిపోతుంది." అని శోకాకులితయై పిచ్చిదానివలె యేదో పలవరిస్తూ ఉంటుంది.

యశోద స్థితినిచూచి అందరు భయపడిపోయారు. ఆమె యిప్పుడు

మరదితో మాట్లాడడమే మానివేసింది. ఎప్పుడైన అతడు అందరుయెదుట వున్నప్పుడే "వదినా" అని నాల్గుసార్లు పిలిస్తే, యేదో ముభావంగా "ఊ" అని మూల్గి తల త్రిప్పుకొంటుంది. "అయ్యో! తుదకు వదినెకు కూడా కానివాడనై పోతినా!" అని మోహనుడు లోలోన కుమిలిపోతూ, అన్న సంగతి యేమైనా తెలుస్తుందేమో అని వారిని వీరిని అడుగుతూ వచ్చాడు.

తుద కందరికి నెల తరువాత తెలిసిపొయ్యింది. దివాకరరావు కృష్ణతో మద్రాసులో భూలోకస్వర్గ మనుభవిస్తూ ఉన్నాడని.

మోహన్ రెండుమార్లు ప్రయత్నించినాడు స్వయముగ మద్రాసుకు వెళ్ళి, అన్న కాళ్ళమీదపడి, ఇంటి సంగతులను, తన సంగతిని, వదిన సంగతిని తెలిపి, ప్రార్థించి, ఇంటికి తెచ్చే ప్రయత్నంచేద్దామని. కాని, అందరు చెప్పారు అది నిష్ప్రయోజక ప్రయత్నమని. ఒకనాడు యశోద కూడా మద్రాసుకువెళ్ళి భర్త పాదాలమీదపడి ప్రార్థిద్దామని తలంచింది. తల్లి, తండ్రి మొదలైన వారంతా ఆమెను నిరుత్సాహపరుస్తూ "వారకాంతప్రేమ ఆదిసుఖము, అంత్యదుఃఖాన్నిచ్చేదని ఏనాటికైన దివాకరరావు తప్పక గ్రహించి తీరుతాడు. అత డిప్పుడున్న స్థితిలో భార్యను కన్నెత్తి చూడక పోవడమేకాక కన్నకష్టాలు పెడతాడు" అని చెప్పారు.

"ఏమైన అగునాక. నన్ను చంపినా సంతోషమే, భర్తచేతిలో చావు యేసాధ్వికోకాని లభించదు. నేను మద్రాసులోనే ఉండి వీలైనంతవరకు ప్రయత్నించి నా మగనిని మరలించుకొనివస్తా" నని యశోద ఒకటే పట్టు పట్టింది.

అది చూచి వేంకట్రామయ్య మొదలైనవారు రామమోహనితో ఆలోచించారు. కడకు మోహనుడు వదినతో నిట్లన్నాడు. "నీ ఇష్టప్రకారమే మద్రాసుకు వెళ్లుదువుకాని, ఇంక పదిపదిహేనురోజులలో నీ ఆరోగ్యాన్ని కాపాడుకో వదినా! నేను స్వయముగవచ్చి అక్కడ తగిన యేర్పాట్లుచేసి

వస్తా. ఇందు కెంత డబ్బుఖర్చు అయినాసరే, నీకోర్కె ప్రకారమే జరుపు తాను. నీవు మీ తల్లి దండ్రులతో, కృష్ణమూర్తితో నీ కిష్టము వచ్చినంతకాల మక్కడ ఉండవచ్చును. నీ భర్తను మరలపొంది నీ యింటికి రాగలిగితే మా కంతకంటే ఆనందముంటుందా, వదినా," అని ఆమెను ఊరడించాడు. ఆ మాట నందరు బాగుందన్నారు. యశోద కూడ 'సరే' అని ఒప్పుకొనింది.

అవి భాద్రపదమాసములో కృష్ణపక్షదినాలు....పితృపక్షమని శంకర భట్టు యశోద మద్రాసు ప్రయాణాన్ని వాయిదా వేయించాడు.

* * *

అదృష్టవంతుల పనులకడ్డంకులే ఉండవు. కృష్ణను కొత్తగా 'బుక్' చేసికొన్న కాలమహిమ ఏలాంటిదో కాంతారావు తలపెట్టిన 'సావిత్రి' పిక్చర్ నాల్గు మాసములలో పూర్తి అయి, అద్భుత విజయంగా పరిణమించింది. ఆతని వ్యాపారమంతా మూడు పూవు లారు కాయలయ్యింది.

క్రమక్రమంగా కృష్ణ పేరంటే సినిమారంగంల్లో అదృష్టానికి జవాబు నికి సంకేతపదమైంది. మరియిద్దరు ముగ్గురు డైరెక్టర్లామెను తాము తీయ దలచిన పిక్చర్లలో 'కథానాయిక'గా తీసికొని పుష్కలంగా డబ్బుచెల్లించారు.

కృష్ణ సినిమాతారగా సుప్రసిద్ధురాలైంది. ఆమె తలిదండ్రులను మద్రాసుకు రప్పించుకొని టి. నగరులో ప్రత్యేకంగా ఒక మేడ అద్దెకు తీసికొని అందులో దివాకరరావుతో కూడ కాపురంచేయసాగింది.

ఇప్పుడతడు నాగభూషణం, సుందరి కోర్కెమీద కృష్ణకు నెలకు ఐదు వందల రూపాయలియ్యసాగాడు. ఇంతవరకు అట్టి యేర్పాటేది లేకుండ ఉభయుల ఖర్చులను తానే పెట్టుకుంటూ ఉండేవాడు. అదైనా

నెలకు మూడు వందలకుమించి ఉండేదికాదు. ఇప్పుడంటేనో కృష్ణ కొద్ది మాసాలలోనే సుప్రసిద్ధురాలైన సినిమా తారయై, సుమారు ఏబదివేలు రొక్కం ఆర్జించింది. అప్పటి కామె వెల ఎంతో అధికమైనట్టేకదా! అందువల్ల ఆమె పొందునుకోరే పక్షంలో దివాకరరావు ప్రత్యేకంగా ఆమె కొఱకు ప్రతినెల ఐదువంద లియ్యక తప్పలేదు.

ఆరంభంలో కృష్ణప్రేమలోపడిన దివాకరరావున కిప్పుడామె నిజముగ ఒక అప్సరసగా కన్పించసాగింది. అట్టి అపురూప సుందరి సాహచర్యమంటె అందరికి లభ్యమౌతుందా? అందుకే దివాకరరావు కిక్కురుమనకుండా నాగభూషణం చేసిన యేర్పాటున కంగీకరించాడు.

అతనివద్ద మిగిలి ఉండిన పదిహేనువేల రూపాయలు నెలలు గడచే కొలది హారతి కర్పూరమువలె హరించుకపోసాగింది. అయిన, అతడందుకు భయపడకుండ తన పేరిట బ్యాంకులో ఉండిన డబ్బులో ఎప్పటికప్పుడు కావలసినంత తెప్పించుకుంటూ, కృష్ణకిచ్చే ఐదు వందలేకాక, ప్రతినెల తన ఖర్చులక్రింద, ఇతర ఖర్చులక్రింద మొత్తము ఎనిమిది వందలు పాడుచేస్తున్నాడు.

మద్రాసుకువచ్చిన మూడుమాసాల్లోనే దివాకరరావుతో నేస్తమప్పుడే కృష్ణకు మొగము మొత్తినట్లయ్యింది. అతనికంటె రెండు మూడేండ్లు చిన్నవాడు, అందకాడు, విద్యావంతుడు, ధనికుడు అయిన కాంతారావామె నిప్పుడు పూలలో ఉంచి పూజిస్తూ ఉన్నాడు. వారియిద్దరి మధ్య రహస్య ప్రేమ కలాపాలుకూడ ఆరంభమయ్యాయి, అది ప్రారంభదశలో రహస్యమే అయిన, రానురాను బహిరంగ రహస్యము కాజొచ్చింది. ఒక్కొక్కనాడు షూటింగునకని వెళ్ళిన కృష్ణ ఆ దినమంతా యింటికేరాదు. ఎందుకురాలేదో చూతమని దివాకరరావు స్టూడియోకు వెళ్ళినా, కాంతారావు యింటికివెళ్ళినా వారిద్దరు కన్పించనే కన్పించరు. ఔట్‌డోర్ షూటింగ్ నెపముతో కృష్ణ, కాంతారావు తమ ఇష్టము వచ్చినట్లు తిరగ మొదలెట్టారు. కాంతారావు

ఆమె కొరకు పదిహేను వేలిచ్చి ఒక సెకండుహాండ్ 'అంబాసిడర్' కారు కూడా కొనిచ్చినాడు.

ఈ సంగతులన్నీ నాగభూషణానికి, సుందరమ్మకు తెలియకుండ జరిగేవి కావు. అసలు వారి మద్దత్తుతోనే కృష్ణ క్రమక్రమంగా ప్రతి దినం దివాకరరావు దృష్టిలో తన వెలను పెంచుకొంటూ, ఆతని కంత కంతకు దూరము కాజొచ్చింది.

తానేమో కృష్ణకు ప్రతి నెల ఐదువంద లర్పించక తప్ప కుంది దివాకరానికి. కాని, కృష్ణపై అధికారము నానాటికి సన్నగిల్లిపోతూ ఇప్పుడు తానే ఆమెకు జంకేస్థితికి రావలిసివచ్చిందాతనికి, ఆమె సరిగ యింటి పట్టున ఉండదు. ఎప్పుడు కారులో తిరుగుతూ ఉంటుంది. రంకు నేర్చినాక బొంకు కష్టమౌతుందా?

వాస్తవస్థితిలో ఆమె యింత అభివృద్ధికి రాగలిగిందంటే అందుకు తానే ముఖ్యకారకుడు. అందుపై తన కామె ఆజన్మాంతము కృతజ్ఞురాలై ఉండాల్సిందే. కాని....

కాని, వెలయాలేమి.... కృతజ్ఞత యేమి.... రెంటికి చుక్కెదురని దివాకరరావున కింకా అర్థమైపట్టు లేదు.

ఇంత సుప్రసిద్ధురాలై, వలదన్నా డబ్బు వేలకు వేలు వచ్చి తన పాదాల కడ పడుతూ వుంటే, మద్రాసులాంటి మహనగరములో కాంతా రావులాంటి సినిమాడైరెక్టర్-ప్రొడ్యూసరు తన కనుసన్నలలో మెలగుతూ ఉన్నాడంటే – కృష్ణయింకా దివాకరరావులాంటి పల్లెటూరి గబ్బిలాయి నంటి పెట్టుకొని ఉండాల్సిన అవసర మేమొచ్చింది?

ఒకనాడు నాగభూషణం, సుందరి వెళ్ళారు కృష్ణతో కాంతారావు యింటి కాతని అభ్యర్థన మీద.

ఆ దినం నలుగురు చేరి సంగతులన్ని ముచ్చటించుకొన్న పిదప కృష్ణను కాంతారావు రిజిష్టర్డ్ మేరేజి చేసుకొనేందుకు సమ్మతించాడు....

అయితే, ఆ సంగతి నింకా ఒకటి రెండు నెలలు రహస్యంగానే ఉంచి, ఆలోగా దివాకరరావుతో ఎంత వీలయితే అంత డబ్బు లాగెయ్యాలని నాగభూషణం, కృష్ణా ప్లాను వన్నినారు.

గ్రుడ్డి ప్రేమలో పడిన దివాకరరావింక, సావిత్రి వేషం వేసే కృష్ణ 'సావిత్రి' లాంటి మహా పతివ్రతగానే ఉండి తన కధీనమై యున్నదని భ్రమపడిపోతున్నాడు. ఆ ప్రేమాంధకారములో ఆతనిని కృష్ణ బాగా ముంచి వేసింది.

• • •

దివాకరరావు తాను తమ్మునికి వ్రాసిన ఉత్తరం ప్రకారము ముప్ఫై వేలకు వారి యింటిని కొన్న యశశ్చంద్రలాల్ అనే మార్వాడీ రామమోహనునికి నోటీసు నిచ్చి, మిగతా రొక్కం పదివేలు చెల్లించి, యింటిని స్వాధీన పరచుకొన్నాడు.

ఆ కుటుంబానికి పట్టిన దురవస్థను చూచి సింహాద్రిపురములో ఆబాల వృద్ధులు కటకట పడిపోయారు.

ప్రతి ఒక్కరు యశోదను గురించి కంట తడి పెట్టేవారే. రామమోహనుని 'ఆదర్శసోదరు'ని క్రింద స్తుతించారు. దివాకరరావు బుద్ధిహీనత ప్రతి యొక్కరికి ఊళ్ళో ఒక ప్రత్యక్ష తార్కాణమైంది. ఇక నాగభూషణం కృష్ణ, సుందరి — సంగతులను గురించి చెప్పేదేముంది? ఆ బోగము జాతి తన నైజాని కనుగుణ్యంగానే వర్తించిందన్నా రందరు.

రామమోహన్ రామాలయం వీధిలో — శంకరభట్టు గారి యింటికి అల్లంత దూరమునందే — ఒక అనుకూలమైన ఇంటి నొకదాన్ని అద్దెకు

కుదుర్చుకొని వదినెను, అత్తమామ గార్లను ఆ యింటికి మార్చి, తమ సమస్త వస్త్ర సామగ్రిని అందుచేర్చాడు. కృష్ణమూర్తికూడ యిప్పుడు చాలవరకు సింహాద్రి పురములోనే ఉంటూ వచ్చాడు. వేంకట్రామయ్య అప్పుడప్పుడు కలువలపల్లికి పోయి వస్తూఉండాలని మోహనుని యేర్పాటు, ఈ మధ్య ఆనందు చదువు పాడుకారాదని సింహాద్రిపురం హైస్కూలులోనే జేర్చాడు మోహన్. ఆనందు యిప్పుడు మూడవఫారం.

మనోరోగానికి మందులేదు కదా! - .

యశోద దేహస్థితి నానాటికి క్షీణదశలోనుంది. డాక్టర్లు 'క్షయ' అని పేరుపెట్టారు. మదనపల్లి శానిటోరియంలో చేర్చాలని రామ మోహన్‌కు సలహాయిచ్చారు. కాని, యశోద "నేనీఊరు విడిచి మరెక్కడికి పోను. నా ఆశ వదలుకొనే మీ కిష్టమైన చికిత్సలు చేయించండి. నేనింక జీవించనని నాకు బాగా తెలుసు, అసలు జీవించవలెననే ఆశ నాకు లేనేలేదు. ఎవరికొరకు - ఎందుకొరకు - జీవించాలి? నాకీ భూఋణమెంతకాల ముంటుందో అంతకాలం జీవించి ఉండకతప్పదు. త్వరలో మరణించినట్టయితే నాకీ నరకయాతన తప్పుతుంది. నా కోర్కె ఒక్కటే. నన్ను ప్రశాంతంగా, నా భర్తను స్మరించుకొంటూ, స్వగ్రామములో - స్వక్షేత్రములో - స్వజనము ఎదుట ప్రాణాలు వదలనియ్యండి. మీ కందరికి చేతులెత్తి మ్రొక్కుతా. ఇది నా ఆఖరు కోరిక" అని తన నిశ్చితాభిప్రాయాన్ని వెల్లడించి, కేవలం నిస్పృహతో, రానున్న మృత్యు దేవత కెదురు చూడసాగింది.

తుద కందరికి అనిపించింది యీ దుఃఖ మనుభవిస్తూ నరకయాతన పడేందుకంటె శాశ్వతంగా కళ్ళుమూసేదే మేలని - .

అయిన రామమోహనునకు వదినెమీద కల అభిమానము, గౌరవ భావము - యీషదపి తగ్గలేదు. ఆమె నేలాగైన మృత్యుముఖమునుండి తప్పించాలని డబ్బును మంచినీళ్ళ ప్రాయంగా ఖర్చుచేస్తూ వచ్చాడు.

# 20

యశోద జీవితమెట్లు కన్నీటి కాపురమైపొయ్యిందో, రామ మోహనుని జీవితముకూడ అట్లే సహారాఎడారివలె నిస్సారమై నిరాశా విచారాలతో నిండిపొయ్యింది – .

అతడింకా ఆ ఊళ్ళో ఉన్నాడంటే – అదంతా వదినకొరకనే చెప్పాల్సొస్తుంది. ఆమె జీవితము సంశయావస్థలో ఉంది. ఆ సంగతిని బహిరంగంగా ఎవ్వరు చెప్పలేకపోయిన, అందరి మనసులో గోచర మౌతూవుంది,

ఆమె మనసులో అంతకంత కేదో ఒకరీతి ప్రశాంతత జనించి ముఖంలో ద్యోతకమౌతూవుంది, దానికి కారణం – ఈ దుఃఖభారంతో అనిర్దిష్టమైన జీవితభారాన్ని యింకా ఎన్నేండ్లు మోయాలో అనేభయము లేకుండ, ఆ కష్టస్థితి యింక కొన్నాళ్ళలోనే ముగియనున్నదనే సంతోషమే కావచ్చు,

అంతకంటే విభిన్న కారణమేది ఆమెకీలోకములో మనశ్శాంతి నియ్యగలిగింది లేదు. భర్త పశ్చాత్తాపతప్తుడై, భార్యపైనెనముకలిగి యింటికివచ్చి ప్రేమానురాగాలతో ఏలుకోగలుగుతాడనే ఆశ కేనాడో సమాధి కల్పించబడింది.

తానెంత నిష్కల్మష ప్రవర్తన కలదైన, మరది ఎంత పాపభీతి కలవాడైన ఉట్టిలేకనే ఊగే లోకమికముందు, తమపూర్వచరిత్ర నాధార పరచుకొని, చిలువలు పలువలు పన్ని కథలు కల్పిస్తుంది.

ఉత్తమ ప్రాణిజీవించవలసింది – జీవించేది – అకళంకమైన కీర్తి

కొరకే. ఇది అసాధ్యమై, తనజీవిత మపకీర్తిపాలయ్యేందుకు ముందు మరణమే ఆ ప్రాణికి శరణ్యము.

లోకములో దుఃఖాన్ని కోరే వారెవ్వరు ఉండరు. ఎంతటివారైన దాన్ని నిరోధింప యత్నిస్తారు. కాని, సుఖ దుఃఖ వినిమయ పద్ధతి ప్రాణుల చేతులలోనున్న దవడంవల్ల. అది హేతువాదమేకాని హేత్వాభాసము. ఈ ప్రపంచములో జనించిన ఎంతటివారైనను ప్రారబ్ధ కర్మననుభవించక తప్పదు. ప్రయత్నపూర్వకముగ కర్మనుండి తప్పించుకో గలిగిన యుగయుగాలనాటి ఒకరిద్దరు వ్యక్తుల పేర్ల నుదాహరించి, పురుష ప్రయత్నముతో కర్మఫలాన్ని తప్పించుకోవచ్చుననే సామాన్యసూత్రాన్ని వంచించేందుకంటే పొరబాటుండదు.

రామమోహనుడు వదినెను ప్రార్థించి "వదినా, పుట్టినవారికి చావు తప్పదనే ప్రకృతి సత్యమందరికి తెలిసిందే. కాని, మానవులాశాజీవులు. ప్రయత్నించినట్టయితే కానున్న మహాపదనుండి తప్పించుకొనగలమేమో అనే ఆశ ఎంతటివారికి ఉండకతప్పదు. ఈ స్థితిలో నీవు మందుమాకులను తీసికోకుండ 'మరణిస్తే చాలు' నని కూచుంటే అది ఆత్మహత్యకు సమాన మౌతుంది. కాబట్టి, మనయత్నం మనము చేస్తూఉండాలి - మీద దైవ కృప - మన అదృష్టం. ఈ వేళ బెంగుళూరునుండి ఒక సమర్థుడైన వైద్యుడు రాబోతున్నాడు. అతన్ని కొన్నాళ్ళిక్కడే ఉంచి నీకు చికిత్స చేయించాలని నిశ్చయించుకొన్నాను. నీ కొఱకు కాకపోతే నీ తల్లి దండ్రుల కొఱకు, నిన్ను ప్రేమించే అన్నదమ్ములకొఱకు, తల్లి ఐతే లేక పోయింది - దేవతలాంటి వదిన అయినా లభించింది. ఆమెయే నా తల్లి అని సంతృప్తిపడే యీ అభాగ్యుని కొరకు - నీవు చికిత్సను పొంది తీరాలి" అని ఒప్పించాడు.

# కన్నీటి కాపురం

సునంద, వేంకట్రామయ్యా. కృష్ణమూర్తి కూడ అతని మాటలను సమర్థించి యశోదతో ఊకొట్టించారు. చికిత్స ఆరంభింపబడింది.

భర్త తన్ను పరిత్యజించి వెళ్ళిపోయిన నాటినుండి యశోద రామమోహనితో అంత చనువుగా మాట్లాడుతూ ఉండలేదు. కారణం - అతని మీద అసహ్యముకాదు. లోకాపవాదానికి భయపడి కొంత మనస్సంకోచమొందిందామె. కాని, రామమోహనుడామె ఆరోగ్యవిషయమై కాతర పడుట మానుకోలేదు. ఆమె నపార్థము చేసికోలేదు. కేవలం, నిష్కల్మషమైన చిత్తముతో ఆమెను పునరారోగ్య భాగ్యముతో అనుగ్రహించి, తానీసారి శాశ్వతంగా వారికి కనుమరుగు కావాలని నిశ్చయించుకొన్నాడు.

తన హ్రస్వదృష్టికి కొన్నాళ్ళతరువాత యశోద తన్ను తానే నిందించుకొన్నది. మోహనుడు తన్ను నిర్మలమైన మాతృప్రేమతో చూడడ మామె గ్రహించి, తాను లోకానికి జంకి, ఆ అమాయకునికి కష్టమనిపించినందుకు పశ్చాత్తాపపడి, తన వైఖరిని మార్చుకొనింది.

ఆ యిరువురిలో జనించిన యీ అంత్య పరిణామాన్ని, వారికొండొరుల ఎడ కల పవిత్రహృదయాలను, వారి మనోనిగ్రహాన్నిచూచి, వారు తమ మనోదౌర్బల్యకారణంగా కుటుంబములో ఎప్పుడెట్టి కష్టాలపాలౌతారో అని సందేహించిన సునంద, వేంకట్రామయ్యా, కృష్ణమూర్తి చాలా ఆశ్చర్య పడ్డారు. వారి పవిత్రాంతః కరణాలను గుర్తించి సంతోషించారు.

వారనుకొన్నట్టు యశోద కన్నీటి కాపురానికి దివాకరరావు యొక్క మనో దౌర్బల్యము, అజ్ఞత కారణమయ్యాయేకాని వేరుకాదు ఒకవేళ ఆమె అన్నను చేపట్టేందుకు మారుగ తమ్ముని చేపట్టిఉంటే ఆమె జీవితము ఆనందమయమై ఉండేది. కాని, ప్రారబ్ధ కర్మ నెవరు తప్పించగలరు?

సింహాద్రిపురములో రామమోహనుని కత్యంత విశ్వాసపాత్రుడైన ప్రభాకరశాస్త్రి స్థానిక హైస్కూలులో ఒక ఉపాధ్యాయుడు. అతని దాపూరే.

# కన్నీటి కాపురం

ఎన్నైనా డిద్దరు కొన్నియేండ్లపాటు ఒకే తరగతిలో చదువుకొన్నవారు. శాస్త్రి తరుచు రామమోహనుని కలుసుకొంటూ ఉండేవాడు. ఇటీవల.... అనగా, దివాకరరావు వెళ్లిపోయిన నాటినుండి....రామమోహనుడు మిత్రునితో చాల సన్నిహితత్వం కల్పించుకొని, ఒకనాడు తమ కుటుంబచరిత్ర సంతా విశదీకరించి చెప్పి, తన దుస్థితికి చాల వగచినాడు శాస్త్రి యెదుట. శాస్త్రి మూనాళ్ళ క్రిందట మోహన్‌తో యిట్లు చెప్పాడు.

"మోహన్, నీకు నాయందు విశ్వాసముంటే నన్ను మద్రాసు పంపు. నేను కొంతకాల మక్కడనే ఉండి, మీ అన్న పరిస్థితుల నన్నిటిని గమనిస్తూ ఎప్పటికప్పుడు నీకు ఉత్తరాలు వ్రాస్తూ, అవసరమైన ఇతర పనులు కూడ చేస్తూవుంటాను."

మిత్రుని సలహా మోహన్‌కు చాల బాగా నచ్చింది. ఈ సందర్భములో తమకా మాత్రం తోడ్పడగల వ్యక్తి లభించడం శుభసూచకంగా భావించి "శాస్త్రీ, మేమిద్దరమే అన్నదమ్ముల మనుకొని ఉంటిని. ఇప్పుడు నీతో మేము ముగ్గురమయ్యాము, వెంటనే నీవు మద్రాసుకు వెళ్లి, నీకు అవసరమని తోచినంతకాల మక్కడేఉండి, ఎలాగైనా మా అన్న మనసు మార్చి అత డింటికివచ్చి మర్యాదగా ఉండేట్టుచేయాలిసుమా. నీ ఖర్చుల కెంత డబ్బైనా యిస్తా." నని ఆ మరుదినమే మోహనుడు శాస్త్రితో ఒక నెల సెలవుపెట్టించి, వేయి రూపాయలు యిచ్చి మద్రాసుకు పంపినాడు.

అంతకుముందు మూడు నాల్గు పర్యాయములు శాస్త్రి మద్రాసుకు పోయి వచ్చిన వాడైనందుచేత అతనికాపట్టణము సుపరిచితంగానే ఉంది. అతడెప్పుడక్కడికి వెళ్ళి నారాయణపురం హిందూ మోడరన్ హోటల్లో దిగేవాడు.

ఈసారి కూడ శాస్త్రి అక్కడికే వెళ్ళి రూము నెం. 25 లో బస చేసినాడు, మద్రాసుకు ప్రయాణమై వెళ్ళేముందతడు నాగభూషణం

కూతురు కృష్ణ, నిరంజన్ పిక్చర్స్‌లో హీరోయిన్‌గా నటిస్తూఉందని అనేక ఫిల్మ్ పత్రికలద్వారా తెలిసికొన్నాడు. సింహాద్రిపురములో అందరికి యీ సంగతి తెలుసు. ఆమెకాలాంటి ఉచ్చదశ ప్రాప్తించేందుకు దివాకరరావే కారణమని కూడ అనేకమందికి తెలుసు.

ముందుగానే అప్పుడప్పుడు మద్రాసుకుపోయి వచ్చేవారివల్ల, కృష్ణ త్యాగరాయనగర్‌లో ఒక పెద్దమేడలో ఉందని శాస్త్రి తెలిసికొన్నాడు. సిటీ చేరిన పిదప పది గంటలకెల్లా భోజనంచేసి శాస్త్రి ప్రతిదినం టి. నగర్ బస్సులో వెళ్లి కృష్ణ కాపురముండే యింటిని మొదట కనిపెట్ట గలిగాడు.

లక్ష్మి ప్రభావం కలిగాక తిప్పమీదివారు ఉప్పరిగలో సుఖించుటొక వింతకాదు. అందులో రూపము, యవ్వనమూ, విద్య, విన్నాణము ఉండే కృష్ణలాంటి పడుచుపిల్ల సినిమాతారగా అనతికాలములోనే ఉచ్చస్థాయిని చేరుకొనిందంటే అదంతా యీ కాలములో ఆలాంటివారికి కాలం ప్రసాదించిన మహోన్నతమైన అవకాశం. సింహాద్రిపురములో, చాలీచాలని కొంపలో, సానజాతికి, బోడిగుండ్లకు గంటువేసి తండ్రి సంపాదించే సంపాదనతో యేదో అతిసామాన్యురాలుగా పెరిగి పెద్దదైన కృష్ణ యిప్పుడు వేలకువేలు సంపాదిస్తూంది – ఒక చక్కని మేడలో సుఖపడుతూంది, కాంపౌండులో మంచి పూలతోట – పోర్టికోలో అంబాసిడర్ కారు – గేటువద్ద ఒక ఘూర్కా – అంతా అదృష్టమహిమ కాకపోతే ఆశిస్తే మాత్రమందరికి లభిస్తుందా యీ సుఖం?

శాస్త్రి దినానికి మూడు నాల్గుసార్లు కృష్ణ మేడముందే పారాడాడు కాని, అతనికి దివాకరరావు కాని, నాగభూషణం కాని కనబడలేదు.

ఒకవారం గడిచింది. ఆవేళ ఆదివారం. శాస్త్రి ఉదయం పది గంటలప్పుడా యింటిముందు వెళుతూవుంటే అకస్మాత్తుగా ఇంటిలోకి వెడుతున్న దివాకరరావతని కంటపడినాడు. మ్రొక్కబోయిన దేవుడెదు

రైనట్టు శాస్త్రి పరమానందమొంది "నమస్కారమండీ, దివాకరరావుగారూ" అన్నాడాతనిని చూచి.

మద్రాసులో - సింహాద్రిపురము వాడొక్కడావేళ తనకు ప్రత్యక్ష మయ్యాడంటే - దివాకరానికి కొంత ఆశ్చర్యమే కలిగింది. శాస్త్రి అతనికి సుపరిచితుడే.

ప్రతి నమస్కారంచేసి అతడు "ఏమిటయ్యా శాస్త్రీ, చాలాదూరం వచ్చావే?" అని ప్రశ్నించాడు,

"ఇప్పుడొక నెలనుండి యీ పట్టణంలోనే ఉన్నానండి."

"సింహాద్రిపురంలో ఉద్యోగం మానేశావా?"

"ఎంత ఎదిగిన గొఱ్ఱెకు, తోకబెత్తెడే అన్నట్టు ఎన్నాళ్ళు ఉద్యోగ మేడ్చినా పొట్టకూటికే చాలదు. అందులో అయ్యవారి ఉద్యోగం - "

"అయితే దాన్ని వదలేశావా?"

"ఆ - ఒక మిత్రునితో చేరి యేదో పబ్లిషింగ్ వ్యాపారం ప్రారంభించాను. ఇప్పుడే వూళ్ళో "సినీలోకం" అనే మాసపత్రికను ప్రచురిస్తున్నానండి."

"బలే మంచిపనిచేశావయ్యా. బస ఎక్కడ?"

"రాయపురం హిందూమోడరన్ హోటల్లో రూం నెం. 25."

"సరే ఎప్పుడైనా కలుసుకొంటాలే. వస్తా." నని. దివాకరరావు. హుటాహుటిగా ఇంటిలోకి వెళ్లిపోయాడు. మరేమి మాట్లాడేందుకు శాస్త్రి కవకాశం దొరకలేదు. అతడామరుదినమే తాను దివాకరరావును కలిసికొన్న సన్నివేశాన్ని గురించి రామమోహన్‌కు వ్రాస్తూ, ఆశాజనకంగా వాగ్దానాలు చేశాడు.

దివాకరరావుమీద, కృష్ణకు వైమనస్కత జనించిన సూచనలప్పుడే వ్యక్తము కాజొచ్చినాయి. నాగభూషణం బిడ్డకు మద్దతునిస్తూ వచ్చాడు. "విటుని జారకామిని ఆరంభదశలో పూలమాలవలె ధరించి, కాలాంతరమున తనస్థితి బాగుపడగానే కాలిక్రింది చెప్పునువలె చూడాలి" అనేవారకాంతా ప్రథమ విలాస సూత్రాన్ని సుందరి బిడ్డకు చక్కగానేర్పింది." వెలయాలికెప్పుడు నాలుక తీపులోన విషయముండాలి" అని ఉపదేశించింది ద్వితీయ సూత్రమన్నట్లు.

వారున్నమేడలో దివాకరరావు పై అంతస్తులోను, క్రింది అంతస్తులో నాగభూషణం దంపతులు, కృష్ణ నివస్తున్నారు. ఇప్పటి కొక్కవారము దినములనుండి అతనికి కృష్ణ పగలంతా కనబడడమే కష్టమైంది. అతడు ఎప్పుడు పిలిచినా క్రిందినుండి నాగభూషణం "షూటింగుకు వెళ్లిందనో, డైరెక్టర్ పిలువనంపితే పోయిందనో, ఎవరో మిత్రులు వస్తే వారివెంట పోయిందనో" జవాబు చెప్పుతూ వచ్చాడు. ఈ వారములో నాల్గు దినములు దివాకరరావు రాత్రిపూట ఒంటరిగానే నిద్రించాడు.

శాస్త్రిని చూచినదినం సాయంకాలము దివాకరరావు ఒంటరిగా కూర్చొని వార్తాపత్రిక చదువుకొంటూ ఉంటే కృష్ణవచ్చి ఒక కుర్చీమీద కూర్చొంది. ఆమెమీది కోపముతో చూచీచూడనట్లు పేపరు మరుగున గ్రుడ్లురుముతూ అతడు మాట్లాడించలేదు.

పదినిమిషాల సేపెవ్వరు మాట్లాడలేదు. తుదకు ఆమెమే మాట్లాడింది.

"ఏమిటంత కోపంగాఉన్నారు? ఎవరిమీద?"

"ఎవరిమీదెందుకు? నా మీదే."

"ఏం తప్పుచేశారని?"

దివాకరరావు మాట్లాడలేదు. కృష్ణ అతనిచేతిలోని పేపరు అవ్వలి కీడ్చివైచి, మరింత సమీపంగా కుర్చీని లాక్కొని సవిలాసంగా నవ్వుతూ అతని భుజముమీద రెండుచేతులు వేసింది.

"ఈవేళ యేమిటీసరదా?" అని కోపంగానే అడిగాడు దివాకరరావు.

"ఎప్పటిలాగే యీ వేళ. ఇందులో విశేషమేముంది?"

"ఉంది! ఏదో విశేషం. లేకపోతే మూడురోజులనుండి నీ విటు తిరిగి చూచావా?"

"తప్పంతా నాదేఅన్నట్టు మాట్లాడుతారే. విరామంలేని యీ వృత్తిలోకి దించి నా సరదా మీ సరదాకూడ పాడుచేశారు."

"అందుకే కాబోలు యీ దినం సినిమారంగంలో కృష్ణ అంటే ఇంత గొప్పఖ్యాతి, పుష్కలంగా డబ్బు సంపాదించావు. ఇంక నా వంటి వాడునీ కంటికి కనబడతాడా? ఏరుదాటి తెప్పకాల్చడ మీలాంటిదే కదూ?"

"ఏమండీ, నేనేమంత చేయరానిపని చేశానని నన్నాడిప్పిస్తారు? మిమ్మల్ని నేనెప్పుడు కాదనలేదే?"

అని కృష్ణ కళ్ళల్లోనీళ్ళు కార్చింది. ఎంతటి కఠినహృదయుడైన వెంటనే జితుడైపొయ్యేందుకు సృష్టికర్త స్త్రీ జాతికి సహజంగా అమర్చిన బ్రహ్మాస్త్ర మీ కన్నీళ్ళు,

దివాకరరావు తనచేతులు రెంటితో కృష్ణను సమీపానికి లాక్కొని, బుగ్గలు సవరిస్తూ "కృష్ణా! నిజంగా విరామంలేక నన్ని మూన్నాళ్ళనుండి మాట్లాడించలేదంటావా?" అన్నాడు.

"కాకపోతే మరేముంది" అని ఆ వయ్యారి కన్నులొత్తుకుంది.

"సరేకాని, యీ వేళటి షూటింగు విశేషాలేమి?"

"రావణ శాపకథలో రంభా రావణ సంవాదఘట్టము కొంత జరిగింది."

"బలేమజాగా ఉంటుందికదూ యీ ఘట్టం. రంభగా నీ విందులో అద్వితీయంగా నటించిఉంటావులే."

"అంతా మీదయ" అని కృష్ణ ఆతని వక్షస్థలముపై వ్రాలి పొయ్యింది.

అంతలో మెట్లమీద నాగభూషణం వస్తూవున్నట్లు దగ్గడంవినబడింది. ఇద్దఱు కొంత ఎడముగా కూర్చున్నారు. అనుకొన్నట్టు సుందరీ నాగభూషణం యిద్దరు వచ్చి అచ్చట కుర్చీల్లో కూచున్నారు.

ఆ రసవత్తర ఘట్టములో వారిరాక దివాకరానికెంత అసహ్యంగా ఉండాలో అతనికంత అసహ్యం కలిగించడమే కాక, "ఈ ముసలినక్క లెందుకొచ్చాయో," అనే సందేహంఃాడ కలిగింది.

నాగభూషణం వచ్చి కూచొని సరాసరి బిడ్డను చూచి "అమ్మాయ్! అయ్యగారితో చెప్పావా ఆమాట?" అన్నాడు.

అదేమిమాటో తెలియక కొంతరిచ్చపాటుతో దివాకరరావు తక్కిన ముగ్గురి మొగాలవంక మార్చిమార్చి చూచాడు.

"పో నాన్నా! నన్నెపుడు యీలాంటి పనులకే పురమాయిస్తావు. నీవే చెప్పరాదా? నడుమ నా పెత్తనమెందుకు?" అని నసిగాడింది కృష్ణ.

తండ్రిబిడ్డల అభిప్రాయమేమిటో పాలుపోక దివాకరరావు కొంత ఉద్విగ్నుడయ్యాడు. కృష్ణ తటాలున క్రిందికి వెళ్లిపొయ్యింది.

"ఏమిలేదు, బాబూ. అమ్మాయిమీతో ఒకసంగతి చెప్పడానికి సంకోచిస్తూంది. చెప్పుచెప్పుమని ఒక వారంరోజులనుండి మమ్మల్ని నతాయిస్తూ వుంది."

"ఏమిటాసంగతి అని అడుగుతున్నా, నాగభూషణం! చల్లకువచ్చి ముంత దాచనేల?"

"ఇందులో మా ప్రశక్తి యేమిలేదు, బాబూ! అంతా అమ్మాయిదే మాట."

"ఎవరిదైతేనేమి, మొదట ఆ మాటేమిటో చెప్పరాదా? అదేదైన నాకు తెలుసు, నాగభూషణం, కర్త నీవు, కర్మ నీ బిడ్డ."

"ఈ కర్మ మరీబాగుంది, బాబూ, నడుమ నేనేమి చేశానని నన్ను నిందిస్తారు?"

"ఎవరిని నిందించడం లేదులే. అసలు సంగతేమిటో చెప్పు చూద్దాం."

"చూద్దాం గీద్దాం ఏమిటి లేదండీ, బాబూ! ముందు నెల నుండి మీరు అమ్మాయికి ప్రతినెల వెయ్యి రూపాయలివ్వాలంట. ఐదువందలు చాలదంట. మీయిష్టం చెప్పుమనింది, చెప్పాను."

"ఇదంతా నీ బోధన కాదంటావా, నాగభూషణం?"

దివాకరరావు కోపదృష్టితో చూచి ప్రశ్నించాడు.

"నాదేమి లేదు ఇందులో. అమ్మాయి తన యోగ్యతకు తగ్గ వెల నిమ్మంటూంది. అంతే."

"అంతలోనే మీ అమ్మాయి వెల ఎక్కిందంటావా?"

"ఎక్కకేం, బాబూ? దానికేం యే మహారాజైన కళ్ళకద్దుకోడూ దాన్ని."

"మొదట ఆదరించి యీ స్థితికి తెచ్చిన ఉపకారాన్ని మరచిపోతూ వున్నారన్న మాట."

"రామరామ. ఎంత మాటన్నారు! పెట్టేది మీ దీపం. తినేది మీ అన్నం. అమ్మాయి వెల ఎక్కిందంటే అదికూడ మీ అనుగ్రహమే. అంతా మీ చలువే కదా, బాబూ? మీరివ్వాలి మేము తినాలి."

అని నాగభూషణం తన ధూర్త స్వభావాన్ని వెల్లడిస్తూ నక్కనైచ్యాన్ని ప్రారంభించాడు.

"అది వీలు పడదని మీ అమ్మాయికి చెప్పు, నాగభూషణం!"

"ఏదంటారు?"

"నెలకు వెయ్యి రూపాయలివ్వడం,"

"సరే, చెబుతా. కాని, ఒకవేళ ఆమె యిష్టపడకపోతే...."

"తర్వాత నీ భరతం మీ అమ్మాయి భరతం పడతా? దుర్మార్గుడా! మెత్తని వాడని మొత్తసాగారా నన్ను మీరు ముగ్గురు?"

"బాబూ! వృధా మాట లెందుకు? అడిగిందివ్వాలి. అమ్మాయితో ఉండాలి. లేకపోతే...."

"లేకపోతే?" అని దివాకరరావు లేచాడు గర్జిస్తూ.

"ఈ బెదిరింపు లేమి పనికి రావండీ. లేకపోతే మూటా ముల్లె కట్టాల్సిందే."

అని నాగభూషణం చరచర క్రిందికి దిగిపోయాడు. దివాకరరావు దిగ్భ్రాంతు డయ్యాడు.

ఇప్పటికే చేతనున్న పదిహేనువేలు చెల్లిపోయింది. మొన్ననే బ్యాంకునుండి ఐదువేలు తెప్పించుకొని దగ్గర ఉంచుకొన్నాడు. ఆ సంగతి కృష్ణకు తెలుసు. ఇప్పుడా డబ్బంతా కాజెయ్యాలని వారు పన్నాగం పన్నినట్టు అతని కర్థమైంది. పోనీ ఒకవేళ దాన్ని యిస్తేమాత్రం, కృష

మునుపటి ప్రేమను తనపై చూపగలదా! ఆమె మనసంతా యీలోగా మారిపోయినట్టుంది. ఈవారకాంతకు తృప్తి లేదని స్పష్టమైంది. ఇదంతా బిడ్డ పేరుతో తలిదండ్రులాడే నాటకమా? ఏమైతే నేమి? ఆమె మద్దత్తు లేనిది వారు మాత్రం సాహసించి అడుగుతారా?....

దివాకరరావు బుర్ర ఆలోచనలతో వేడెక్కి పోయింది.

# 21

క్రమంగా చీకటి పడే వేళయ్యింది. దీపాలు వెలిగించబడ్డాయి. ప్రాయికంగా దివాకరరావుకు క్రింది భాగములో నాగభూషణం కాపురముండే భాగానికి వెళ్ళడం అలవాటు లేదు. ఎప్పుడైన పని ఉంటే నాగభూషణమే మేడమీదికి వచ్చి అతనితో మాట్లాడి పోయేవాడు. ఇక కృష్ణ సంగతి సరేసరి. ఇప్పటికి నెల క్రిందటి వరకు యింటిలో ఉన్న కాలములో ఎక్కువ భాగం మేడమీద దివాకరరావుతోనే కాలక్షేపం చేస్తూ ఉండేది. కాని, యీనెల నుండి ఆమెలో కలిగిన మార్పు అతనికి స్పష్టంగా కనబడసాగింది. ఎప్పుడో వారానికి ఒకటి రెండు రోజులు.... అదయిన వస్తున్నాను కదా అని చూపేందుకు.... పైకివచ్చి కొంత సేపుండి పోతూ ఉంది.

కృష్ణ కిప్పుడు డబ్బుతో కొరత లేదు. వద్దంటే కూడ అది ప్రవాహరూపంగా వచ్చి ఆమె నాశ్రయిస్తూ వుంది. దాని కనుగుణ్యమైన అన్ని రకములైన మార్పులు ఆమెలో గోచరిస్తున్నాయి.

ఆరంభదశలో దైవికంగా తన్ను దివాకరరావు చేపట్టి, తనకై ఎంతో త్యాగం చేశాడనే సంగతి ఆమెకు బాగా తెలుసు. తన కొరకతడు డబ్బును

పిచ్చల విడిగా పాడుచేశాడు. తన్ను నమ్మిన భార్య కాపురాన్ని కన్నీటి మయం చేశాడు. తుదకామె జీవితాన్ని తృణీకరించాడు. కొడుకువలె ప్రేమ విశ్వాసాలతో ప్రవర్తించే తమ్ముని కాదన్నాడు. కులగురు గౌర వాదులకు జలాంజలి విడిచాడు. ఇంత. తన కొఱకే త్యాగం చేశాడతడు. అతని అండదండలు లేకుంటే కృష్ణ మద్రాసుకు రాగలిగేదా? .... సినిమాల్లో ప్రవేశముండేదా? - ఆమె యింతటి ఉచ్చ దశకు వచ్చేదా?....

ఇవన్నీ తలచుకొని ఒక్కొక్కప్పు డతనికై బాధ పడితే, తండ్రి ఒకవంక, తల్లి ఒకవంక చేరి "పిచ్చిపిల్లా! ఏరు దాటేవరకే తెప్ప కావాలి. దాటించిందికదా అని దాన్ని నెత్తిన పెట్టుకొని ఊరేగే వెంగళప్ప లుంటా రటే, కృష్ణా! ఇంతకు ఎవరి మంచి చెడ్డల కెవరు బాధ్యులు? ఎవరి అదృష్ట దురదృష్టాలు వారివి. అవి సమకూరే వేళకు వ్యక్తుల కొకరితో ఒకరికి వియోగ సంబంధాలు తమంతకు తామేర్పడుతాయి. ముఖ్యంగా నీవదృష్ట వంతురాలవు. ఆ అదృష్టం నీకు దివాకరరావు వల్లకలిగింది కాదు. ఇది నీ పూర్వజన్మ పుణ్యఫలము. అది నీకబ్బింది. ఇందుకు దివాకరరావు నంతగా పొగడడం దేనికి? ఆద్యంతమతన్ని మనవద్ద ఉంచుకోవడం దేనికి? అతడు బ్రతికినంత కాలం అతనితో నీవు కాపురం చేయాలని అగ్రి మెంటు వ్రాసియిచ్చామా? తాళిగట్టిన భార్య కాకపోతివి. నడుమ వచ్చిన సంబంధం నడుమనే పోనిద్దూ."

అని దుర్బోధనలు చేసి ఆమె మనసును వెంటనే మార్చివేయ సాగారు. పాముపిల్లది విషపూత్కారమే కాని, అదిసుధామధుర మౌతుందా కృషకూడ మనసు దిటమొనర్చుకొంది, యింక దివాకరరావుతో సంబంధానికి స్వస్తి చెప్పడానికి.

ఈ మధ్యకాలములో కాంతారావు ఆమె మచ్చికలో బాగా పడ్డాడు. ఒకవైపు అతడు తీసే పిక్చర్లలో హీరోయిన్‌గా నటిస్తూ, మరొకవంక ఇక

ముందాతని జీవితములో కధానాయిక అవటానికి కావలసిన యేర్పాట్లన్ని చేయిస్తూ వుంది.

ఈ తతంగం దివాకరరావు కింకా తెలియదు. తిన్న ఇంటి వాసా లెంచే పడుపుక త్తెల ప్రకృతి గుణాలతని కనుభవములు కావింతవరకు.

తుదకు నాగభూషణం కూడ ఇంతకు సాహసించి మాట్లాడాడంటే ఆ కృతఘ్నుని మీద దివాకరరావుకు పట్టరానంత కోపం వచ్చింది. కాని వానిని తానిప్పుడేమి చేయగలడు? అతడిప్పుడు పూర్వమువలె తన సహాయాన్ని కోరే స్థితిలో లేడు. సింహాద్రిపురములాంటి పల్లెలో లేడు. మద్రాసు సిటీలో - సుప్రసిద్ధురాలై రెండు చేతులతో వేలకు వేలు ఆర్జించే బిడ్డతో సుఖపడే నాగభూషణం తన కంటే ఇప్పుడధికుడన్యాడు సంఘం దృష్టిలో.

ఆ రాత్రి మరల కృష్ణ మేడమీదికి రాలేదు. "ఈ బెదరింపులేవీ పనికిరావండీ. లేకపోతే మూటాముల్లే కట్టాల్సిందే" అన్న నాగభూషణం తుది మాటలింకా చెవులకు ములుకలై దివాకరరావును బాధిస్తూ ఉన్నాయి. అతనికి నిద్దురపట్టలేదు.

తన పూర్వ, ప్రస్తుత పరిస్థితులను గురించి తనలో తాను దీర్ఘంగా ఆలోచించుకో సాగాడు....

సింహాద్రిపురములో తమవంశమెట్టిది....తమ పెద్దల గౌరవమెట్టిది.... తానున్న స్థితి యెట్టిది. ఇప్పుడున్న స్థితియెట్టిది....

ఆలోచించుకొనేకొలది దివాకరరావు ఆకాశము నుండి పాతాళానికి పడిపోయిన వానివలె తల్లడిల్లిపోయాడు.

తన్ను గురించి లోకమిప్పుడెంత అవహేళనచేస్తూ, నీచంగా చూస్తుందో మనోనేత్రం ఎదుట చిత్రపటములోవలె స్పష్టంగా గోచరిస్తూ ఉంది.

తన్ను వలలో వైచుకొని, తనదగ్గర డబ్బులాగి, తనవల్లనే పైకివచ్చి యిప్పుడు తన్నే హీనపరచి, పాత చెప్పునువలె అవతలికీడ్చివేసే కృష్ణను కాని, ఆమె తల్లిదండ్రులను కాని లోకమేమి అనలేదు. అదంతా వారి కులగుణ స్వభావమంటుంది. అంతే, ఇక తనసంగతో....ఎంతకైనా గర్హింప దగియున్నది.

అన్నిటిని మించిన మహాపరాధము తాను భార్యకు, తమ్మునికి చేసిన ద్రోహము....

వివాహము కాకముందు తాను రామమోహనుని ప్రేమించినదైన, పరిస్థితుల ప్రాబల్యాన్ని గుర్తించి, మూర్ఖురాలు కాకుండ, హృదయములోని పూర్వప్రేమను కడిగివేసి, తనపై మనసంతా నిలిపి తన్నే దైవముగా తలంచి సేవింపవచ్చిన గృహలక్ష్మిని.... సాధుమతిని.... ఇల్లాలిని.... నిరప రాధిని....కాలదన్ని, ఒక వెలయాలినే పరమ సాధ్విగానమ్మి ఆమె వెంట పారివచ్చిన తన ద్రోహము అల్పమగునా?....దివాకరరావీ సంగతిని తలచి, తలచి పశ్చాత్తప్తుడై కుమిలిపోసాగెను.

అందరికి రామమోహనునిలాంటి తోబుట్టువు లభించగలడా? తన సుఖముకొరకు తన జీవితానందాన్ని త్యాగముచేసి....తన్ను పితృ వాత్సల్య ముతో చూచుచుండే తమ్ముడతడు.

కృష్ణవెంట తాను బుద్ధిహీనుడై పారివస్తూ, తన ద్రోహచర్యలను సమర్థించుకొంటూ కఠసారి తమ్మునికి తాను వ్రాసిన జాబును తలంచి దివా కరరావు సిగ్గుతో, దుఃఖముతో కళవళపడిపోతున్నాడిప్పుడు. అతని కన్నుల వెంట నీరుకారాయి.....తన్ను తాను శపించుకొన్నాడు. ఆ సమయము దీనమైన ముఖాలతో తన మనో నేత్రమునకు కాన్పించిన భార్యను, పరిపరివిధాల ప్రతిమాలుకొన్నాడు క్షమింపుమని....

రేయి అంతా నిద్రలేని కారణంచే దివాకరరావు

తొమ్మిదిగంటలైంది. మేడమీదనే అతని కొరక బాత్‌రూము, మరుగుదొడ్డి ఉన్నాయి. కాలకృత్యములు తీర్చుకొని స్నానం చేసేసరికి, క్రింది నుండి వాడుక మేరకు కృష్ణ నౌకరుతో పంపుతూవుండిన కాఫీ, టిఫిన్ రాలేదు, ఎవ్వరూ తిరిగి చూడలేదు.

క్రిందటి రాత్రి అతడింటిని గురించి, భార్యా తమ్ములను గురించిచేసిన ఆలోచనలు, పడిన పాశ్చాత్తాపము మరల మరల మనసునకు తట్టి తా నిక ముందేమిచేయవలెనో హెచ్చరింపసాగాయి దివాకరరావును.

దుస్తులను ధరించి, మామూలుగాఉంచుకొన్నట్టు తన హ్యాండ్ బ్యాగ్‌లో తనవద్ద మిగిలిన డబ్బు లెక్కించి ఉంచుకొన్నాడు. అందులో ఇప్పటికి నాలుగు వందలు మాత్రము మిగిలిఉంది. ఇరవై వేలలో సుమారు పదిహేనువేలు కృష్ణ నగలకే పొయ్యింది.

దివాకరరావు గదికి తాళమువేసి బిరబిర మెట్లుదిగి క్రిందికి వచ్చాడు. క్రింది భాగం తలుపుతీసి ఉంది. లోపల తచ్చాడుతూవున్న నాగభూషణం అతని కంటికి కనపడ్డాడు. కాని, ఒకరి నొకరు మాట్లాడించుకోలేదు. పోర్టికోలో కారు ఉండుటను చూచి కృష్ణ యింకా బయటికి వెళ్ళిపోలేదని గ్రహించాడు దివాకరరావు. అతడు హోటల్‌కు వెళ్ళి టిఫిన్ తీసికొని టాక్సీలో ట్రిప్లికేన్ బీచికి వెళ్లిపోయాడు.

దివాకరరావు వెళ్లిపోయాక నాగభూషణం కృష్ణను, సుందరిని హాల్లోకి పిలిచి ఆ దినం అతనిని వదిలించుకునే విషయాన్ని గురించి తన ఆలోచనను చెప్పాడు. ముగ్గురు ఒక నిర్ణయానికి వచ్చారు. తదనంతరం ...ష్ణ కారులో కూర్చొని కాంతారావు ఇంటికి పొయ్యేందుకు ముందుగేటు ...న్న ఘూర్కా కొరక మూతవేయబడిన కవరు నిచ్చి, దివాకరరావు ...నే దాన్ని యిమ్మని చెప్పి వెళ్లిపోయారు.

...ే కాంతారావు కృష్ణను రిజిష్టర్ మేరేజి చేసికోవలెనని

నిశ్చయించుకొన్నాడు. అందు కామె సంతోషముతో సమ్మతించింది. ఈ విషయం ఒక్క దివాకరరావుకుమాత్ర మింతవరకు తెలియదు. కాంతా రావు నిర్ణయించుకొన్న శుభదిన మాదినమే. అంతకు రెండు దినాలకు ముందుగానే జరుగవలసిన యేర్పాట్లన్నీ సమగ్రమయ్యాయి.

అనుకొన్నట్లు ఆ దినం సుమారు పండ్రెండుగంటలవేళ కాంతారావు కృష్ణను, ఆమె తలిదండ్రులను, మిత్రులు నలువురినిపిలుచుకొని పెండ్లిండ్ల రిజిస్ట్రార్‌గారి ఆఫీసుకు వెళ్ళాడు. ఒక గంటలో జరగవలసిన తతంగా న్నంతా జరిపి, ఆ సర్కారు పౌరోహితుడు కృష్ణా కాంతారావులను ఆలు మగలుగ కలకాలం వర్ధిల్లాలని ఆశీర్వదించాడు. మిత్రులు వారిద్దరిని అభినందించారు. నాగభూషణం, సుందరి ఆనంద బాష్పాలతో బిడ్డను కౌగిలించుకొన్నారు.

సాయంకాలము ఐదుగంటలకు కాంతారావు యింటిలోనే బ్రహ్మాం డంగా విందు యేర్పాటుజరిగింది. మద్రాసులో ప్రసిద్ధులైన సినీమాక్లర్లు, తారలు మొదలైన వారంతా కాంతారావు, కృష్ణలచే ఆహ్వానితులై, విందు కువచ్చి నూతన దంపతులను ఆశీర్వదించి అభినందించి వెళ్ళారు. నాటి ప్రముఖ వార్తా పత్రికల్లో కృష్ణా కాంతారావుల వివాహవిషయం ప్రకటించ బడింది. తమకా సమయములో మిత్రులంతా పంపిన శుభసందేశాలనందు కొని కృతజ్ఞత తెలుపుతూ వారిద్దరు పంపిన ప్రకటన కూడ అన్ని ఆంధ్ర, ఆంగ్ల పత్రికల్లో కన్పించింది.

మధ్యాహ్నం బృందావన్ హోటల్లో భోజనంచేసి దివాకరరావు ఆనాటి "ఆంధ్రప్రభ" తిరుగవేస్తూ వుండే అందులో ఒకచోట పెద అక్ష రాల్లో కృష్ణా కాంతారావుల యొక్క రిజిష్టరు పెండ్లి విషయమైన ప్రకటన కన్పించిందతనికి.

వెంటనే అతని శరీరములో వెయ్యి తేళ్ళొక్కసారి కుట్టినంత బాధ

జనించింది. ఇంతవరకు అతని కాసంగతే తెలియదు. లోలోన యీ రీతిగా గూడుపుఠానిచేసి తన్ను వారంతా కలిసి మోసగిస్తారని కలలోకూడ తలచి ఎరుగడు. తన కన్నులనే తాను నమ్మకుండ ప్రకటనను పదిసార్లు చదువుకొన్నాడు. ఒక్కొక్క అక్షరం అతని ఎదలో శూలమువలె గ్రుచ్చుకొంది.

ఇప్పుడింకేమిచేయాలి? కృష్ణ తల్లిదండ్రులతో చేరి తన్ను పూర్తిగా త్యజించడమే కాక మోసగించింది – నాశనముచేసింది – ప్రాతబట్టను వలె యీడ్చి అవతలికి పారవేసింది. ఆమె ఇకమీద తనదికాదు. ఆమెమీద తనకెట్టి అధికారము లేదు –

సంగతులన్నిటిని తలచుకొంటూఉంటే దివాకరరావు తల దిమ్మెక్కిపోతూవుంది. రెండు నెలలుగా – తత్రాపి రెండు వారాలుగా – తనయెడ వారు చూపుతూ వచ్చిన ఉదాసీన భావానికి – నిన్నటి దినం నాగభూషణం ఖచ్చితంగా చెప్పిన ఆఖరిమాటలకు తగిన కారణం దివాకరరావునకిప్పటికి బాగ అర్థమైంది. కాని, అతడేమి చేయగలడు?

ప్రకటనలో తెలుపబడిన రీతిగా కృష్ణాకాంతరావు లిద్దఱు ఆపాటికి ఆలుమగలై కులుకుతూఉంటే, దివాకరరావు హోటల్ కుర్చీలో కూర్చొని అనంతమైన మనోవేదనపాలై కన్నీరుకారుస్తూ ఉన్నాడు అతని హృదయము భగ్గునమండి పోతూవుంది.

సాయంకాలము ఐదుగంటలకు దివాకరరావు ఒకరిక్షాలో కృష్ణ యింటికి తిరిగి వచ్చాడు. మనసొకవంక అనంత విచారసాగరంలో పడి కొట్టుకొంటూ వుంటే, మరియొకవైపు కోపఘూర్ణితమై కృష్ణ నాడినము హత్యచేద్దామా అనేంతవరకు విజృంభించిపోయ్యింది.

ఇంటి తలుపులకు తాళం వేయబడింది. గేటువద్ద నిలబడిఉన్న ఘూర్కా దివాకరరావుకు సలాంచేసి కృష్ణ యిమ్మన్నదని ఆమె యిచ్చిపోయిన కవరు నందిచ్చాడు.

అది కృష్ణా కాంతారావుల వివాహసందర్భములో నాటిదినం కాంతారావు ఇంట జరుపబడే విందునకు రావలెనని కోరే ఆహ్వానపత్రిక.

పుండుమీద కారము రాచినట్టుంది దివాకరరావు మనసులో. తల పట్టుకొని, చెప్పరాని మనోవేదనతో చిరచిర తనగదిలోకి వెళ్ళి పడక కుర్చీలో కూర్చొని కన్నులు మూసుకొన్నాడతడు.

క్రమక్రమంగా దివాకరరావు మనసు నావరించిన నిరాశ, మోసము, దుఃఖము, అనే ప్రబలాంధకారము కొంత తగ్గి దాని స్థానములో కొంత వివేకమనే వెలుగు గోచరించింది – ,

"ఇప్పుడింక నే నేమిచేయాలి? ఈ పకుపుకత్తె నన్ను అన్నివిధాల మోసగించింది. నా భ్రాంతికూడ తొలగిపోయ్యింది. ఇంక నేనీయింటిలో ఒక అరక్షణమైన ఉండరాదు. బహుశ యీపాటికి ఆ రాక్షసులు ముగ్గురు కాంతారావు యింట్లో విందు సందర్భములో సంబరపడుతూ ఉంటారు. వారు వచ్చేలోగా నేను వెళ్ళిపోవాలి." అని దివాకరరావు తన కర్తవ్యాన్ని నిర్ణయించుకొని, వెంటనే మేడదిగి వచ్చి, ఒక టాక్సీలో తన వస్తుపరికరముల నన్నీ ఉంచుకొని రాయపురం మోడరన్ హిందూహోటల్‌కు వెళ్లిపోయాడు, అక్కడికి వెళ్ళి ప్రభాకరశాస్త్రిని కలిసికొని, తన దుఃఖమంతా వెళ్లబోసుకొని, ముందు చేయవలసినదాన్ని నిర్ణయించు కోవలెనని ఆతని నిశ్చయము.

కృష్ణ యింటినుండి వెళ్లిపోయేముందు దివాకరరావు తనకు సలాము చేసిన ఘూర్కా చేతిలో ఒక ఐదురూపాయలనోటు వుంచి, ఇంటివారు వచ్చి అడిగితే ఎక్కడికో సామానులతోబాటు వెళ్లిపోయాడని మాత్రం చెప్పుమన్నాడు.

దివాకరరావు వెళ్లిన సమయానికి శాస్త్రి నెం. 25 గదిలో లేడు.

తాళం వేయబడింది. హోటల్ మేనేజరును విచారించగా శాస్త్రి యింకా అదేగదిలో ఉన్నాడని, ఎక్కడికో బయటికి వెళ్ళాడని తెలిసింది.

ఆ సమయానికి నెం. 26వ రూము ఖాళీగా ఉందని విని దివాకరరావు అడ్వాన్సు చెల్లించి తానాగదిలో ప్రవేశించాడు.

ఆ దినము శాస్త్రి తన్ను అకస్మాత్తుగా చూచిందే కాని, మళ్ళీ కనబడ లేదు దివాకరరావుకు. వాస్తవస్థితిలో శాస్త్రి దినానికి రెండుమూడు సార్లా వీధిలో యింటిముందు తచ్చాడి పోతూనే ఉన్నాడు. మరల దివాకరరావు కనబడగలడేమో, సింహాద్రిపురంలో యింటివార్తలన్ని చెప్పుదామని. కాని, ఉభయులు మరల ఒకరినొకరు చూచుకోలేదు.

తనగదిలో కూర్చొని దివాకరరావు శాస్త్రికొరకు నిరీక్షిస్తూ వుంటే రాత్రి ఎనిమిదింటి కతడు వచ్చాడు. దివాకరరావే అక్కడికి వచ్చి తన్ను పలుకరించేసరికి ప్రభాకరశాస్త్రి తన కన్నులను తానే నమ్మలేక ఆశ్చర్య పడ్డాడు. అతని మనసులో ఆశాజ్యోతి తళుక్కుమని మెఱసిందికూడ.

# 22

రామమోహన్ డబ్బుఖర్చున కెంతమాత్రం వెనుదీయకుండ బెంగుళూరినుండి క్షయరోగ చికిత్సయందు నిపుణుడని ప్రసిద్ధిచెందిన ఒక డాక్టరును సింహాద్రిపురానికి పిలిపించుకొని, పదినెకు చికిత్స చేయించసాగాడు. డాక్టరు ఎప్పుడే మందులు కావాలంటే వానిని తెప్పించి యిచ్చాడు. యశోద ఆహార పథ్యాదులను గురించి డాక్టర్ సలహా 'తు - చ' తప్పకుండ అనుసరింపబడుతూ వుంది.

ఈ విధంగా ఒకనెల జరిగింది. ఇందుకొరకా నెలలో మోహన్ మూడువేలు ఖర్చుచేశాడు. బిడ్డ జీవితాన్ని కాపాడేందుకు మోహనుడు పడే తంటాలునుచూచి సునంద, వేంకట్రామయ్య ఆతనిని చూచినప్పుడంతా భారంగా నిట్టూరుస్తూ వచ్చారు.

ఎన్నిచేసిన దైవనిర్ణయమేమో కాని యశోద కోల్కొనలేదు. మందులన్ని పాముపుట్టలో పోసిన పాలవలె వృధా అయిపోతున్నాయి. యశోద మిక్కిలి అయిష్టంగా మరది, తల్లిదండ్రుల సంతృప్తికొరకు ఇన్ జెక్షన్ లు, మందులు తీసికొంటూ ఉందేకాని, తనకారోగం బాగుకాదని ఆమె ఏనాడో గ్రహించింది. ఈ నిర్బంధ చికిత్సవల్ల ఆమెపడే దేహ బాధ నందరు గమనిస్తూ వచ్చారు.

మనోవేదనకు తోడు యీ శరీర బాధ ఎందుకని మోహను డొక నాడు "వదినా! నీ దేహస్థితి ఎట్లుంది?" అని అడిగాడు.

"మోహన్! నేను నోటితో చెప్పాలా? కనబడటంలేదా? ఇప్పటి కింత ఖర్చుచేసి యిన్నిమందులిప్పించితివి కాని లాభమేమైన కనబడిందా? ఇది మనోరోగమని మీ కందరికి తెలుసు. దీనికి మందివ్వగల డాక్ట రెవడు? నీవు ప్రభాకరశాస్త్రిని మద్రాసుకు పంపావుకదా అదొక్కటే యిందుకు మందు. అతనిప్రయత్నం ఫలించిందా యింకేమందు నా కక్క ర్లేదు, నాయనా! అదైనా యింక పది, పదిహేను రోజుల్లో సానుకూల మైతే నేను మీకు దక్కగలను. లేదంటే, నా ఆశను మీరింక వదులు కోండి. వృధా యీ చికిత్సలకు డబ్బు తగలెయ్యకు. నే నీ బాధను భరించలేను." అని యశోద మరదికి సమాధానం చెప్పింది.

శాస్త్రి మద్రాసునుండి వ్రాసే జాబులేవి అంత ప్రోత్సాహకరంగా లేవు. అన్నయింటికి తిరిగి వచ్చే ఆశ తమ్మునికి లేదు. అయిన, అతడు వదినెతో ఆశాజనకంగా మాట్లాడుతూ వచ్చాడు. "ఏదీ, మీ అన్న

గారు వ్రాసిన జాబులు చూపించు"మని ఆమె అడిగితే మాత్రం పెదవి విరుస్తాడు. దానికికూడ ఆమె "మోహన్! నీకు నా మీద ఉండే అభిమానం కొద్దీ యీ రీతిగా అసామాన్యమైన ప్రయత్నం చేస్తూ ఉన్నావు కాని, వారింటికి తిరిగి వచ్చే ఆశలేదు, నాయనా!" అని నిస్పృహతో కన్నీళ్ళుకార్చింది.

బాష్ప క్లిన్నమైన ఆమె చీర చెరగు తడి ఆరినదినమే లేదు.

డాక్టరుకూడ ఒకనాడు రహస్యంగా మోహన్‌తో చెప్పాడు "మిష్టర్, మోహన్! ఇంక చికిత్సవల్ల లాభంలేదు. ఇప్పటికి నా శాయశక్తులా పోరాడినాను. దైవసంకల్పమన్యథా ఉన్నప్పుడు మానవ మాత్రులేమి చేయగలరు? వృధా మందుమాకులకింక డబ్బు తగలెయ్యకుండ యేమైన పూజాపునస్కారాలతో సంతృప్తిపడండి. మీద దైవకృప - మీ అదృష్టం." అని.

అటు తర్వాత రెండుదినాలకు డాక్టర్ వెళ్ళిపోయాడు. వేంకట్రామయ్య శంకరభట్టుతో ఆలోచించి సూర్యారాధన, నవగ్రహారాధన మొదలైన పూజ లారంభింపజేశాడు.

మృత్యువుతో హోరాహోరిగ పోరాడుతూవుండే బిడ్డ మొగంచూచినప్పుడంతా సునంద, వేంకట్రామయ్య హృదయాలు తరుక్కుపోతున్నాయి. తల్లి క్షణంసేపైన బిడ్డ పంచనువదలటంలేదు.

క్షయ అంటే భయంకరవ్యాధి. అది అంటురోగం కాబట్టి జాగ్రత్తగా ఉండాలిఅని డాక్టరు అందరిని హెచ్చరించి పోయాడు కాని, కన్నకడుపుగల తల్లి ఆ మాటలను లక్ష్యపెట్టలేదు. తానూ బిడ్డవెంట పోతే చాలునని అంటుంది. కాని, ఆ మాటకు యశోద మరింత విచారపడ సాగింది.

శంకరభట్టు యింటివారు తఱుచువచ్చి చూచుకొని పోతున్నారు. వంటమనిషి రంగమ్మయింట్లోనే ఉంది.

రామమోహన్ ఒకనాటి సాయంకాలం వార్తాపత్రిక నొకదాన్ని పట్టుకొని వచ్చి వదిన కందులోని ప్రకటనను చూపి "చూడు, వదినా! కృష్ణ కాంతారావనే సినిమాడైరెక్టరును వివాహమాడిందట. ఈ కృష్ణ యీ వూరిదే. అంటే అన్నయ్యా కామెతో సంబంధం వదలిపోయ్యిందని తెలుస్తూవుంది. ఈ సంగతులన్నీ సమర్థిస్తూ ఇంక రేపో ఎల్లుండో ప్రభాకరశాస్త్రి ఉత్తరం వ్రాస్తాడు. ఇది నిజమైతే, కృష్ణ పీడ వదలి పోతే, అన్నయ్యా ఇంటికి రాక మరెక్కడికి వెళ్ళుతాడు. ఇది కొంత శుభసూచకమే అనుకొంటా" అని యేదో సంతృప్తిగా తన అభిప్రాయం వెలిబుచ్చాడు.

యశోద ఏమి మాట్లాడలేదు. ఆమె పెదాలమీద మ్లానమైన హాసం జనించి అంతలోనే అంతరించి పొయ్యింది.

రామమోహనుడు తెలిపిన సంగతినిబట్టి అప్పుడక్కడే ఉన్న శంకరభట్టు, వేంకట్రామయ్యా మొదలైన వారంతా తమకు తోచిన రీతిగా వ్యాఖ్యానించారు. మొత్తంమీద అందరిలో ఒకరీతి ఆశాభావ ముదయించింది. కాని,

కాని, యశోద కొన్నినిముషముల తరువాత యిట్లనింది నీరసంగా, "ఆ కృష్ణ, యీ కృష్ణ ఒకటే అని ఎలాచెప్పగలవు?" అని మోహన్‌తో.

"డైరెక్టరు కాంతారావు చేరదీసింది యీ వూరి కృష్ణనే వదినా? ఆ సంగతిని శాస్త్రికూడ సమర్థించి వ్రాశాడుకదా."

"ఒకవేళ అది నిజమైన, మీ అన్నయ్యా యింటికి తిరిగివస్తారనే గ్యారంటీ యేముంది?"

"శాస్త్రినుండి జాబువస్తే సంగతులన్ని విశదమౌతాయి."

ఆ రాత్రి భోజనాలయ్యాక యశోద తల్లిని తనవద్దకు రమ్మని, పిలిచి, మిక్కిలి ఆయాసపడుతు, "అమ్మా, అన్నపూర్ణమ్మ పిన్నిని, శంకర భట్టును పిలిపించమ్మా" అనింది.

"ఎందుకమ్మా?" అని తల్లి అడిగితే యశోదబదులు చెప్పలేదు. వారిని పిలిపించుమని మళ్లీ చేసైగతో చెప్పింది.

ఆమె స్థితినిచూచి అందరు భయపడినారు. ఉండవలసిన వారంతా ఆమె దగ్గరనే ఉన్నారు. అందరి హృదయాలు ఎందుకో దడదడలాడి పోతున్నాయి.

రాత్రి పదిగంటలైంది. యశోద రామమోహనుని యీలోగా ఎన్నడు దగ్గరికి పిలిచి అంత ప్రశాంతంగా మాట్లాడించింది కాదు.

"మోహన్! ఇటురా, నాయనా!" అనింది.

వదినె యెందుకావేళ అట్లుందో, తన్నెందుకు పిలిచిందో పాలుపోక మోహన్ పసిపిల్లవానివలె వెళ్ళి యశోద మంచము దగ్గర నిలబడ్డాడు. యశోద తల్లానుకొని కూచుంది. "మోహన్! నీవు నాకొక మాట యివ్వాలి సుమా!"

ఆమె మాట ఎక్కడో అగాధము నుండి వినబడినట్టుంది. ధ్వని అంతకంతకు సన్నగిలిపోతూంది. సునంద, అన్నపూర్ణమ్మ కళ్ళలో నీరుంచుకొన్నారు.

వదిన అడిగే వాగ్దాన మేమిటో మోహన్‌కు అర్థంకాలేదు.

"ఏమిటమ్మా ఆ మాట, వదినా?"

"అదేదైన కాని, నీ వదిన మాట్లాడగలిగేది యింక కొన్ని నిమిషాలసేపే. ఆలోగా నా మనస్సంతోషానికి నీవు వాగ్దానం చేయాలి.

అశుభం పలుకవద్దని అందరు యశోదను బతిమాలారు. కాని ఆమె లీలగా నవ్వి అందరివైపు ఒకమారు కన్ను త్రిప్పి చూచింది తృప్తిగా.

"మాట్లాడవా, మోహన్?"

"నీ మనశ్శాంతి కొరకేమైన చేయగలను, వదినా!"

"నిజమేనా? మాట తప్పవుకదా?"

"లేదు. దైవసాక్షిగా తప్పను."

మరల యశోద పెదవులమీద చిరునవ్వు తాండవించింది. అందులో యేదో సంతృప్తిద్యోతక మయ్యింది. ఆమె కన్నులు మూసుకొని, ఆయాసము నుపశమింప జేసికొనేందుకు, ఒక నిమిషకాలము తల్లి ఎదపై తల నానించి పండుకొని, మళ్ళి కండ్లు తెరచి మెల్లిగ, అస్పష్టంగా "నీ – వు పెం – డ్లి – చే – సు – కో – వాలి." అనింది.

ఆ మాట విన్నవెంటనే మోహనుడు ఉలికిపడి బిగ్గరగా "వదినా.." అని అరచాడు.

ఆమె కది తుది క్షణమని అందరికి అర్థమైంది. యశోద కన్నులు తెఱవలేదు – మరి మాట్లాడ లేదు. చేతిని మెల్లగ ఎత్తి మఱదిని ఆశీర్వదించింది....

శంకరభట్టు తక్షణమే లోపలికి పారిపోయి తులసి తీర్థాన్ని తెచ్చి యశోద నోటిలో ఒకటి రెండు ఉద్ధరిణిలు పోశాడు....

ఆమె తల ప్రక్కకు వాల్చేసింది. యశోద ప్రాణవాయువులు

అనంత విశ్వములో లీనమైపోయాయి. అది గమనించి తల్లి "అమ్మా! యశోదా!" అని యేడ్పు లంకించింది. అందరు గొల్లు మన్నారు.

అందరు ఈ పరిణామాన్ని ఎదురు చూచారు. కాని, అది ఇంత శీఘ్రంగా వస్తుందని ఎవ్వరు తలంచ లేదు. క్షయరోగమూలాంటిదని అనుభవజ్ఞులంటారు.... అది మాట్లాడుతూనే రోగిని కళ్ళు మూపించేస్తుందట....

ఇప్పటికి సుమారు ఎనిమిది మాసముల నుండి యశోద కాపురం కన్నీటి మయమై పోయింది. మృతితో కాని ఆమెకు మనశ్శాంతి – ఆత్మ ంతి – కలుగ లేదు.

అకస్మాత్తుగా వచ్చి హోటల్లో బస చేస్తూ తనకై ఎదురుచూస్తూ ఉన్న దివాకరరావును చూచి ప్రభాకరశాస్త్రి "ఏమండీ, దివాకరరావుగారూ! యీలా దయచేశారెందుకు?" అని ప్రశ్నించాడు.

"ఈ పట్టణంలో నాకేమి యిల్లా? వాకిలా? నీకుమల్లే నాకూ హోటలేకదా శరణ్యం."

"మీరు టి. నగర్‌లో ఉన్న యిల్లేమయింది?"

"ఉద్వాసన కలిగిందచ్చటి నుండి."

"మీతో ఉన్నవారి సంగతి?

"ఎవరికి వారే యమునా తీరే."

అని దివాకరరావు తన దురవస్థ నంతటిని మొదటి నుండి అప్పటి వరకు పూస గ్రుచ్చినట్టు శాస్త్రికి వినిపించాడు.

వేశ్యల వలలో పడ్డవారి గతి యేనాటికైన యీలాగే పరిణమించి

తీరుతుందని ముందే తీర్మానించుకొన్న శాస్త్రి తన అంచనా మేరకు పని నెరవేరినందుకు లోలోన చాల సంతోషించాడు.

"ఇప్పుడు చెప్పు, శాస్త్రీ, నన్ను ముందేమి చేయమంటావు? ఈ పాడుముండ నాశ్రయించుకొని వచ్చి రెంటికి చెడిన రేవణుడనై పోతిని. ఇప్పుడింకే మొగము పెట్టుకొని యింటికి పోగలను? నిరపరాధులైన భార్యను, తమ్ముని అనరాని మాటలని, వారిమీద అభాండాలు మోపి, వదలి వస్తిని. వారు నన్నింక మన్నిస్తారా? నే నిప్పుడేమి చేయాలి? చెప్పు. ఇంత విషము మ్రింగి చావటం మేలుకాదా?"

"దివాకరరావ్! నిరుత్సాహ పడకు. అయినదేదో అయిపోయింది. గతానికి వగచి లాభం లేదు. ఇప్పటికైన నీకు భగవంతుడు జ్ఞానోదయం కలిగించినందు కెంతో సంతోషపడాలి. వివేకవంతుడవు కాబట్టి, త్వరలో చేసిన తప్పిదాన్ని గుర్తించి పశ్చాత్తాప పడుతున్నావు. నీవనుకొన్నట్టు నీ భార్యకు కాని, తమ్మునికి కాని నీమీద ఎట్టి అసహ్యము, కోపము లేవు. ఏనాటికైన బుద్ధి కలిగి యింటికి వస్తే చాలునని వారు నీ కొరకు ఎదురు తెన్నులు చూస్తూ ఉన్నారు ఇంతకు నీవద్ద దాచవలసిన అవసరమే ముంది?"

అని ప్రభాకరశాస్త్రి తాను మద్రాసుకు వచ్చిన కారణాన్ని విశదీకరించి రామమోహనుడు వదినెకై మరియొక వంక, కులాభిమానాలకు వేరొక వంక ఎట్లు పరితపించి పోతూ ఉండేది స్పష్టపరిచాడు. యశోద అనారోగ్యదశను గురించి కూడ తెలిపి, సింహాద్రిపురమునుండి ఎప్పటికప్పుడు వచ్చిన ఉత్తరాల నన్నిటిని తీసి దివాకరరావు ముందు పడవైచినాడు.

అవన్నీ చదివి, శాస్త్రి చెప్పినదంతా విని దివాకరరావు సింహాద్రిపురానికి వెళ్ళవలెనని తహతహపడసాగాడు.

"శాస్త్రీ! నన్ను నా భార్య, తమ్ముడు క్షమిస్తారని నమ్మి ఊరికి వెళ్ళ దలచాను. రేపే వెడదాం, నీ అభిప్రాయ మేమి?"

"నా అభిప్రాయమేమి? నేను వచ్చినది నిన్ను తోడ్కొని వెళ్ళ టానికే గదా. దయామయుడైన ఆ భగవంతుడు నిరపరాధులైన నీ భార్య, తమ్ముల మంచితనానికి మెచ్చి, నాకు శ్రమ లేకుండ నీకు సద్బుద్ధి గరపి, నా వెంట పంపుతున్నాడంతే, నా మిత్రుని ఋణమును తీర్చుకొని ధన్యుడయ్యాడు. ఉదయం ప్రయాణ మవుదాము, నీ వింక ఆలోచించకు."

అని యిద్దరు ఒకే రూములో పడుకొని ఆ రాత్రంతా గతాన్ని గురించి మాట్లాడు కొన్నారు. దివాకరరావుయొక్క ప్రతి మాటలోను అతడనుభవించే అనుతాపము వ్యక్తమౌతూవుంది. అతనికి భార్యమీద తమ్మునిమీద కల మక్కువ శాస్త్రి చెప్పిన సంగతులు వింటూవుంటే అంత కంత కధికమై పోయింది.

ఆ మరునటి దినం ఉదయం పది గంటలకు మద్రాసు వదలిన వారిదరు మరునాడు ఒంటిగంటకు సింహాద్రిపురం బస్సు స్టాండులో దిగారు.

మహాపరాధం చేసిన నేరస్థుని వలె దివాకరరావు వంచిన తలపైకెత్త కుండ ఊళ్ళో ఎవ్వరికి మొగం చూపలేక సిగ్గు పడుతున్నాడు. ఎవరు చూచిన తన్నే వ్రేలెత్తి చూపుతు ఛీ కొడుతున్నారని అనుకొన్నాడతడు. శరీరము కంటే మనసు ముందే యింటికి పారిపోయి తన కాళ్ళమీద పడి, వానిని కన్నీళ్ళతో అభిషేకం చేసిన యశోదను, తన్ను కౌగిలించుకొని యేడ్చే తమ్ముని ఓదారుస్తూ వుంది,

ప్రభాకరరావు సామానులను ఒక కూలివానిచే మోయించుకొని దివా కరరావుతో బస్సుస్టాండు వదలి కొన్ని గజములు ముందుకు వెళ్ళి ఒక మలుపు తిరిగాడు. అక్కడక్కడ తెలిసినవారు కనబడి దివాకరరావును



## మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA105 B129 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 27/10/21 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 187 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | 1 to 22 ,77,78 |
| తయారు చేసినది | pratyusha |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |